# కాంచన ద్వీపం

## రాబర్ట్ లూయీ స్టీవెన్సన్






మాల

వెల. రూ. 1/8

# కాంచనద్వీపం

Kancha nitveepam

# (Treasure Island)



మూలం:

రాబర్ట్ లూయీ స్టీవెన్సన్

Rajart Luya Staewensan

అనువాదం:

నండూరి రామమోహనరావు

Nandurs Rama mohan Rao.

ఆంధ్రగ్రంథమాల,

మదరాసు-1.

# కాంచనద్వీపం

## 1. విచిత్ర వ్యక్తి

కాంచన ద్వీపానికి సంబంధించిన యావత్తు కథను ఏమీ దాచకుండా పుస్తకరూపంలో వ్రాయవలసిందని జమీందారు ట్రెలానీ, డాక్టరు లివ్‌సే, ఇంకా ఇతరమిత్రులు నన్ను ప్రోత్సహించారు. అందుచేత నాకుకూడా ఉత్సాహంకలిగి నాకు తెలిసిందంతా వ్రాయడానికి పూనుకున్నాను. కాంచనద్వీపం ఉనికిపట్టునుగురించి మాత్రం నేను వెల్లడిచేయ దలచుకోలేదు-అక్కడ ఇంకా త్రవ్వబడని ధనరాసులు ఉండడం మూలాన.

ఆ చిన్నతనంలో జరిగిన వింతసంఘటనలు ఇప్పుడు తలుచుకుంటే, అవన్నీ నిన్న మొన్న జరిగినట్టు అనిపిస్తోంది.

మావూరు సముద్రతీరానికి బాగా దగ్గర. ఊరికీ సముద్రానికీ మధ్యగా ఉండేది మా "ఎడ్మిరల్ బెన్‌బౌ". "ఎడ్మిరల్ బెన్‌బౌ" అనేది మా నాన్న నడుపుతున్న హోటలు పేరు. మాహోటలుకు చుట్టు

పల్లె చాలా దూరంవరకూ ఇళ్లు ఉండేవికావు. ఎప్పుడో గాని సాధారణంగా ఆచాయలకు ఎవరూ వచ్చేవారు కారు.

ఇలా ఉండగా ఒకరోజున మా ఇంటికి ఒక వింత మనిషి వచ్చాడు. వయస్సు అరవైపైగా ఉండవచ్చు. నల్లగా మాసిన బట్టలు, పొడుగాటిపిలక, కణతలమీద కత్తిగంటు, మోటుబారినవేళ్లు, పొడుగ్గా, బలంగా, బరువుగా, ఈలక్షణాలతో-అతడు మాయింటికివచ్చాడు. చూసీ చూడగానే అతడు ఏళ్లతరబడి సముద్ర జీవితం గడిపిన నావికుడని స్ఫురిస్తుంది. అతని వెనుక కూలివాడు పెద్ద కావడిపెట్టెను మోసుకొచ్చాను.

వృద్ధనావికుడు మా హోటల్లోకి అడుగు పెడుతూనే పడవవాళ్ల పాట లంకించుకున్నాడు. తరవాత కూడా అనేకసార్లు అతడు ఈపాటనే తనలో తను పాడుకోవడం విన్నాను :

గాసులకొద్దీ రత్నాలున్నయ్
యో-హో-హో-బలె గుమ్మైనరమ్ !
కిమ్మనకుండా గమ్మున తాగెయ్
యో-హో-హో-బలెగుమ్మైనరమ్ !

కర్ణకఠోరంగా ఉండేదతనికంఠం. ఆ గొంతుకలో ఒకటికాదు-రెండు మూడు గొంతుకలు దేనికది విడివిడిగా పలికేవి.

"అప్పిట్టి నక్కడ దింపరా అబ్బీ," అని కూలి వాడికి ఆజ్ఞాపించి ఒక బల్లముందు కూర్చున్నాడు. "ఎవరిక్కడ," అని బల్లమీద దౌర్జన్యంగా చరిచాడు. మానాన్న లోపల్నించిరాగానే "రమ్" అనిఅరిచాడు. (రమ్అంటే ఒక రకమైన సారాయం.) మానాన్న గ్లాసులో రమ్ తీసుకొచ్చి ఇచ్చాడు. గ్లాసును గట్టిగా ఒడిసిపట్టుకుని "ఓహో, ఓహో," అని రుచిని మెచ్చు కుంటూ నెమ్మదిగా, చాలాసేపు, ఊరించుకుంటూ తాగాడు. మధ్యమధ్య మాకేసి, మా హోటలు బోర్డు కేసి, దూరానశిఖరాలకేసి చూశాడు.

తాగడం పూర్తయింది. "బాగానే వుంది యీ హోటలు. ఇక్కడికి బాగా జనం వస్తూవుంటారా?" అని మా నాన్న నడిగాడు. రారని సమాధాన మిచ్చాడు మానాన్న.

"మరీ మంచిది ఇల్లాంటి చోటుకోసమే వెదుకు తున్నాను. ఇదుగో చూడు నేస్తం! నేను ఉన్నదున్నట్టు మొహంమీద కక్కేసేమనిషిని. నాకేం అక్కర్లేదు. వేళపట్టున ఇంత తిండి, ఇంత రమ్ పడేశావంటే నీ జోలి నా కక్కర్లేదు, నాజోలి నీకక్కర్లేదు. నాపేరు- నాపేరేదైతేనేంలే-నన్ను కెప్టెన్ అని పిలుస్తూవుండు. ఏమిటలా చూస్తావ్? ఓహో అదా-నీగొడవ. ఇంద, యీడబ్బు తీసుకో-"అంటూ కోటుజేబులోంచి మూడు నాలుగు బంగారు నాణాలు తీసి బల్లమీద విసిరేశాడు.

అతడు తను కెప్టెన్ (నౌకాధికారి) నని చెప్పుకున్నప్పటికీ అతని వాలకం చూస్తే కెప్టెన్‌లాగ లేనే లేడు. మామూలు కళాసీలాగానే ఉన్నాడు. పెట్టె తీసుకువచ్చిన కూలివాణ్ణి తరవాత అడగ్గా చెప్పాడు: ఈమనిషి అవాళ పొద్దునే టపాబండిలో దిగాడట. ఊళ్లో మంచిహోటళ్లు ఏమేమున్నాయో వాకబు చేశాట్ట. ఉన్న అన్నిట్లోకీ మాహోటలే మంచిదనీ, ఎప్పుడూ నిశ్శబ్దంగా, నిర్జనంగా, సముద్రానికి దగ్గరగా ఉంటుందనీ ఎవరో చెప్పారట. వెంటనే తనకు తగిన స్థలం ఇదేనని నిశ్చయంచేసుకుని ఇటు వచ్చాడట. ఇంతకుమించి అతన్నిగూర్చి మాకేమీ తెలియదు.

అతడు బాగా మితభాషి. పగలల్లా చంకలో ఇత్తడి టెలిస్కోపు పెట్టుకుని, కొండ గుట్టలమీదా, సముద్రతీరానా, ఒంటరిగా తిరిగేవాడు. చీకటి పడగానే తిరిగివచ్చి భోజన శాలలో చలిమంటకు దగ్గరగా కూర్చుని గ్లాసుమీద గ్లాసు రమ్ తాగేవాడు. ఎవరన్నా పలకరిస్తే పలికేవాడుకాదు. తలెత్తి గుడ్లురిమి చూసేవాడు; ముక్కుతో బుర్రుమని భయంకరంగా శబ్దంచేసేవాడు; ఈఅలవాటు గమనించి మేము కూడా అతని జోలికి పోయేవాళ్లం కాము. ప్రతి సాయంత్రం షికారునుంచి రాగానే నన్నో, మా నాన్ననో అడిగేవాడు: ఓడకళాసు లెవరన్నా ఆదోవన వచ్చారా అని. తనజాతివాడెవడూ దొరక్క

తోచడంలేదేమో, అందుకని అడుగుతున్నాడేమో అని అనుకునేవాళ్ళం మొదట్లో. కాని క్రమంగా తెలిసింది, నావికులెవరికీ కంట పడకుండా అతడు తప్పించుకుంటున్నట్టు. ఎప్పుడైనా నూటికీ కోటికీ ఎవడన్నా నావికుడు మా "ఎడ్మిరల్ బెన్‌బా"కు వస్తే (కోస్తారోడ్డునే బ్రిస్టల్ నగరానికి పోయేవాళ్ళు మా హోటలుకు వచ్చి విశ్రాంతితీసుకునేవాళ్ళులెండి.) మన కెప్టెన్ తలుపుసందులు గుండా ముందు తొంగిచూసి ఆ వచ్చిందెవరో తేల్చుకునిగాని ఇవతలకు వచ్చేవాడు కాదు.

అతడు ఎవరికోసం భయపడుతున్నాడో నాకు తెలుసు. ఎందుకంటే ఒకసారి నన్ను చాటుకు పిలిచి చెప్పాడు: ఒంటికాలి ఓడకళాసీ ఎవడైనా వస్తే తక్షణం తనకు చెప్పవలసిందని. అలా జాగ్రత్తగా పహారా కాస్తూవుంటే ప్రతినెలా నాకు నాలుగు పెన్నీలు భత్యం ఇస్తాననికూడా వాగ్దానం చేశాడు. నేను ప్రతి ఒకటో తారీకున నా భత్యంకోసం అడిగేవాణ్ణి. అతడు బుర్రుమని శబ్దం చేసి నాకేసి నిశ్చలంగా చూసేవాడు. ఇవ్వడం ఇష్టంలేదేమోనని నేను వెళ్ళిపోయేవాణ్ణి. కాని రెండు మూడు రోజులయ్యాక, నా జీతం నాకివ్వకపోతే వచ్చేనష్టం ఆలోచించుకొనేవాడల్లే వుంది – మాట్లాడకుండా వచ్చి నాలుగు పెన్నీలూ

నా చేతిలో పెట్టి మళ్ళీ హెచ్చరించేవాడు: "ఒంటికాలు ముండాకొడుకు వస్తేమాత్రం మర్చిపోకేం," అని.

"ఒంటికాలు పెద్దమనిషి" రోజులకు రోజులు నన్నెల్లా వెంటాడాడో మీకు చెప్పనక్కర్లేదను కుంటాను. హోరున కుంభవృష్టిగా వర్షం కురిసే అర్థ రాత్రిసమయాల్లో, ఈదురుగాలి మా కిటికీ తలుపులను దడదడా మొత్తేటప్పుడు, సముద్రపు కెరటాలు కల్లో లంగా లేస్తూ విరుగుతూ గర్జించేటప్పుడు, "ఒంటికాలు మనిషి" వెయ్యిరూపాలతో, వెయ్యివిధాలుగా నాకు గోచరించేవాడు. ఒకసారి మోకాలువరకూ కాలు తెగి వున్నట్టు, మరోసారి తొడవరకూ తెగివున్నట్టు తోచేది; ఒకసారి అతడు పుట్టడమే ఒక్క కాలుతో పుట్టినట్టు, అనిపించేది. ముఖ్యంగా నిద్రపోతు న్నప్పుడు ఆ రాక్షసవ్యక్తి నాస్వప్నాల చీకట్లో ప్రత్యక్షమై కొండలమీంచి కొండలమీదికి నన్ను తరిమేవాడు. నాలుగు పెన్నీలజీతం మాట దేవు డెరుగునుగాని, ఈ ఊహారాక్షసుడితో నే నెన్ని రోజులు బాధపడ్డానో చెప్పలేను.

కాని అన్నిటికంటే విపరీతంగా నన్నూ, ఇత రులను భయపెట్టింది మా కెప్టెన్ ప్రవర్తన. ఒక్కోసారి అతడు మితిమీరి తాగేవాడు; భోజనశాలలో బల్ల ముందు కూర్చుని చుట్టూ ఎవరున్నా లెక్కచెయ్య కుండా, గార్దభస్వరమెత్తి పల్లెపదాలు పాడేవాడు;

ఇంకోసారి అందర్నీ తనచుట్టూ కూర్చోమని ఆజ్ఞా పించి, ఏమిటేమిటో రకరకాల కథలు చెప్పేవాడు; లేకపోతే తను పాడే పాటలకు వంత పాడమనేవాడు. అందరూ గజగజ వణికిపోతూ అత డేం చెయ్యమంటే అదల్లా చెసేవారు. హోటలుకు వచ్చే అతిథులు కెప్టెన్ చుట్టూ ప్రాణా లుగ్గబట్టుకు కూర్చుని, "యో-హో-హో-"లతో ఇంటికప్పు లెగిరిపోయేట్టు పాడటం నా కిప్పటికీ బాగా జ్ఞాపకం. ప్రతివాడూ తనపక్కవాడి కంటే బిగ్గరిగా పాడటానికి ప్రయత్నించేవాడు; ఎందు కంటే ఎవరన్నా గొంతు కలపనట్లు కనిపిస్తే ఊరుకునే వాడు కాదు కెప్టెన్.

పూటుగా తాగి నిషామీదున్నప్పుడు కెప్టెన్ దగ్గిరలో ఉండటం అంత ప్రమాదం మరోటి లేదు; వజ్రాయుధంలాంటి చేత్తో బల్లమీద ధన్ మని గుద్ది "షటప్" అనేవాడు; తను కథ చెబుతుంటే ఎవరన్నా ప్రశ్న వేస్తే తారాజువ్వలాగ ఎగిరేవాడు; పోనీ ప్రశ్న వెయ్యకుండా ఊరుకుంటే. ఎవ్వరూ వినటంలేదని తప్పు పట్టేవాడు మొత్తానికి తను మస్తుగా తాగి, మత్తెక్కి నిద్రపోయిందాకా ఎవర్నీ హోటల్లోంచి కదలనిచ్చే వాడు కాడు. అతని కథలు బలే భయంకరంగాఉండేవి. హత్యలు. ఉరికొయ్యలు, సముద్రాలలో తుపానులు, ఎడారులలో దెయ్యాలు, దొంగతనాలు, దోపిళ్ళు-ఇవే అతని కథావస్తువులు. అతని కథల్ని, అతడు ఉపయో

గించే భాషనీ, బూతుల్నీ వింటుంటే ఇంతకంటే పరమ నీచుణ్ణి దేవుడు సృష్టించలేదనిపిస్తుంది.

"ఈ లుచ్చాగా డెక్కడ దాపురించాడ్రా మన ప్రాణాలకి? వీడి మూలాన మనహోటలుకి వచ్చే కొద్దిమందీకూడా మానుకునేట్టున్నారు," అని మా నాన్న అనేవాడు. నిజానికి మొదట్లో జనం కెప్టెన్‌ను చూసి భయపడ్డారుగాని క్రమంగా వారి భయం తగ్గిపోయింది. మా పల్లెటూరి మందకొడి జీవితంలో ఈ కెప్టెన్ మూలానే కాస్త సంచలనం అంటూ కలిగింది. ఏ కొత్తదనమూ ఏ ఉద్రేకము యెరగని మావూరి యువకులు అతనిచుట్టూ మూగి ఆవిచిత్రకథలు వినేవారు. కొందరు కొందరికి అతనంటే గౌరవంకూడా పుట్టి "ఇల్లాంటి ధైర్యవంతులు, సాహసులు ఉండటం మూలానే సముద్రాలమీద ఇంగ్లండుప్రభ అలా వెలుగుతోంది," అని మెచ్చుకునేవారు.

ఒకవిషయంలో మాత్రం అతడు మమ్మల్ని నాశనం చేశాడని, చెప్పకతప్పదు. వారాలు, నెలలు గడిచిపోతున్నా అతగాడు మాబసలోంచి కదల్లేదు. మొదట్లో ఏమిచ్చాడో ఇచ్చాడు; అంతే; మళ్ళీ ఒక్క పెన్నీ విదిలించలేదు. మానాన్న ఎప్పుడన్నా బాకీ సంగతి యెత్తితే భయంకరంగా బుర్రుమని, నిశ్చలంగా చూసేవాడు. మానాన్న హడలిపోయి అవతలికి జారుకునేవాడు. కెప్టెన్ మా ఇంటికి వచ్చింది మొదలు, చని

పోయేవరకు అవేబట్టలు, అదే టోపీ, అవే మేజోళ్ళు ఉపయోగించేవాడు. కోటు క్రమంగా చిరిగి పోయింది, కాని దాన్నే కుట్టుకుని తొడుక్కునేవాడు. చివరికి అతుకుల గుడ్డతప్ప కోటు అంటూ ఏమీ మిగల్లేదు. అతడు ఎవరికీ ఉత్తరాలు రాయడంగాని, అదనికెవరూ రాయడంగాని నేను చూడలేదు. మేడమీాద గదిలో మంచంకింద దాచిన కావడి పెట్టెనుకూడా అతడు తెరవడం నే నెప్పుడూ ఎరగను.

కెప్టెన్‌కు ఒక్కసారే "ఎదురుదెబ్బ" తగిలింది; అదైనా ఆఖరురోజుల్లో. మా నాయనకు పెద్ద జబ్బు చేసింది. ఒకరోజు సాయంత్రం డాక్టర్ లివ్ సేగారు రోగిని చూడటానికి మా యింటికి వచ్చారు. మా అమ్మ డాక్టరుగారికి భోజనం వగైరా ఆతిథ్య సత్కారాలు చేసింది. అదయింతర్వాత డాక్టరుగారు తన యింటికి తిరిగిపోవడానికి ఉద్యుక్తులయ్యారు. కాని ఆయనగుర్రం గ్రామంనుండి తిరిగి రావడానికి కొంత ఆలస్యమైంది. ఈ లోగా పొగాకు పైపు కాల్చుకోవచ్చు గదా అని ఆయన హాల్లో కాసేపు కూర్చున్నారు. నేను కూడా ఆయన సమీాపంలో కూర్చున్నాను. డాక్టరు గారి మల్లె పువ్వుల్లాంటి బట్టలు, తెలివితేట లుట్టిపడే ప్రకాశవంతమైన ముఖం, ఆయన మర్యాద మంచితనం ఇవన్నీ చూసి, అటు ఒక మూాల రమ్ తాగుతూ కూర్చున్న కెప్టెన్‌ను, అతని కంపుగుడ్డలు, దిష్టిబొమ్మ

లాంటి వాలకం చూస్తే కెప్టెన్ మీద ఎంత రోత కలిగిందో చెప్పలేను.

కెప్టెన్ ఉన్నవాడు ఉన్నట్లుండి వేళ్ళతో బల్ల మీద తాళంవేస్తూ తన పాతపాట ప్రారంభించాడు:—

కిమ్మనకుండా గమ్మున తాగయ్ -
యో—హో-హో-బలె గుమ్మైన రమ్!

ఈ పాట మేము రోజూ వినేదే అవడంవల్ల మాకెవ్వరికి కొత్త అనిపించలేదు, కాని డాక్టర్ గారు మాత్రం ఉలికిపడి చూశారు. రెండుమూడు క్షణాలు కెప్టెన్ కేసి తీవ్రంగా, చిరాగ్గాచూసి మళ్ళీ నాతో కబుర్లలోపడ్డారు. కొంతసేపటికి తనపాటను ఎవరూ లెక్కచెయ్యకపోవడం గమనించి కెప్టెన్ పాట ఆపాడు. ధన్‌మని బల్లమీద గుద్ది, "పటప్" అని పిడుగు పడ్డట్టు అరిచాడు. వెంటనే హాల్లోవున్న అతిథులు యావన్మందీ నోళ్ళు నొక్కుకుని నిశ్శబ్దంగా కూర్చున్నారు. డాక్టరుగారుమాత్రం సంభాషణ ఆపలేదు. కొన్నికొన్ని రకాల జబ్బులనుగూర్చి నాకు వివరిస్తూ మాట్లాడుతున్నారు. హాల్లో ఆయన ఒక్కడిగొంతుకే మృదువుగా, స్పష్టంగా వినబడుతోంది. కెప్టెన్ డాక్టరువంక నిశ్చరంగా చూసి, "ఎవడ్రా అక్కడ? పటప్," అని బల్లమీద చరిచాడు.

"మీరు నాతో నేనా మాట్లాడేది?" అని డాక్టరు అడిగారు.

"ఆ, నీకే చెప్పేది."

"సార్! మీకు ఒక మాట చెప్పదలుచుకున్నాను. మీరు ఇదేవిధంగా రమ్ తాగుతూ ఉన్నట్లయితే, త్వరలో ప్రపంచంనుంచి ఒక తాగుబోతు వెధవ నిష్క్రమిస్తాడు"

కెప్టెన్ కోపం వర్ణించతరంకాదు. ఉవ్వెత్తున లేచాడు. బొడ్డులోనుంచి ఓడకళాసు లుపయోగించే పొడుగాటి చాకు తీశాడు. "పొడిచి పారేస్తా" నని డాక్టర్ను బెదిరించాడు.

డాక్టరుగారు కదల్లేదు; ఇదివరకు లాగే నిర్భయంగా ఇంకా గొంతు హెచ్చించి మాట్లాడరు:

"ఆ చాకు ముడిచివెయ్యి. నిన్ను ఉరికంబం ఎక్కించడం నా అభిమతం కాదు."

అక్కణ్ణించి ప్రారంభమైంది వారిద్దరి మధ్యా చూపుల యుద్ధం. కళ్ళలోంచి విస్ఫులింగాలు కురిపిస్తూ ఒకళ్ళనొకళ్ళు చూసుకున్నారు. కొంతసేపటికి కెప్టెన్ వెనక్కి తగ్గాడు. చాకు ముడిచి బొడ్డులో దోపుకుని దెబ్బతిన్నకుక్క తోకముడుచుకున్నట్టు మళ్ళీ కుర్చీలో కూర్చున్నాడు. అతడు కూర్చోగానే డాక్టరు గారు ప్రారంభించారు:

"ఇదుగో మిస్టర్! నాజిల్లాలో నీబోటి వెధవ, నీచుడు, లుచ్చా ఒకడున్నాడని ఇప్పటికి తెలుసు

కున్నాను; గనుక రాత్రింబగళ్లు నీ మీద ఒక కన్ను వేసివుంటాను. నేను వట్టి డాక్టర్ని మాత్రమే ననుకుంటున్నావేమో. నేను ఈ జిల్లాకు మేజిస్ట్రేటు నుకూడా. జాగ్రత్తగా మసులుకున్నావా, సరేసరి. లేక ఇవాళ్టి మాదిరిగా అసభ్యంగా ప్రవర్తించావా, నిన్ను ఈ ప్రదేశం నుండి నూరుమైళ్ళ అవతలకు గెంటించి వెయ్యగలను. అర్థమైందా నే చెప్పింది?"

ఇంతలో డాక్టర్ లివ్ సేగారి గుర్రం గుమ్మం ముందుకు వచ్చి నిలబడింది. ఆయన వెళ్ళివస్తానని చెప్పి గుర్రమెక్కి వెళ్ళిపోయారు. కెప్టెన్ మాత్రం ఆ రాత్రే కాదు, తరవాత చాల రాత్రులవరకు కూడా గుప్ చుప్ గా కాలం గడిపాడు.

## 2. నల్లకుక్క

ఆ తరవాత వరసగా కొన్ని విచిత్ర సంఘటనలు జరిగి, కెప్టెన్ పీడ విరగడై పోయింది మాకు. అది శీతాకాలం; విపరీతంగా మంచు కురిసి రోజురోజంతా చలిగాలులు వీచేవి. మా నాయన వసంత కాలం వరకూ బతుకుతాడని మా కెవ్వరికి ఆశలేదు. రోజు రోజుకీ ఆయన పరిస్థితి అధ్వాన్నమవుతోంది. నేను, మా అమ్మ హోటలు పనితో సతమతమైపోతున్నాం.

జనవరి నెలలో ఒక ఉదయం—అప్పుడే తెల్లవారింది. మంచు కురుస్తోంది; చలి కరుస్తోంది.

సముద్రం పొగమంచు తెరలలో దాక్కుంది; కెరటాల త్రుళ్లింతలుమాత్రం వినిపిస్తున్నాయి. సూర్యుడు కొండశిఖరాలనుంచి తొంగిచూస్తున్నాడు. మా కెప్టెన్ మామూలుకంటె పెందరాళే లేచి, సముద్రపు ఒడ్డుకి బయల్దేరాడు. బుజానికి టెలిస్కోపు, నడుముకు చురకత్తి తగిలించుకున్నాడు. అతడు రోడ్డుమలుపు తిరిగేవరకూ నేనలాగే అతనివంకే చూస్తున్నాను. మలుపు తిరుగుతూ ఖాండ్రించి ఉమ్మేసి బిగ్గిరిగా ఏదో బూతుమాట అన్నాడు. డాక్టర్ లివ్‌సే ఆ రోజున తన్ను యెదుర్కొన్నందుకు అతనికింకా కోపం తీరలేదని అనుకున్నాను నేను.

అమ్మ మేడమీద మా నాన్నకు పరిచర్యలు చేస్తోంది. నేను భోజనశాలలో ఏదో పనిమీద వున్నాను. ఇంతలో హాలు తలుపులు తెరుచుకుని ఒక మనిషి లోపలికి వచ్చాడు. అతన్ని అంతకు ముందెప్పుడూ నేను చూడలేదు. మధ్య వయస్కుడు; కొట్లాటలలో ఆరితేరినవాడివలె కనిపించలేదు; ఓడ కళాసీవలెకూడా లేడు; కాని అతనివద్ద సముద్రపు వాసన కొడుతున్నట్లే అనిపించింది.

"ఏం కావాలి?" అని అడిగాను.

"రమ్," అన్నాడా మనిషి. నేను గ్లాసు పట్టుకుని లోపలికి వెళ్లబోతున్నాను. అతడు నన్ను దగ్గిరికిరమ్మని సంజ్ఞచేశాడు. నేను ఉన్నచోటే ఆగాను.

"దగ్గిరికిరా నాయనా. ఒక్కమాట చెప్పాలి."

నేను దగ్గిరికి వెళ్లాను. అతడు బల్లమీద ఆను కుని రహస్యంగా అడిగాడు :

"నా స్నేహితుడు బిల్ లోపలున్నాడా?"

నాకు బిల్ ఎవరో తెలియదని, కెప్టెన్ అని మేముపిలిచే మనిషిమాత్రం మా హోటలులో ఉంటు న్నాడనీ చెప్పాను.

"నా స్నేహితుడు బిల్ ఉన్నాడే, వాడికి కెప్టెన్ అని పిలిపించుకోవడం ఒక సరదాలే. ఒక చెంప మీద కత్తిగంటు ఉంటుంది, కుడి చెంపమీద. అవునా? ఎప్పుడూ రమ్ము సారాలో మునిగి తేల్తూ ఉంటాడు. కదూ? ఆ. ఇప్పుడు చెప్పు. నా నేస్తం బిల్ లోపలున్నాడా?"

బయటికి షికారుగా వెళ్లాడని చెప్పాను.

"ఎటు వేపు వెళ్లాడమ్మా, బీచివేపా, ఇటు వేపా?"

నేను కెప్టెన్ వెళ్లినదిక్కు చూపించాను. "సరే" అనిమాత్రం అన్నాడు ఆ కొత్తమనిషి. హాలును, ద్వారాలను, కిటికీలను జాగ్రత్తగా పరీక్షిం చాడు. ఒక కన్నుమాత్రం సింహద్వారం కేసి వేసే ఉంచాడు. అతని ధోరణిచూస్తే ఎలుకలకోసం పొంచి వున్న జంగురుపిల్లి జ్ఞాపకంవచ్చింది. నేను కెప్టెన్ వస్తు న్నాడేమో చూద్దామని వాకిట్లోకి వెళ్లాను. వెంటనే

ఆ కొత్తవాడు నన్ను లోపలికి వచ్చెయ్యమని ఆజ్ఞాపిం
చాడు. నేను "వస్తానులే" అన్నట్టుగా అక్కడేనుంచు
న్నాను. దాంతో అతని ముఖం కోపంతో కందగడ్డలా
గైంది. "రావేం" అని గద్దించాడు నేను భయపడి
తక్షణం లోపలికివచ్చాను. అతను మళ్లీ మామూలు
మనిషైపోయాడు. ప్రేమగా నాజుట్టు నిమురుతూ
"నువ్వు చాలా మంచివాడవనమ్మా. నాకు సరిగ్గా
నీలాంటికొడుకే ఉన్నాడు అచ్చు నీలాగే ఉంటాడు.
కాని చూడు. మా అబ్బాయి నే నేది చెబితే అది
వింటాడు. పిల్లలుపెద్దవాళ్లేం చెప్పినా చెయ్యాలి. లేక
పోతే చెడిపోతారు. బిల్ గాడితో నువ్వెప్పుడనా
ఓడలో ప్రయాణం చేసివుంటే తెలిసేది. వాడిమాట
వినకపోతే తలబద్దలుగొట్టేయడమే వాడిపద్ధతి. ఆ,
అడుగో వస్తున్నాడు నానేస్తం ఆ పాతటెలిస్కోప్పూ,
వాడూ తయారు. అబ్బాయ్, నేను లోపల గదిలో
దాక్కుంటాను. వాడురాగానే కాస్త బెదరగొడదాం.
వెధవ నన్నాసిని చూసి చాలా ఏళ్లయింది—"
అంటూ కొత్తమనిషి నన్నుకూడా లోపలికి తోశాడు.
నన్ను అడ్డంపెట్టుకుని తలుపుచాటున దాక్కున్నాడు.
నేను "ఇదంతా ఏమిట్రా" అని భయపడ్డమాట
వాస్తవం. కొత్తమనిషికూడా భయపడుతున్నట్టు
అతని ముఖం చూస్తేనే తెలుస్తోంది. నడుముకు తగి
లించుకున్న చురకత్తిని బైటికితీసి రెడీగా పట్టు
కున్నాడు.

కెప్టెన్ హాల్లోకి ప్రవేశించాడు; తలుపులు భద్రంగా మూసి అటూ ఇటూ చూడకుండా మేడ మెట్లకేసి వెడుతున్నాడు.

"బిల్!" అని పిలిచాడు కొత్తమనిషి వణుకుతూ.

కెప్టెన్ గిరుక్కున వెనక్కి తిరిగి మమ్మల్ని చూశాడు. చూస్తుండగానే అతని ముఖం పాలిపోయింది. కళ్ళలో అర్థంకాని భయం ప్రవేశించింది. చీకట్లో దెయ్యాన్నో, తాచుపామునో చూసిన వాడిలా తయారయ్యాడు.

"బిల్! మర్చిపోయావా, నీ పాతకాలపు నేస్తాన్ని."

'నల్లకుక్క!!—" అన్నాడు కెప్టెన్.

"ఆ, నల్లకుక్కనే. నా పేరు కూడా జ్ఞాపకముందీ? నువ్వు 'బెన్‌బౌ' హోటల్లో మకాం చేశావని తెలిసి చూసి పోదామని వచ్చాను. బిల్లీ, ఎన్నాళ్ళైందిరా మనిద్దరం కలుసుకుని? ఎల్లాగైనా ఆ రోజులే మంచివనుకో. అప్పుడుండే ఉషారేదీ ఇప్పుడు."

"అరేయ్ నల్లకుక్కా! నే నిక్కడున్నట్టు ఎవరు చెప్పారోగాని, రానేవచ్చావు! సరే. ఇదుగో ఇక్కడే వున్నాను; ఏం చేస్తావో చేసుకో. ఏం చెబుతావో చెప్పుకో."

"అదేమిట్రా బిల్, నేను రాకరాకవస్తే, అంత తలబిరుసుగా మాట్లాడుతావ్ ? ముందు ఈ అబ్బాయి చెరోగ్లాసు రమ్ము తెస్తాడు. కాస్త రుచి చూసి, తాపీగా కూర్చుని పిచ్చాపాటీ చెప్పుకుందాం."

నేను రమ్ముగ్లాసుల్తో తిరిగివచ్చేసరికి, ఇద్దరూ బల్లవద్ద చెరోవైపునా కూర్చున్నారు. నల్లకుక్క తెరిచిన ద్వారానికి దగ్గరగా కుర్చీ వేసుకుని ఒకపక్కగా కూర్చున్నాడు. అవసరమైతే పారిపోవడానికి వీలుగా కూర్చున్నట్లు తోచిందినాకు.

నల్లకుక్క నన్ను అవతలకు పొమ్మని ఆజ్ఞాపించాడు.

"అబ్బాయ్, చాటునించి విందామని అనుకుంటున్నావేమో, జాగ్రత్త!" అని హెచ్చరించాడు. నేను లోపలికి వెళ్లిపోయాను.

చాలా సేపటివరకూ నేను విందామని ఎంత ప్రయత్నించినా వారిమాటలు వినిపించలేదు. గురగుర మని రొదమాత్రం వినవచ్చింది. కాని క్రమంగా మాటలు జోరెక్కాయి.

"ఉహూ, ఉహూ, ఉహూ. ఉహూ అంటే ఉహూయే. ఏం లాభం లేదు. చేసివ్వను." అని కెప్టెన్ కఠినంగా అనడం వినిపించింది.

హఠాత్తుగా బూతులు, తిట్లు, ఇతర శబ్దాలు చెలరేగాయి. బల్ల, కుర్చీ ధన్‌మని తిరగదోయబడినై. కత్తులు ఖంగుఖంగుమని మోగినై.

"బాబోయ్," అని బాధతో కూడిన కేక వినిపించింది. మరుక్షణంలో నల్లకుక్క బైటికి ఉడాయించాడు. కెప్టెన్ కత్తి ఝుళిపిస్తూ వెంటబడి తరుముతున్నాడు. నల్లకుక్కకు ఎడమ బుజంనుంచి రక్తం ధారలుగా కారుతున్నది. గేటు తలుపుదాకా పరిగెత్తి కెప్టెన్ కత్తివిసిరాడు. అది తగిలివుంటే నల్లకుక్క అక్కడే నిలువునా చీలిపోయేవాడు. కాని తలుపుకు పైనా వేళ్లాడుతున్న మాహోటలు బోర్డుకు తగిలింది కత్తి.

రోడ్డుమీద పడగానే నల్లకుక్క బుజంమీది గాయాన్నికూడా లెక్కచెయ్యకుండా పరుగులో తనకుగల ప్రావీణ్యాన్ని ప్రదర్శించాడు. కెప్టెన్ కాసేపటివరకు బోర్డుకేసి చూస్తూ అక్కడే నిలబడ్డాడు. చివరికి ఇంట్లోకి తిరిగివచ్చాడు.

"దెబ్బతగిలిందా, కెప్టెన్?" అని అడిగాను.

"జిమ్! రమ్ తీసుకురా," అన్నాడతడు. నిలబడలేక అటూ ఇటూ తూలుతూపోయి గోడ నానుకున్నాడు. "నేనిక్కణ్ణించి త్వరగా మూటాముల్లె కట్టెయ్యాలి," అని రెండు మూడుసార్లు గొణుక్కున్నాడు.

నేను రమ్ముకోసం పరిగెత్తాను. ఆకంగారులో

ఒక గ్లాసుబద్దలు కొట్టాను. ఇంకోగ్లాసులో గబగబా రమ్ముని నింపి తీసుకు రాబోతుండగా హాల్లో ధడేలుమని శబ్దమైంది. వచ్చిచూస్తే కెప్టెన్ సాష్టాంగంగా నేల మీదపడిపోయి వున్నాడు. ఇంతలో ఈగలభా అంతా విని మా అమ్మ మేడమీదనుండి కిందికి పరుగెత్తు కుంటూ వచ్చింది. మేమిద్దరం సాయంపట్టి కెప్టెన్ ముఖం పైకెత్తగలిగాము. కష్టంగా ఊపిరిపీలుస్తున్నాడు; కళ్లుమూసుకునే ఉన్నాయి; ముఖం వివర్ణమై భీకరంగా వుంది.

"ఏమిట్రా నాయనా ఈగొడవంతా? ఈ దరిద్రపుగొట్టు ముండాకొడుకు మనకెక్కడ దొరికాడురా!" అని మా అమ్మ గోలచేసింది.

కెప్టెన్ను ఏం చెయ్యాలో మాకుతోచ లేదు. ఎక్కడ దెబ్బతగిలిందో కనిపించనన్నా లేదు. రమ్ము పోస్తే తెలివి వస్తుందేమోనని నోరు తెరవాలని ప్రయత్నించాముగాని పళ్లు గట్టిగా కరుచుకుని ఉన్నాడతను.

ఇంతలో డాక్టర్ లివ్సే తలుపుతోసుకుని లోనికివచ్చారు ఆయన మానాన్న కెల్లావుందో చూసి పోవడానికి వచ్చారు. డాక్టర్ను చూడగానే మాకు ప్రాణం లేచివచ్చింది.

"డాక్టర్, ఏం చేద్దాం? ఇతడు దెబ్బతిని పడిపోయాడు," అంది మా అమ్మ,

"దెబ్బా? దెబ్బలేదు ఏం లేదు. నేను ఇదివరకే చెప్పాను, తాగుడు మానకపోతే మూర్ఛరోగం ఎక్కు-

వౌతుందని. శ్రీమతి హాకిన్స్! మీరు మేటమీదికి వెళ్లి మీ ఆయనను కనిపెట్టి ఉండండి. ఇక్కడ జరిగిందేమీ చెప్పకండి. నేను ఈ తాగుబోతుగాడి వ్యర్థజీవితాన్ని కాపాడ్డానికి శాయశక్తులా పనిచేస్తాను. జిమ్ పళ్లెంలో కాసిని నీళ్లు తీసుకురామ్మా."

నేను పళ్లెంలో నీళ్లు తీసుకు వచ్చేసరికి డాక్టరుగారు కెప్టెన్ కోటు చేతులు పైకి ఎగదోశారు. బలిష్టమైన చేతిమీద వరసగా పచ్చబొట్లు ఉన్నాయి. ఏమిటేమిటో బొమ్మలు, "బిల్లీబోన్స్" అని అక్షరాలు పచ్చబొట్లుగా పొడిచివున్నాయి. బుజానికి సమీపంలో, ఉరితీయబడుతున్న మనిషిబొమ్మ వేయబడివుంది. ఆబొమ్మనిచూపిస్తూ డాక్టరుగారు "తనకు పట్టబోయేగతిని ఇతను ముందే గ్రహించి ఈ బొమ్మ వేయించినట్టున్నాడు. బలేగా వుంది," అన్నారు. తరవాత నాకేసి తిరిగి "జిమ్! నీకు నెత్తురుచూస్తే భయమా?" అన్నారు.

"లేదండి"

"అచ్ఛా. చూడు, ఈపళ్లెం ఇల్లా పట్టుకో," అంటూ తనచాకుతీసి కెప్టెన్ చేతిమీద గంటుపెట్టారు. ఒకనరం తెగింది. నెత్తురు చాలా కారింది పళ్లెంలోకి. కెప్టెన్ మెల్లిగా కళ్ళు తెరిచి చుట్టూచూశాడు. డాక్టర్ని చూసి గుర్తుపట్టి కోపంగా మూలిగాడు. తరువాత నన్నుచూసి కాస్త తేరుకున్నాడు. వెంటనే ముక్కుతో బుర్రుమని శబ్దంచేస్తూ లేవడానికి ప్రయత్నించాడు.

"ఏడీ నల్లకుక్క?" అని అరిచాడు కెప్టెన్.

"ఇక్కడ నల్లకుక్కా లేదు, తెల్లకుక్కా లేదు. నువ్వు రమ్ తెగతాగినట్టున్నావు; నేను చెప్పినట్టుగానే స్మారకం తప్పిపడిపోయావు. నా కిష్టం లేకపోయినా, డాక్టర్నిగనక, శ్మశానంలోకి ఒకఅడుగు వేసిన నిన్ను ఇవతలకు లాక్కొచ్చాను సరేకాని మిస్టర్ బోన్స్—

"నాపేరు బోన్స్ కాదు," అని కెప్టెన్ అడ్డం వచ్చాడు.

"కాకపోవచ్చు. బిల్లీబోన్స్ అని నే నెరిగిన సముద్రపుదొంగ ఒకడుండేవాడులే. నిన్ను చూస్తే వాడు జ్ఞాపకం వచ్చాడు. నీ పేరు నాకు తెలియదు గనుక బోన్స్ అనే నిన్ను పిలుస్తాను. సరే, నీ కొక్క మాట చెబుతాను మళ్లీ. ఒక గ్లాసెడు రమ్ తాగితే నీకేం ఫర్వాలేదు. కాని ఒకటి తాగితే ఇంకోటి తాగుతావ్. ఇంకోటి తాగితే మరోటి తాగుతావ్. అంచేత నేను పందెంకాసి చెబుతున్నాను—నువ్వాట్టే రోజులు బతకవని. అర్థమైందా? చచ్చిపోతావ్ కొద్ది రోజుల్లో. చచ్చి, వేరే చెప్పక్కర్లేదు ఏ లోకానికి పోతావో. లే, నుంచో. ఈసారికి నీపక్కదాకా తీసుకువెడతాను. నడు."

అతిప్రయాసమీద కెప్టెన్ నిలబెట్టి, మేడ మెట్లు ఎక్కించి, మంచంమీద పడుకోబెట్టాము. తలుపులు మూసేస్తూ డాక్టరుగారు మళ్లీ అన్నారు: "మిస్టర్ బోన్స్! జాగ్రత్త. మళ్లీ నేను చెప్పలేదనుకునేవ్."

తరవాత డాక్టరు మానాన్నను చూడటానికి వెళ్లారు. నేనుకూడా ఆయనవెంట వెళ్లాను.

"ఆ, ఇప్పటికేం ఫరవాలేదు. చాలా నెత్తురు లాగేశాను. కనక కొంతకాలందాకా రోగం తిరగబెట్టదు. వారంలోజులవరకూ వాణ్ణి కదలకుండా చూడండి. కాని ఈసారి మళ్లీ మూర్ఛ వచ్చిందో, చచ్చాడన్నమాటే. నేనేకాదు, దేవుడుకూడా వాణ్ణి రక్షించలేడు," అని చెప్పారు డాక్టరు.

# 3 నల్లకుక్క

ఆరోజు మధ్యాహ్నం నేను కెప్టెన్ గదిలోకి చల్లని పానీయాలు, ఏవో మందులు తీసుకుని వెళ్ళాను. అతడు మేమెల్లా పడుకోబెట్టామో అల్లాగే పడుకుని ఉన్నాడు. బాగా బలహీనంగా, ఏదో ఆందోళనగా ఉన్నట్లు తోచింది.

నను చూడగానే "జిమ్! ఇక్కడున్న వాళ్లలో నువ్వొక్కడివే మంచివాడివిలా కనిపిస్తున్నావు. నేను కూడా నిన్నెంతో ప్రేమగా చూడటంలేదూ? ప్రతి నెలా నీకు నాలుగు పెన్నీలు ఇవ్వటంలేదూ? అందుకని మరి నువ్వు నాకు చిన్న సహాయం చేసిపెట్టాలి. ఒక్కగ్లాసు రమ్ము తెచ్చిపెట్టు. నీకు పుణ్యం వుంటుంది. ఏం, తీసుకురావూ?" అని బతిమాలాడు.

"కాని డాక్టరుగారు—" అని నేను ప్రారం

భించాను. మాటమధ్యలో అడ్డం వచ్చాడు కెప్టెన్. డాక్టరును హృదయపూర్వకంగా తిట్టసాగాడు.

"డాక్టర్లందరూ వెధవాయలనుకో. ఆ డాక్టర్ గాడున్నాడే, వాడికేం తెలుసు కళాసుల్ని గూర్చి? నేనెన్ని దేశాలు తిరిగాను, ఎన్ని సముద్రాలు చూశాను! కొన్ని దేశాలలో ఎండ సూర్యుడు ఫర్లాంగు దూరంలో వున్నంత వేడిగా ఉంటుంది. కొన్ని దేశాల్లో చలివుంటుంది చూస్కో—నాయనా, నెత్తురు గడ్డకట్టుకు పోతుంది. కొన్ని సముద్రాల్లో కెరటాలు మైలు ఎత్తున లేచి విరిగిపడుతుంటాయి. ఆ డాక్టరుగాడు ఇల్లాంటి వెప్పుడన్నా కని విని ఎరుగునా? నేను ఇన్నేళ్ళు దేనిమీద బతికాననుకుంటున్నావ్? రమ్! రమ్! రమ్ లేకపోతే నేనెప్పుడో చచ్చేవాణ్ణి. నాకు తిండి, నిద్ర, పెళ్ళాం, బిడ్డలు అన్నీ రమ్మే. ఆ డాక్టరుకేం తెలుసు నా కష్టం? బాబూ, జిమ్! ఒక్క గ్లాసంటే ఒక్క గ్లాసు. మళ్ళీ అడిగితే చెప్పొచ్చు కొట్టు. చూడు, నా వేళ్ళు ఎలా వణుకుతున్నాయో? ఒక్క చుక్క పడితే ప్రాణం హాయిగా వుంటుంది. డాక్టరుమాట నమ్మకు. వాడల్లాగే చెబుతాడు, వాడికేం? రమ్ లేకపోతే పిచ్చెక్కినట్లుంటుంది. అసలెందుకూ? ఇందాక నీ వెనకాల కెప్టెన్ ఫ్లింట్ దెయ్యం కనిపించింది. ఆ దెయ్యం నన్ను పూనిందా, ఇహ చూస్కో, ఇల్లు ఇల్లంతా గల్లంతు చేసిపారేస్తాను. అడ్డమొచ్చిన వాణ్ణల్లా పీకనొక్కి చంపేస్తాను. అసలు మీ డాక్టరే

చెప్పాడుగా, ఒక గ్లాసు తాగనివ్వని. జిమ్, జిమ్! ఒక్కగ్లాసు తెచ్చావంటే పిల్లింగు ఇస్తాను."

ఇంత ప్రాధేయపడేసరికి నామనస్సు కరిగింది. అవ్వాళ మానాన్నకు ఎక్కువచేసింది. కెప్టెన్‌కు రమ్ ఇవ్వకపోతే ఏం గొడవ చేస్తాడోఅని భయ పడ్డాను. పైగా ఒకగ్లాసు ఇస్తే ఫర్వాలేదని డాక్టరు చెప్పారుగా. అందుచేత రమ్ ఇవ్వడాని కంగీక రించాను.

"నీ డబ్బు గిబ్బు నా కక్కర్లేదు. మానాన్నకు నువ్వు న్యాయంగా ఇవ్వవలసింది ఇచ్చేస్తే చాలు," అని చెప్పి లోపలికి వెళ్లాను.

రమ్ తీసుకురాగానే ఎగిరి పుచ్చుకొని ఒక్క గుక్కలో కానిచ్చాడు.

"ఆ, ఆ, ఇప్పటికి కాస్త ప్రాణం తేరు కుంటోంది. ఈ కుక్కిమంచంలో ఎన్నాళ్లుండాలని చెప్పాడు డాక్టరు? ఏం చేస్తం?"

"కనీసం వారంరోజులు."

"అమ్మో, వారంరోజులే! ఊహూ, ఒప్పుకోను. ఈలోగా వాళ్లు నాకు "నల్లచుక్క" ఇవ్వనే ఇస్తారు. ఆ దొంగముండాకొడుకులు నామీద పగబట్టారు. ఎప్పుడు చంపేద్దామా అని చూస్తున్నారు. వెధవలు, వాళ్లది వాళ్లు ఖర్చుచేసుకుని నాదికూడా దొంగిలించా లని చూస్తున్నారు. కళాసులు చెయ్యవలసిన పనేనా అది? అహా, నాకు తెలియక అడుగుతాను. తప్పు

కాదూ, ఇంకోడిసాముల్ని దొంగిలించడం? నేనంటావా? నా డబ్బు నేను ఒక్కపెన్నీ కూడా వృథాగా ఖర్చు చెయ్యలేదు. నా మాదిరిగా పొదుపుగా ఎందు కుండ కూడదు వాళ్ళు? వాళ్లు సంపాదించిన వేలన్నీ ఏమై నాయి? ఏమైనాయీ అంట? ఊహు. నేనుఛస్తే ఇవ్వను. ఎక్కడికన్నా పారిపోవాలి. వాళ్ల కళ్ళలో కారంకొట్టి పోకపోతే నా పేరు—"

కెప్టెన్ మాటల్లో ఒక్కటీ నా కర్థం కాలేదు. ఆ దొంగ లెవరో, వాళ్ళకీ ఇతనికీ విరోధమేమిటో తెలియలేదు. కెప్టెన్ లేచి కూర్చోడానికి ప్రయత్నించాడు. "ఆ డాక్టరుగాడు నానెత్తురంతా తాగేశాడు. నా చెవులు సంగీతంపాడుతున్నాయి. అమ్మా! అబ్బా!" అంటూ లేవబోయి మళ్ళీ వెనక్కి వాలిపోయాడు. అలా కాసేపు పడివుండి చివరి కన్నాడు:

"జిమ్! ఆ కళాసీని చూశావు గదూ?"

"నల్ల కుక్కా?"

"ఆ, నల్లకుక్క. వాడు చాలా చెడ్డవాడు. కాని వాడికంటే చెడ్డవాళ్ళున్నారు వెనకాల. మాట వరసకి చెబుతాను. నే నిక్కణ్ణించి పారిపోలేక పోతా ననుకో. వాళ్లు నాకు "నల్లచుక్క" పట్టుకొచ్చి ఇస్తా రనుకో. నువ్వు గుర్రంమీద వెంటనే ఆ డాక్టరుగాడి దగ్గరికిపోయి పోలీసులతోసహా వెంటబెట్టుకు రావాలి. అందరూ దొరుకుతారు. కెప్టెన్ ఫ్లింట్ కింద పనిచేసిన కళాసులంతా, ఒక్కడుకూడా బీరుపోకుండా దొరుకు

తారు. వాళ్ళు నన్నెందుకు వెంటాడుతున్నారను కున్నావ్? ఈమంచంకింద వుందే పెట్టె—దానికోసం కెప్టెన్ ఫ్లింట్ క్రింద తండేలుగా (కళాసీలకు మేస్త్రీ) పని చేసేవాణ్ణి ఆ రోజుల్లో. ఫ్లింట్ సవానా పట్నంలో (అమెరికాలో ఒక రేవుపట్టణం) చచ్చిపోయేముందు ఆ పెట్టె నాకు అప్పగించి మరీ చచ్చిపోయాడు నాకొక్క డికే ఆ ద్వీపం తెలుసు. వాళ్లు ఆపెట్టెకోసమే నా వెంట బడుతున్నారు. వాళ్ళు నల్లచుక్క తీసుకొచ్చియిస్తేనో, నల్లకుక్కగాని, ఒంటికాలు కుంటివాడుగాని కని పిస్తేనో, మాత్రమే నువ్వు డాక్టరు దగ్గరికిపోయి పోలీసుల్ని సహాయం తీసుకురావాలి. తెలిసిందా?"

"సరే కెప్టెన్. కాని నల్లచుక్క ఏమిటి?"

"అది మా గుర్తులే. వాళ్ళు పట్టుకొచ్చియిస్తే నీకు దాన్ని గూర్చి చెబుతాలే. కాని నువ్వు మాత్రం జాగ్రత్తగా కనిపెట్టి ఉండాలి. నాకీ సహాయం చేసి పెడితే నీకు సగానికి సగం యిస్తాను; నా మీద ఒట్టే సుకు చెబుతున్నా."

అతని కంఠం క్రమంగా బలహీనమైపోతోంది. నేను మందు తాగించాను. చిన్నపిల్లడు ఆముదం తాగి నట్టు అతి కష్టంమీద తాగాడు. వెంటనే మగత కమ్మిన వాడివలె పడి నిద్రపోయాడు. నే నివతల కొచ్చేశాను.

నాకేం చెయ్యాలో తోచలేదు. కెప్టెన్ చెప్పిన దంతా డాక్టరుగారికి చెప్పి ఉండవలసింది. కాని

ఆ సాయంత్రమే మానాన్న హఠాత్తుగా ప్రాణం విడిచాడు. దాంతో మరో విషయం ఆలోచించడానికే నాకు వ్యవధిలేకపోయింది. మమ్మల్ని ఓదార్చడానికి వచ్చేవాళ్ళు, పోయేవాళ్ళు, మా నాన్నకు అంత్యక్రియలు ఏర్పాటు చేయడం, హోటలుపని చూసుకోవడం—వీటితో కెప్టెన్ సంగతే నాకు జ్ఞాపకంరాలేదు.

మర్నాడు ఉదయం కెప్టెన్ కిందికి దిగివచ్చాడు. మామూలుగానే భోజనం చేశాడు. కాని మామూలుకంటే ఎక్కువగా రమ్ము తాగినట్టు నా అనుమానం. ఎందుకంటే అంత బలహీనంగా ఉన్నా బలే భయంకర శబ్దాలు చేశాడు. అతన్ని సమీపించడానికే మాకందరికి భయం వేసింది. ఇల్లంతా దుఃఖంలో మునిగి వుండగా కెప్టెన్ హాల్లో కూర్చుని "యో—హో—హో"—అంటూ దౌర్జన్యంగా పాడుతూ వుండటం మాకు కష్టం కలిగించింది. కాని ఏం చేస్తాం? నిపామీద ఎవర్నేం చేస్తాడో? దీనికితోడు డాక్టరుగారు కూడా ఊళ్లో లేరు. ఏదో అర్జంటు కేసుమీద దూరు గూరు వెళ్లారు. అంచేత కెప్టెన్ మరీ విచ్చలవిడిగా ప్రవర్తించసాగాడు. కాలుగాలిన పిల్లిలాగ ఊరికే మేడమీదకీ, కిందకీ తిరిగేవాడు; అప్పుడప్పుడు గేటు దాకా వెళ్ళి రోడ్డుకు రెండువేపులా పరీక్షగా చూసేవాడు. బాగా తాగివున్నప్పుడు కత్తితీసి పదును చూసుకునేవాడు. కాని ఎవ్వరిజోలికీ పోయేవాడు

కాదు. తనలో తనే గొణుక్కుంటూ, ఆలోచించు కుంటూ కూర్చునేవాడు.

రెండురోజు లిలా గడిచాయి. మా నాన్నకు అంత్యక్రియలు వగైరాలన్నీ యథావిధిగా పూర్తయ్యాయి. ఆరోజు మధ్యాహ్నం దాదాపు మూడు గంటలప్పుడు నేను గేటుదగ్గిర నుంచుని, చనిపోయిన మా నాన్ననుగూర్చి తలుచుకుని దుఃఖపడుతున్నాను. ఇంతలో దూరాన రోడ్డు మీద ఎవరో మెల్లిగా రావడం కనిపించింది. చేతికర్రతో దారి తడుము కుంటూ నడవటం, కళ్లపై వెలుగుపడకుండా గంతలు కట్టుకోవడం చూసి అతడు గుడ్డివాడని గ్రహించాను. నెత్తిమీదనుండి, బుజాలమీదుగా వెనక్కి పడేట్టు నల్లటిగుడ్డ కప్పుకున్నాడు. సన్నగా, బాగా బలహీనంగా ఉన్నట్టు కనిపించాడు. మరీ చంటిపిల్లలు చూస్తే జడుసుకునేట్టున్నాడు. హోటలు సమీపించగానే ఆగి, గొంతెత్తి అడిగాడు:—

"గుడ్డివాణ్ణి బాబూ! దేశంకోసం యుద్ధాల్లో పోట్లాడి కళ్ళు పోగొట్టుకున్న కబోది న్నాయనా! ఇక్కడెవరన్నా ధర్మాత్ములుంటే, నేను నుంచున్న దెక్కడో చెప్పండి. బాబూ!"

"ఎడ్మిరల్ బెంబౌముందున్నావు అబ్బీ" అన్నాను నేను,

"ఆ — చిట్టిబాబెవరో మాట్లాడుతున్నారు. చిట్టిబాబూ! నీ కంఠం వినగానే నీ మంచితనం గ్రహిం

చాను నాయనా! నీకెంతైనా పుణ్యముంటుంది, నన్ను లోపలికి తీసుకెళ్ళవూ?"

నేను చెయ్యి అందించాను. వెంటనే అంత మృదువుగా, దీనంగా మాట్లాడిన ఆ అంధుడు నా చేతిని భల్లూకంలా పట్టేశాడు. ఆ పట్టుకు నా వేళ్ళు పటపట మని విరిగాయి. ఒక్కసారిగా భయపడ్డాను. విదిలించుకోవాలని గింజుకున్నాను. కాని అంధుడు ఒక్క ఊపుతో నన్ను తనదగ్గిరికి లాక్కున్నాడు. అంత దుర్బలంగా కనిపించినా అతని చేతుల్లో ఎంత బలముందో నా కప్పుడు తెలిసింది.

"అబ్బాయ్! ఇప్పుడు పద లోపలికి. కెప్టెన్ దగ్గిరికి తీసుకుపో నన్ను," అన్నాడు అంధుడు.

"ఉహూ. తీసుకుపోను," అన్నాను నేను.

"ఓ. అల్లాగా?" అని నా చెయ్యి మెలిపెట్టాడు. "బాబోయ్" అని అరిచాను. "తీసుకు వెడతావా? చెయ్యి విరిచెయ్యమన్నావా?" అని హుంకరించాడు గుడ్డివాడు.

"కెప్టెన్ దగ్గిరికి వెళ్ళడం మంచిది కాదు. ఎప్పుడూ కత్తిపట్టుకుని కూర్చుంటున్నాడు. దగ్గిరికెవ్వళ్ళనీ రానివ్వడం లేదు. నీ మంచి కోసమే నేను చెప్పేది—"

"నోరుమూసుకు పద లోపలికి," అని మళ్ళీ ఒక్క ఊపుఊపాడు. అంత క్రూరమైన, దౌర్జన్యపూరితమైన కంఠం నే నెప్పుడూ వినలేదు. వెంటనే లోనికి

దారితీశాను. హాల్లో కూర్చున్నాడు కెప్టెన్; పక్కనే బల్లమీద రమ్ముసీసా ఉన్నది; నిషాతో కళ్ళు తేలిపోతున్నాయి. అంధుడు ఉక్కులాంటి పిడికిలితో నన్ను పట్టుకొని, రహస్యంగా చెప్పాడు: "నన్ను సరాసరి కెప్టెన్ దగ్గరికి తీసుకుపో. దగ్గరికెళ్ళగానే 'ఏ స్నేహితుడు వచ్చాడు బిల్,' అను. అల్లా అనకపోతే ఏం చేస్తానో తెలుసా,"అంటూమళ్ళీ చెయ్యి మెలిపెట్టాడు. ఆ బాధకు మూర్ఛ వచ్చినంత పనైంది నాకు. మారు మాటలేకుండా అంధుడు చెప్పినట్లే అంతా చేశాను. అతడు అనమన్న మాటలు అనేశాను.

పాపం కెప్టెన్ ఆ మాటలు వినగానే తలెత్తి చూశాడు. అంధుణ్ణి గుర్తించగానే రమ్ము నిషాఅంతా దిగిపోయింది. అతన్నిచూస్తే భయపడటానికికూడా ఓపిక లేనట్లు తోచిందినాకు. లేవబోయాడు, కాని శరీరం స్వాధీనంలో లేనట్లు కూర్చునే ఉండిపోయాడు.

"బిల్! ఎల్లా కూర్చున్నావో అల్లాగే కూర్చో. కదలకు. నేను చూడలేకపోయినా, వినగలను. పది గజాలదూరంలో సూదికిందపడినా నాకు వినిపిస్తుంది. నీకు తెలుసుగా నా సంగతి. వ్యవహారం దగ్గర నాకు మొహమాటం లేదు. నీ కుడిచెయ్యి జాపు. అబ్బాయ్, అతని కుడిచెయ్యి పట్టుకుని నా ఎడమచెయ్యి దగ్గరికి తీసుకరా. ఊఁ, తొందరగా."

మేమిద్దరం అంధుని ఆజ్ఞను అక్షరాలా శిరసా వహించాము. కెప్టెన్ ప్రాణంలేని మట్టిబొమ్మలా

నిశ్చేతనుడై పోయాడు. అంధుడు కెప్టెన్ చేతిలో ఏదో పెట్టాడు. కెప్టెన్ వెంటనే గుప్పిలి మూసుకున్నాడు.

"పనైపోయింది. వెళ్ళిపోతున్నాను," అంటూ హఠాత్తుగా నన్ను వదిలేశాడు. వెనక్కి తిరిగి ఒక్క అడుగుకూడా తడబడకుండా హాలు దాటి, వాకిలి దాటి, గేటు తెరుచుకుని చకచక రోడ్డుమీదికి వెళ్ళిపోయాడు. అతడు ఎవరి సహాయంలేకుండా, ఒక్కసారి లోపలికి వచ్చినంతమాత్రాన దారంతా ఎలాగుర్తుంచుకుని తిరిగి వెళ్ళిపోగలిగాడో నాకు అర్థంకాలేదు. అసలు నా కళ్లను నేనే నమ్మలేక పోయానంటే నమ్మండి.

అంధుడు రోడ్డుమీద దూరాన మలుపు తిరిగే వరకూ మాకు అతని కర్రచప్పుడు వినిపిస్తూనే వుంది. ఆ చప్పుడు దూరమై పోయాకగాని నాకు, కెప్టెన్‌కు తెలివిరాలేదు. వెంటనే కెప్టెన్ చెయ్యి వదిలేశాను. అతడు గుప్పిలి తెరిచి చూశాడు

"రాత్రి పదిగంటలకి!! ఇంకా ఆరు గంటలుంది. టైము. ఈలోగా పారిపోగలను. ఓ. పారిపోగలను. నేనా వీళ్ళకి దొరికేది?" అంటూ కుర్చీలోంచి లేచాడు.

లేస్తూనే అటూ ఇటూ తూలాడు; రెండు చేతుల్తో తన మెడ పట్టుకుని ఒక్కక్షణం ఊగులాడుతూ నుంచున్నాడు. ఒక్క వెర్రికేక వేసి ధన్‌మని నిలువునా, బోర్లగిలాపడ్డాడు.

అమ్మో, అమ్మో," అని కేకేస్తూ, నేను కెప్టెన్ వద్దకు పరుగెత్తాను. కాని వళ్ళు పట్టుకుచూచే

సరికి ప్రాణం పోనేపోయింది. నేలమీద పడుతూనే ప్రాణం వదిలినట్లున్నాడు. అతనంటే నాకుఇష్టంగాని, జాలిగాని ఎప్పుడూ లేదు; కాని అతడు చనిపోగానే అప్రయత్నంగా నాకు ఏడుపు వచ్చింది. మా నాన్న చనిపోయిన దుఃఖం ఇంకా నాలో చల్లారనే లేదు. నాకు బుద్ధి తెలిసిన తర్వాత నా కళ్లారా చూసిన చావుల్లో ఇది రెండోది.

## 4 కెప్టెన్ పెట్టె

మా అమ్మ నా కేకలువిని పరుగెత్తుకు రాగానే, నేను నాకు తెలిసినదంతా టూకీగా చెప్పాను. అసలదంతా ఇదివరకే ఆమెకు చెప్పి తగిన జాగ్రత్తపడి వుండవలసింది. ఏమైతేనేం—మేము పెద్ద ప్రమాద పరిస్థితిలో చిక్కుకున్నట్టు ఇరువురం గ్రహించాము. కెప్టెన్ మాకు గదిఅద్దె, భోజనపు ఖర్చులు మొదలైన బాకీ చాలా ఇవ్వతేలాడు. ఇంకా కాసేపట్లో కెప్టెన్ 'స్నేహితులు' మా హోటలుమీద దాడిచేయనున్నారు. నల్లకుక్కను, ఆగుడ్డివాణ్ణి పరిచయం చేసుకున్నాను. గనుక మిగతా సముద్రపు దొంగలు ఎల్లా వుంటారో చూడకుండానే నేను గ్రహించాను. వాళ్ళు మాకు న్యాయంగా రావలసింది మాకిచ్చి మిగిలిందే పట్టుకు పోతారని ఎలా వూహించగలను?

పోనీ డాక్టర్ లివ్‌సే ఇంటికి గుర్రంమీద వెళ్ళి పోలీసు సహాయం తీసుకు వద్దామా అంటే, ఇంట్లో మా అమ్మ నొక్కతెనూ నిస్సహాయంగా వదలి వెళ్ళి నట్లవుతుంది. అసలు మా ఇద్దరిలో ఒక్కరంకూడా ఆ ఇంట్లో ఇక ఉండటం మంచిది కాదని తోచింది. గడియారపు టిక్ టిక్ శబ్దంకూడా మమ్మల్ని భయపెడు తోంది. రోడ్డుమీద మనుషుల అలికిడి అవుతున్నట్లు, హాల్లో కెప్టెన్ శవంతాలూకు దెయ్యం ఎగురుతున్నట్లు తోచి మా అమ్మ, నేను ఒకరి నొకరం అంటిపెట్టుకునే తిరిగాము. వెంటనే ఏదో చెయ్యాలని నిశ్చయించి, బయటికి వచ్చాము. మా హోటలుకు, గ్రామానికి రెండుమూడు ఫర్లాంగులకంటె ఎక్కువ దూరంలేదు. అక్కడికివెళ్లి కొందరు మనుషులను సహాయం తీసుకు రావాలనుకున్నాము. వెంటనే గ్రామంకేసి బయలు దేరాము.

నాకు ధైర్యం కలిగించిన విషయమేమంటే, గుడ్డివాడు ఆవేళ వచ్చింది గ్రామముండున్న దిశనుండి కాదు; దానికి ఎదుటివైపునుండి. అందుచేత గ్రామా నికి వెళ్లేదారి నిరపాయమైందేకదా. ఆ ధైర్యంతో గబగబనడిచి, పరిగెత్తి, ఎలాగైతేనేం కొన్నినిమిషాల్లో గ్రామం చేరుకున్నాం. అప్పటికి నలువైపులా సంజ చీకట్లు అలుముకున్నాయి. కాని గ్రామస్థులలో ఒక్కరుకూడా మాకు సహాయం రావడానికి అంగీక రించలేదు. మమ్మలెన్నెదుర్కొన్న . అపాయాలను

గూర్చి చెప్పినకొద్దీ, ఆబాల గోపాలం హడలిపోయి జారుకునేవారే గాని ధైర్యం చెప్పినవారు లేరు. కెప్టెన్ ఫ్లింట్ పేరు నాకు కొత్తదైనప్పటికీ గ్రామస్థుల్లో చాల మందికి పరిచితమైనదే. దేశదేశాలను హడలెత్తించిన సముద్రపు దొంగల కెప్టెన్ ఫ్లింట్. అటువంటివాడి శిష్యులు మా "ఎడ్మిరల్ బెన్‌బో" మీదికి ఈ రాత్రి దండెత్తనున్నారని తెలిసి ఇక ముందడుగువేసే మొగాడేడీ?

మాఅమ్మ ఒకచిన్న గంభీరోపన్యాసంఇచ్చింది. "మీరెవ్వరూ రాకపోతే నేనూ, జిమ్ కలిసి వెడతాం. తండ్రిలేని బిడ్డగదా! వాడికి రావలసిన డబ్బు రాకుండా నేనెల్లా ఊరుకుంటాను? మేము వెనక్కి వెడతాం. మీకందరికీ ఇవిగో వెయ్యి నమస్కారాలు. ఛీ, ఇంత పిరికివాళ్ళని అనుకోలేదు. ఆ పెట్టెను బద్దలుగొట్టి అయినానరే, మాకు రావలసిన డబ్బు మేం తీసుకుంటాం.

నేను, మా అమ్మ వచ్చినదారే పట్టాం. వద్దు వద్దని అందరూ అడ్డమొచ్చేవారేగాని, వస్తామన్న వారొక్కరూ లేరు. కాని ఒక సహాయం మాత్రం చేశారు. తూటాలు నింపిన పిస్టలు నొకదాన్ని నాచేతికిచ్చారు, అపాయంవస్తే పనికివస్తుందని; సగం దారిలో గుర్రాలను రెడీగా ఉంచుతామని, డాక్టరు గారింటినుండి సహాయం తీసుకువచ్చేందు కొకమనిషిని పంపుతామనీ కూడా వగ్దానం చేశారు.

చలితోను, భయంతోను గజగజ వణుకుతూ నడిచాము. మా దురదృష్టంకొద్దీ ఆరోజు పూర్ణిమ కూడాను. దూరాన కొండల చాటునుంచి నిండు చంద్రుడు తొంగిచూస్తూన్నాడు. మేము గ్రామానికి తిరిగి వెళ్లేటప్పుడు పుచ్చ పువ్వులాంటి వెన్నెల్లోనే వెళ్ళవలసి వస్తుందని మరీ భయపడ్డాం. రోడ్డుపక్కగా చెట్లనీడల్లో నడిచి చివరికి మా హోటలు చేరుకున్నాం.

సింహద్వారం గట్టిగా బందుచేశాను. కిటికీలు కూడా భద్రంగామూశాను. లోపలంతా కటిక చీకటి. చీకటిలోనే తడుములాడి మా అమ్మ కొవ్వొత్తి దీపం వెలిగించింది. కెప్టెన్ శవంమేము వదిలిపెట్టి వెళ్ళినప్పుడెలావుందో అలాగే వుంది. ఒకళ్ళ చేతులు ఒకళ్ళం పట్టుకుని హాల్లో అడుగుపెట్టాం.

"తాళం చెవులెలా వస్తాయి?" అంది మా అమ్మ శవంకేసి భయంగాచూస్తూ.

నేను శవం పక్కన మోకాళ్ళమీద వంగాను. కెప్టెన్ చేతులో గుడ్డివాడు పెట్టిన గుండ్రని కాగితం ముక్క ఇంకా అలాగేవుంది. "నల్లచుక్క" అంటే అదే అయివుంటుందనుకున్నాను. ఒకపక్కన అంతా నల్లగాఉంది. రెండోపక్కన "రాత్రి పదిగంటల వరకూ గడువు" అని చక్కటి దస్తూరీలో దొంగల సందేశం వ్రాయబడివుంది.

"అమ్మా, పదిగంటల దాకా ఫరవాలేదే," అన్నాను. అదేక్షణంలో మాగోడ గడియారం టంగ్

టంగ్న గంటలుకొట్ట నారంభించింది. ఆ హఠాత్ శబ్దానికి మా ప్రాణాలు పైనే ఎగిరి పోయాయి. గడియారం ఆరుగంటలే కొట్టినందుకు మళ్ళీ ధైర్యం తెచ్చుకున్నాం.

"త్వరగా తియ్ తాళంచెవులు," అంది మా అమ్మ.

ఒకటితరవాత ఒకటిగా జేబులన్నీ వెదికాను. కొన్ని వెండినాణాలు, సూది, దారం, పొగాకు, చాకు, చిన్నదిక్సూచి, మొదలైన అనవసర వస్తువులెన్నో బైటపడ్డాయిగాని తాళంచెవులు దొరకలేదు.

"మెడకి కట్టుకున్నాడేమో చూడు," అని సలహా ఇచ్చింది మాఅమ్మ.

భయం, అనుమానాలు అన్నీ దిగమింగి, ధైర్యం తెచ్చుకుని అతని చొక్కాగుండీలు విప్పాను. మెడనుంచి దారంతో వేళ్ళాడుతూ తాళంచెవి కనపడింది దారాన్ని అతని చాకుతోనే కోసివేశాను. అది పుచ్చుకుని ఇద్దరం మేడమీద ఇంతకాలం అతడు నివసించిన గదిలోకి పరిగెత్తాము. కెప్టెన్ పెట్టె మంచం కిందనేవుంది. మూతమీద "బి" అని అక్షరం చెక్కబడివుంది. పెట్టె బాగా తుప్పుపట్టి, సొట్టలుపోయి వుంది.

తాళంచెవి తీసుకుని మాఅమ్మ కొంత కష్టంమీదపెట్టెమూద తెరిచింది. తెరవగానే పొగాకు ఘాటు, తారువాసన మమ్మల్ని ఉక్కిరి బిక్కిరి

చేశాయి. ముందుకొన్ని కొత్తబట్టలు కనిపించాయి. వాటినెవ్వరూ ఇంతవరకూ తొడుక్కోలేదని మా అమ్మఅంది. అడుగున పొగాకు, రెండు చక్కని పిస్టళ్ళు, ఒకపాతవాచి, రెండు ఇత్తడి దిక్సూచులు, తమాషాగావున్న అయిదారు నత్తగుల్లలు, కొన్ని విదేశీయ నాణాలు కనిపించాయి. సముద్రాలపై ఓడలను దోచుకుంటూ, అమాయకులను హత్యచేస్తూ క్రూరమైన నీచమైన జీవితం గడుపుతూ దేశదేశాలు సంచరించే ఈతడు పిల్లలకు సహజమైన కుతూహలంతో నత్తగుల్లలను దాచుకోవడం నాకు ఆశ్చర్యం కలిగించింది.

తెరచాప శాలూకు గుడ్డను తొలగించి ఇంకా అడుగున పరీక్షించాము. మైనం గుడ్డతో చుట్టిన ఒక పార్సిలు, ఒక చేతిసంచి కనిపించాయి. ఇవ్వే పెట్టెలో మిగిలిన ఆఖరి వస్తువులు. సంచీ ముట్టుకునే టప్పటికీ బంగారు నాణాలు గలగల మన్నాయి.

"ఈదొంగ వెధవలకి నేనెంత నమ్మకస్థురాలినో చూపిస్తాను. మనకి రావలసిన దానికంటె ఒక్క ఫార్తింగుకూడా ఎక్కువ తీసుకోను," అని మా అమ్మ సంచిలోని బంగారు నాణాలు లెక్కించ సాగింది.

ఆనాణాలు ఒక దేశానివికావు. ఒక విలువవి కావు, ఒక ఆకారానివికావు. స్పెయిన్, ఫ్రాన్సు, ఇంగ్లండు, ఇటలీ అన్ని దేశాల నాణాలు రకరకాలవి కలగాపులగంగా ఉన్నాయి. ఇంగ్లీషు నాణాలైన

గినీలు (21 షిల్లింగులు) చాల అరుదుగా వున్నాయి. వీటితోనే మా అమ్మ బాకీ మొత్తాన్ని వేరుచేయ సాగింది. మిగిలిన వేవీ మాకు తెలియ వావెను.

గినీలు వెదికితీయడం చాలాసేపు పట్టింది. కొంతసేపటికి నేను హఠాత్తుగా ఆమె చెయ్యిపట్టుకుని ఆపాను. రోడ్డుమీద ఎక్కడో దూరాన పరిచితమైన ధ్వని అస్పష్టంగా వినిపించింది అగి గుడ్డివాడి చేతికర్ర రోడ్డుమీద టక్ టక్ మంటున్న ధ్వని. నాకు గుండె ఆగిపోయి నట్లయింది. క్రమంగా ఆధ్వని మాహోటలు గేటును సమీపించింది. ఎవరో గేటు తెరిచారు; సింహద్వారాన్ని తట్టారు. తరవాత కొంతసేపు నిశ్శబ్దం. మళ్ళీ ధ్వని ప్రారంభమైంది; క్రమంగా దూరమై, అదృష్టమై, చివరికి వినపడకుండా పోయింది. ఇంతసేపూ ఊపిరి బిగపట్టి వింటూ కూర్చున్న మేము "అమ్మయ్య" అని ఒక నిట్టూర్పు విడిచాము.

"అమ్మా, ఆనాణాలన్నీ తీసుకుపోదాం. ఇల్లా ఆలస్యం చేస్తే అపాయం," అన్నాను నేను. ఎందుకంటే గుడ్డివాడు తలుపులన్నీ మూసివేసి ఉండటం గమనించాడు. ఏ నిమిషానైనా మిగతా దొంగలందరినీ వెంటబెట్టుకు రాగలడు. అసలు తలుపులన్నీ మూసి వెయ్యటంఎంత తెలివైనపనో అప్పుడు గ్రహించాను.

కాని మా అమ్మ ఎంత భయ భ్రాంతురాలై వున్నా, మాకు రావలసిన దానికంటె ఒక్కపెన్నీ ఎక్కువగాని, తక్కువగాని తీసుకోవడానికి ఇష్టపడ

లేదు. ఇంతలో దూరాన కొండలవైపునుండి నన్నని యాల వినిపించింది. అప్పటికి మా అమ్మ పట్టుదల సడలింది.

"సరేలే. దక్కినంతే దక్కింది," అని మాఅమ్మ లేచింది."

నేను మైనంగుడ్డ పార్సిల్ తీసుకున్నాను మాకింకా రావలసిన డబ్బు కొంతవుంది గనక ఆ పార్సిల్‌లో ఏదుంటే అది చెల్లుకింద కట్టుకోవడానికి నిశ్చయించాను.

మరుక్షణంలో మేమిద్దరం కొవ్వొత్తిని వెట్టె పక్కనే వదిలేసి గబగబ మెట్లు దిగేశాము. తలుపులు తెరుచుకుని రోడ్డుమీద పడ్డాం. అప్పటికి పొగమంచు చాలావరకు విచ్చిపోయింది. చంద్రుడు బాగా పైకొచ్చాడు. కాని మాహోటలు ముందు మాత్రం కొద్దిగా చీకటిగానే వుంది. అందుచేత మేమిక తలకు రావడం ఎవరికంటా పడదని ధైర్యపడ్డాము. కొన్ని గజాలు పరిగెత్తామో లేదో కొండలవైపునుండి మను షులు పరుగెత్తుకు వస్తున్న అలికిడి అయింది. వెనక్కి తిరిగి చూశాం. మినుకుమినుకు మంటున్న లాంతరు వెలుగు కనిపించింది. దాన్నిబట్టి దొంగలాట్టే దూరంలో లేరని గ్రహించాము.

"నాన్నా, ఈ డబ్బు నువ్వు పట్టుకొని పరిగెత్తు. నాకు స్పృహ తప్పిపోతోంది," అని మా అమ్మ తూలుతూ ఉన్నచోటే ఆగిపోయింది. ఆ నిమిషంలో

మా గ్రామస్థుల పిరికితనాన్ని ఎంతనిందించానో, మా అమ్మ డబ్బులెక్క బెడుతూ ఆలస్యం చేసినందుకు ఆమె నెంత నిందించానో చెప్పలేను. ఏమైతేనేం— అపాయం రానేవచ్చింది. ఇప్పుడు బెంగపడి లాభం లేదు.తప్పించుకునే మార్గం చూడాలి. అదృష్ట వశాత్తుమేము వంతెనకు సమీపంలో ఉన్నాము. తూలిపోతున్న మా అమ్మను కష్టంమీద పట్టుకుని నడిపించాను. కాలవగట్టు చేరుకునేసరికి ఆమెకు పూర్తిగా స్పృహ తప్పిపోయింది. నాకా సమయంలో అంతబల మెక్కడనుంచి వచ్చిందో తెలియదు. మా అమ్మను ఎలాగైతేనేం, గట్టు కిందవరకూ లాక్కువెళ్ళి, వంతెన నీడలో ముడుచుకుని కూర్చున్నాను. ఆమె నా బుజాలమీద వాలిపోయింది. నేను నీడలో వున్నప్పటికీ మా అమ్మమీద వెన్నెలబాగా పడుతోంది. అదీకాక మేము హోటలుకు ఈలవేటుదూరంలోనే ఉన్నాము.

## 5. హోటలుపై దాడి

దొంగలు మా హోటలును సమీపిస్తున్నారు. నేను ఒకమూల తీవ్రంగా భయపడుతున్నా, వారేం చేస్తారో చూడాలనే ఆసక్తి నాలో విజృంభించింది. నెమ్మదిగా వంతెనకిందనుండి కాలవగట్టుకు పాకివచ్చి చూశాను. మొత్తం ఏడెనమండుగురుదాకా ఉన్నారు; లాంతరు పట్టుకున్నవాడు ముందు పరుగెత్తుతున్నాడు. వెనక ముగ్గురు మనుషులు కట్టగట్టుకుని వస్తున్నారు.

వారిలో మధ్యపాడు గుడ్డివాడని, ఊహించాను. అతని గొంతుక వినగానే నా ఉషారైపోయిందని రుజువైంది.

"తలుపులు బద్దలు గొట్టండి," అని అరిచాడు గుడ్డివాడు.

నలుగురైదుగురు వెంటనే గేటులోంచి పరుగెత్తారు. సింహద్వారం తెరిచిఉన్నందుకు ఆశ్చర్యపోతున్నట్లు ఠపీమని ఆగిపోయారు. కాని గుడ్డివాడు "లోపలికి జొరబడండి," అని మళ్ళీ కేకలు పెట్టాడు. దొంగలు ఇంట్లో చొరబడ్డారు. కాసేపు నిశ్శబ్దం. వెంటనే రెండుమూడు గొంతుకలు ఒకేసారి అరిచాయి: "బిల్ చచ్చిపోయాడు !!"

గుడ్డివాడు ఆమాట వింటూనే "ఆలస్యంచెయ్యకండిరా, మీదుంపతెగ. వాడి జేబులు వెదకండి; కొందరు మేడమీదకి పోయి పెట్టెలో వెదకండి," అని ఆజ్ఞాపించాడు.

మా మేడమెట్లు కొయ్యవి; మెట్లు విరిగి కూలిపోతాయేమో నన్నంత అట్టహాసంగా దొంగలు మేడ మెక్కారు. మళ్ళీ కాస్త నిశ్శబ్దం. కెప్టెన్ గదిలో రోడ్డువైపుఉన్న కిటికీ తెరవబడింది. ఒకడు కిటికీగుండా కిందికి తొంగిచూస్తూ గుడ్డివాడితో చెప్పాడు:

"ప్యూ! పెట్టె మనకంటె ముందే ఎవరో ఖాళీ చేశారు."

"అది ఉందా?" అని గర్జించాడు ప్యూ.

"డబ్బేనా ?"

గుడ్డివాడు డబ్బును నానా బూతులు తిట్టాడు.

"డబ్బు కాదురా, వెధవా! ఫ్లింట్ కాగితం?"

"అది లేదిక్కడ."

"హాల్లో ఉన్నవాళ్లెవ్వరా? బిల్ గాడి జేబుల్లో ఏమన్నా కనిపించిందా?"

హాల్లోనుండి ఒకడు సమాధాన మిచ్చాడు:

"బిల్ జేబుల్లో ఏమీ లేదు. ఎవరో ఇదివరకే కొట్టేశారు అంతా."

"వాళ్లే హోటలు తాలూకు వాళ్లే. ఆ కుర్రాడి పనే ఇదంతా, వాడి కళ్లు పీకిపారేసినా బాగుండేది. ఇందాక నేను వచ్చినప్పుడు తలుపులు వేసి వున్నాయి. అప్పటికి వాళ్ళు లోపలే ఉన్నారు. వెదకండిరా. ఇక్కడే చుట్టుపక్కల దాక్కుని ఉంటారు. ఇంతలోకే ఎక్కడికి పోతారు? వెదకండి," అని ఆజ్ఞాపించాడు అంధుడైన ప్యూ.

"నిజమే. ఇక్కడే ఎక్కడో దొరుకుతారు. వాళ్ళ కొవ్వొత్తి ఇంకా వెలుగుతూనే ఉంది," అని మేడమీది కిటికీలోనుండి ఒక డన్నాడు.

"ఇల్లంతా వెదకండి. ఆలస్యం చెయ్యకండి," అన్నాడు ప్యూ మళ్ళీ.

వెంటనే దొంగలు ఇల్లంతా మాకోసం వెదక సాగారు. కుర్చీలు, బల్లలు, మంచాలు, గిన్నెలు, ప్లేట్లు అన్నీ తిరగదోశారు; తలుపులు బద్దలుగొట్టారు, ఆ ప్రదేశమంతా నిశ్శబ్దంగా ఉన్నందువల్ల వాళ్ళ

కోలాహలం, వాళ్ళ కేకలు, మాటలు అన్నీ నాకు స్పష్టంగా వినిపిస్తున్నాయి. చివరికి లోపలివాళ్లందరూ ఒకరి తరవాత ఒకళ్ళు రోడ్డుమీద కొచ్చారు. మేమెక్కడా కనిపించలేదని ప్యూతో చెప్పారు ఇంతలో దూరంనుండి రెండుసార్లు విజిల్ వినిపించింది. మా అమ్మ కెప్టెన్ డబ్బులెక్కిస్తున్న సమయంలో విన పడిన శబ్దమే అది. అది గ్రామం దిశనుండి వినవస్తోంది. బహుశా దొంగల ముఠాలోవాడే ఎవడో రాబోయే అపాయాన్ని గూర్చి వాళ్లను హెచ్చరిస్తున్నాడల్లే వుంది. ఎందుకంటే ఆ విజిల్ వినగానే దొంగలంతా హడలిపోయారు.

"అదుగో, మనవాడు ఈల వేస్తున్నాడు. రెండు సార్లుకూడా వేశాడు. మనం పారిపోవాలి," అన్నాడొకడు.

"పారిపోతావా? పంది వెధవా! పిరికి వాణ్ణి తిసికెళ్ళి అక్కడ కాపలా పెడితే ఏమౌతుంది? హోటలువాళ్ళు ఇక్కడే ఉంటారు. వెదకండి. తొందరగా. నాకే కళ్లుంటేనా—"

ప్యూ ఆజ్ఞ వినగానే మళ్ళీ దొంగలు ధైర్యం తెచ్చుకుని ఇంటి చుట్టూరా వెదకసాగారు. కాని గుడ్డివాడికి జడిసిమాత్రమే వెదుకుతున్నట్లు, అవసరమైతే క్షణంలో ఉడాయించడానికి చూస్తున్నట్లు అనిపించింది.

"తెలివితక్కువ గాడిదల్లారా! ఆ కాగితం దొరికితే కొన్ని లక్షలపౌనులు మన స్వాధీన మవుతాయి.

చచ్చేవరకూ మహారాజభోగా లనుభవించగలం. అది ఇక్కడే ఎక్కడో ఉందని మీకు తెలిసు అయినా, వెదకండిరా అంటే తెగనీలుగుతున్నారు. మీ కోసం కాకపోతే నాకోసమూ ఇదంతా ? మీలో ఒక్కడైనా ధైర్యం చేశాడూ బిల్ ఎదట పడటానికి? నేను ధైర్యం చేశాను. నేనువెళ్లానుఒక్కణ్ణే. రెండుకళ్ళూలేని గుడ్డివాణ్ణి నేను ధైర్యం చేశానురా ! ఇంకా కష్టపడితే ఏమిటిరా నాకు వచ్చేది! జీవితమంతా బిచ్చ మడుక్కుంటూ గడపాల్సిందేగద. మీలో మొగతనం ఏమన్నావుంటే వెదకండి, పట్టుకోండి, ఆ కాగితాన్ని" అని పురికొల్పు తున్నాడు ప్యూ.

"కాదురా ప్యూ! ఆ ఉన్నడబ్బుకాస్తా పట్టుకు పోతే ఏం?" అని గొణిగాడు ఒకడు,

"వాళ్ళనిప్పుడు ఎక్కడని పట్టుకోగలం ? సగం వాటా తీసుకుని నీ దారిన నువ్వు పో," అని ఇంకోడు గుడ్డివాడికి సలహా ఇచ్చాడు.

"నీ దారిన నువ్వుపో," అనేమాట వినబడే సరి కల్లా గుడ్డివాడి కెక్కడలేని కోపం వచ్చింది. నోటికి వచ్చిన తిట్లల్లా తిడుతూ, కర్రతో చేతికందినవారి నల్లా ఇష్టం వచ్చినట్టు బాదాడు. దొంగలు ప్యూ చేతు లోంచి కర్ర లాక్కోవాలని చాలా ప్రయత్నించారు. కాని గుడ్డివాడుపిచ్చి ఆవేశంలో స్వైర విహారంచేశాడు ఈ పోట్లాటమూలంగా మాకు ప్రమాదం పూర్తిగా తప్పిపోయింది. కొంత సేపటికి మళ్ళీ ఏదో ధ్వని విన

వచ్చింది. ఈసారి విజిల్ ధ్వని కాదు; గ్రామం దిశ నుండి గుర్రాలు వస్తున్న టకటకశబ్దం వినిపించింది. మరునిమిషంలో పిస్టల్ పేలిన మెరుపు, ధ్వని వచ్చాయి. వెంటనే దొంగలు ఎక్కడివాళ్ళక్కడ చెల్లాచెదరై పోయారు. ఒకడు సముద్రతీరం కేసి, మరొకడు కొండల కేసి ఇల్లా తలో దిక్కుకూ పారిపోయారు. ఒక్క ప్యూ తప్ప ఇంకెవ్వరూ మా హోటల్ సమీపంలో లేరు. వాడిమీద కసికొద్దీనో, లేక తమ ప్రాణం తాము రక్షించుకొనేందుకో మొత్తానికి వాడి అతిగతీ కనుక్కోకుండా అంతా పారిపోయారు. వాడు భయావేశంలో తానెక్కడుందీ, ఎటువైపు తిరిగిందీకూడా అంతుపట్టక కర్రతో నేలతట్టుతూ తన స్నేహితులను పిలిచాడు. చివరికి పొరపాటున గ్రామందిశగా బయల్దేరాడు. వంతెనకూడా దాటాడు.

"జానీ! నల్లకుక్కా! డర్క్ ఏమయ్యార్రా మీరంతా? నన్ను వదిలేసి పోయారా? గుడ్డివాణ్ణి, చిన్నప్పటినుంచీ మీతో తిరిగినవాణ్ణి నన్ను వదిలి పోయారా? జానీ!—" అంటూ ఇంకా కొన్ని అడుగులు ముందుకు నడిచాడు.

గుర్రాల ధ్వనులు ఇంకా సమీపించాయి. నలుగురైదుగురు మనుషులు గుర్రాలను అతివేగంగా పరిగెత్తిస్తూ వెన్నెలలో కనిపించారు.

ప్యూ తనపొరపాటు గ్రహించాడు. ఒక్క వెర్రి కేకవేసి వెనక్కి తిరిగాడు. తూలుతూ పరిగెత్తడంలో

రోడ్డుపక్కనున్న గోతిలో పడ్డాడు. మళ్ళీ లేచి నాలుగు ప్రదక్షిణాలు చేసి చివరికి పరుగెత్తుకొస్తున్న గుర్రాలకు అభిముఖంగా పరిగెత్తసాగాడు.

అన్నిటికంటే ముందున్న గుర్రంమీద మనిషి ప్యూను రక్షించడానికి ప్రయత్నించాడు. కాని కళ్లెం ఎంతలాగినా రోడ్డు వాలుగా ఉండటంచేత గుర్రం వేగాన్ని ఆపుకోలేకపోయింది. మొదటి గుర్రం ప్యూను ఒక్క తాపుతో నాలుగు గజాల అవతలకు గెంటి వేసింది. తరవాత గుర్రాలు అతన్ని హూనం హూనంగా తొక్కివేస్తూ ముందుకు పోయి ఆగాయి. ప్యూ కాస్త కదిలి బోర్లగిల పడ్డాడు. మళ్ళీ కదల్లేదు; మంచినీళ్లడక్కుండా చచ్చిపోయాడు.

నేను గట్టుమీదనుండి రోడ్డుమీదకురికి సంతోషంతో ఎలుగెత్తి కేకవేశాను. అప్పటికి వాళ్ళు గుర్రాలు దిగి వెనక్కు వస్తున్నారు. వాళ్ళలో ఒకణ్ణి నేను గుర్తుపట్టాను. మా కబురు అందజేయడానికి డాక్టర్ లివ్‌సే ఇంటికి వెళ్ళినమనిషే అతడు. మిగతా వాళ్లు రివిన్యూ అధికారులు. వాళ్ళను అతడు దోవలో కలుసుకున్నాడు. డాక్టరు ఇంటివరకూ వెళ్లడం అనవసరమని వాళ్లను వెంటపెట్టుకుని తిరిగివచ్చాడు. సూపర్‌వైజరు డాన్సు ఏదో పనిమీద మిగతా అధికారులతో మా గ్రామానికి వస్తున్నారు. వారు సమయానికి రాకపోతే, నేను, మాఅమ్మ ఏమైపోయేవాళ్లమో!

ప్యూ చనిపోయాడు. మా అమ్మ వంతెనసీడలో

ఇంకా మూర్ఛపోయేవుంది. ఆమెను గ్రామానికి చేర్చాము. కొంతసేపు ఉపచారాలు చెయ్యగా ఆమెకు తెలివివచ్చింది. స్పృహ వచ్చీరాగానే మాకింకా రావలసిన బాకీని గూర్చే మాట్లాడ మొదలెట్టింది. నేను గట్టిగా మందలించి ఊరుకోబెట్టాను. తరవాత నేను సూపర్‌వైజర్‌తోను, మిగతా అధికారులతోను కలిసి మా "ఎడ్మిరల్ బెన్‌బా"కు వెళ్లాను. భూకంపంలో నాశనమైన ఇల్లుకూడా ఆ స్థితిలో ఉండదు. దొంగలు మాకోసం వెదుకుతూ నానా భీభత్సం చేశారు. ఆ వెదకటంలో ఆఖరికి గోడ గడియారం కూడా కిందికి లాగేశారు. అయితే మా వస్తువులేమీ పోలేదు. కెప్టెన్ డబ్బుసంచీ, జేబులోని వెండినాణాలు మాత్రమే దొంగలించబడ్డాయి. ఈ గల్లంతంతా ఏమిటో సూపర్‌వైజర్ డాన్సుకు అంతుపట్టలేదు.

"డబ్బు ఎత్తుకుపోయారన్నావుగదా? మరిఇంత హడావిడి చేశారెందుకూ? ఇంకా ఎక్కువ డబ్బు కోసమా?" అని అడిగాడు డాన్సు.

"కాదండి సార్, డబ్బుకోసం కాదనుకుంటాను బహుశా నా జేబులోవున్న ఈ పార్సిల్ కోసం అనుకుంటాను ఈ హడావిడంతా," అని సమాధానమిచ్చా నేను, పార్శిల్ చూపిస్తూ.

"కావచ్చు, ఏదీ చూడనీ...నాదగ్గిర ఉంచుతానిది."

"వద్దండి. డాక్టర్ లివ్‌సేగారికి చూపించాలనుకున్నాను."

"రైట్! అవును, ముందాయనకి చూపించడం మంచిది. ఆయన జిల్లా మేజస్ట్రేటుకూడాను. అసలు నేనుకూడా ఇప్పుడే వెళ్ళి జరిగినదంతా డాక్టరుగారికిగాని, జమీందారుగారికిగాని రిపోర్టు చెయ్యడం మంచిదనుకుంటాను. పూర్యా మహాశయుడు చచ్చిపోయాడు గదా. వాడు చచ్చిపోయినందుకు నేను విచారిస్తున్నాననికాదు; లోకులు పలువిధాల చెప్పుకోవచ్చు దాన్నిగూర్చి అతడు చనిపోవడంలో నా తప్పేమీ లేదని ఋజువు చేసుకోవలసివుంది. సరే హాకిన్స్! నీకిష్టమైతే నాతోరా. డాక్టరుగారింటికి తీసుకు వెడతాను."

మిస్టర్ డాన్సుకు కృతజ్ఞత తెలిపాను. మళ్ళీ గ్రామానికి వెళ్లాము. నేను డాక్టరుగారింటికి వెడుతున్నానని, 'ఈ రాత్రికి వస్తే వస్తాను, లేకపోతే రా' ననీ మా అమ్మతో చెప్పాను. నేను అధికారుల్లో ఒకరి గుర్రాన్నెక్కాను. మిస్టర్ డాన్స్ ఆజ్ఞ ఇవ్వగానే గుర్రాలన్నీ హుటాహుటిగా డాక్టరుగారింటివైపు దౌడుతీశాయి.

# 6. కెప్టెన్ కాగితాలు

డాక్టర్ లివ్‌సేగారి ఇల్లు చేరుకున్నాం. లోపల అంతా చీకటిగా ఉంది. మిస్టర్ డాన్స్ తలుపు తట్టాడు. నౌకరొకడు వచ్చి తలుపు తీశాడు.

"డాక్టరుగారున్నారా?" అని అడిగాను.

డాక్టరుగారింట్లో లేరనీ, మధ్యాహ్నమే జమీందారుగారింటికి వెళ్ళారనీ, ఇంకా అక్కడే ఉండివుంటారనీ నౌకరు సమాధాన మిచ్చాడు.

"అక్కడికే వెడదాం, పదండి," అని మిస్టర్ డాన్స అన్నాడు.

జమీందారుగారిల్లు అట్టే దూరంలేదు. అందుచేత నేను మళ్ళీ గుర్రం ఎక్కకుండా వారి పక్కనే నడిచాను. జమీందారుగారి హవేలీ వెన్నెలలో ఒక పెద్ద కొండవలె కనిపించింది. గేటుదాటి విశాలమైన ఆవరణగుండా మెట్లెక్కి కేకవేశాము. మిస్టర్ డాన్స జమీందారుగారిని చూడగోరుతున్నామని ఒక నౌకరు ద్వారా లోపలికి కబురు పంపించాడు. తరవాత ఆ నౌకరే మమ్మల్ని లోపలికి తీసుకుపోయాడు. తివాసీలు పరిచిన నడవగుండా వెళ్ళాము. లైబ్రరీ గదిలో లైట్లు ధగధగ వెలుగుతున్నవి. ఎత్తైన బీరువాలలో అందంగా బైండు పుస్తకాలు అమర్చబడి వున్నాయి. జమీందారుగారు, డాక్టరుగారు చలిమంటకు దగ్గరగా చెరొక కుర్చీలోను కూర్చున్నారు. ఇద్దరి చేతుల్లోను పొగాకు పైపులున్నాయి.

జమీందారుగారిని అంతదగ్గిర్నుంచి నేనెప్పుడూ చూడలేదు. దాదాపు ఆరడుగులఎత్తు, దానికితగ్గ లావు కలిగి మంచి గంభీరంగా కనిపించారు. కళ్ళు తీక్ష్ణంగా

ఉన్నాయి. ముఖంలో కొంచెం మొరటుదనం కని పిస్తుంది.

"మిస్టర్ డన్స్! లోపలికి రా," అని జమీందారుగారు ఠీవిగా ఆహ్వానించారు.

"గుడ్ ఈవెనింగ్ డన్స్! గుడ్ ఈవెనింగ్ జిమ్! ఏమిటి ఇలా వచ్చారు అకస్మాత్తుగా," అని డాక్టరుగారు అడిగారు.

సూపర్‌వైజర్ డన్స్ శాల్యూట్ చేసి మా హోటల్లో జరిగిన వృత్తాంతం యావత్తూ వివరించాడు. వారిద్దరూ అత్యాసక్తితో మాకథ విన్నారు. గుడ్డివాడు గుర్రాలకిందపడి చనిపోయాడన్న సంగతి చెప్పేసరికి జమీందారుగారు "సెబాష్. మంచిపని చేశావు. వాణ్ణి వేరే ఉరితీయవలసిన అవసరం లేకుండా చేశావు," అని మెచ్చుకున్నారు. ఆపదలో చిక్కుకున్న నన్ను, మా అమ్మను కాపాడినందుకు అతన్ని చాలాసేపు అభినందించారు. డాక్టరుగారు నన్నడిగారు:

"జిమ్! దొంగలు వెతుకుతున్న పార్సిల్ నువ్వు దాచావన్నావు గదూ?"

"అవునండి. ఇదిగో నా జేబులోనే వుంది," అని పార్సిల్ తీసి ఇచ్చాను.

డాక్టరుగారు దాన్ని అన్నివేపులా పరీక్షించారు. ఆయన దాన్ని తెరుద్దామా, వద్దా అని సందేహిస్తున్నట్లు తోచింది. చివరి కిలా గన్నారు:

"మిస్టర్ డాన్స్! నీకు చాలా పనివున్నట్లున్నది. నువ్వు ఇక వెళ్లు. జిమ్ హాకిన్స్ ఈ రాత్రికిక్కడే వుంటాడు." జమీందారుగారు మళ్లీ డాన్స్‌ను అభినందించారు. అతడు శాల్యూట్ చేసి తనతోటి అధికారులతో కలిసి వెళ్లిపోయాడు. జమీందారుగారు నాకు భోజనం తెప్పించారు. ఆ సాయంత్రం జరిగిన వింత అనుభవాలతో నాకు అంతవరకు ఆకలి తెలియనే లేదు. భోజనం చూడగానే ఎక్కడలేని ఆకలీ వచ్చింది. కడుపునిండా ఆరగించాను. ముగ్గురం స్థిమితంగా కూర్చున్నాం.

"సరే, జమీందార్ ట్రెలానీ!—

"సరే, డాక్టర్ లివ్ సే!—" ఇద్దరు ఒకేసారిగా ఒకరినొకరు సంబోధించారు.

"ఆ, ఆ, ఒకళ్లతరవాత ఒకళ్లు," అని డాక్టరుగారు నవ్వుతూ అన్నారు. "ట్రెలానీ! ఈ ఫ్లింట్‌ను గూర్చి నువ్వు విన్నావుగదూ?"

"విన్నానా?— వినడ మేమిటోయ్ డాక్టర్? అంత పరమకిరాతకుడు, దుర్మార్గుడు, హంతకుడు ఈ భూప్రపంచంలో ఇంకోడు లేడనుకో. స్పెయిన్ దేశంవాళ్ళకి ఫ్లింట్ పేరు చెబితే హార్, హార్. అంత గొప్ప సముద్రపుదొంగ ఇంగ్లీషువాళ్ళలో పుట్టినందుకు నేనప్పుడప్పుడు గర్వపడేవాణ్ణికూడా. ఇం తెందుకూ?

ఒకసారి వాణ్ణి ట్రినిడాడ్‌లో చూశాను. ఓరి వీణ్ని నరికెయ్య! ఎల్లా ఉన్నాడనుకున్నావ్?"

"వాడిపేరు నేనుకూడా చాలసార్లు విన్నాను. అది కాదు మనకిప్పుడు కావలసింది. ఫ్లింట్ ఏమన్నా డబ్బు గడించాడా?"

"డబ్బా! నీకు తెలియదేమిటి? ఇప్పుడీ దొంగలు దేనికోసం ప్రయత్నిస్తున్నా రనుకున్నావ్? డబ్బుకోసం కాకపోతే వాళ్ళింత తెగించి దేనికొచ్చా రనుకున్నావ్?"

"త్వరలోనే తెలుస్తుంది ఆసంగతి. నువ్వునన్ను మాట్లాడనివ్వవేం? ప్రతి మాటా అలా ఆశ్చర్యార్థకాలతో మాట్లాడితే నేనేం మాట్లాడేది? నే నడిగేది ఇది—ఈపార్సిల్‌లో ఫ్లింట్ గడించిన డబ్బు ఎక్కడుందో తెలిపే కిటుకు ఏదన్నా ఉంటుందనుకో. దాని కోసం ప్రయత్నించటం లాభసాటి అవుతుందా, కాదా?"

"లాభమా? ఏమిటి నీ ఉద్దేశ్యం? ఫ్లింట్ ఏ మాత్రం సంపాదించాడని నీ అభిప్రాయం? కొన్ని లక్షలు పైగా ఉంటుంది. ఆ కిటుకే గనక నిజంగా దొరికితే ఈ క్షణంలో నేను బ్రిస్టలు వెళ్ళిఓడ కొనేసి రెడీగా ఉంచుతాను. రెండు రోజుల్లో నువ్వు, నేను, హాకిన్సు బయలుదేరి ఆ స్థలానికి వెడతాం. ఒక ఏడాదిలో ఫ్లింట్ డబ్బును పట్టుకోకపోతే నా పేరు ట్రెలానీ కాదు."

"సరే," అన్నారు డాక్టరుగారు. "జిమ్ అను మతిమీద ఈ పార్సిల్ విప్పుదాం," అంటూ పార్సిల్‌ను బల్లమీద పెట్టారు. దగ్గరదగ్గరగా కుట్టబడినందున పార్సిల్ విప్పడం సాధ్యం కాలేదు; చాకుతో కుట్లు కోసివేయవలసి వచ్చింది. అందులో ఒక పుస్తకం సీలు వేయబడిన ఒక కాగితం ఉన్నాయి.

"ముందు పుస్తకం చూద్దాం," అన్నారు డాక్టరుగారు.

నేను, జమీందారుగారు డాక్టరుగారి బుజాల మీదుగా వంగి ఆత్రంగా పుస్తకం కేసిచూస్తున్నాము. డాక్టరుగారు వెనక్కితిరిగి మమ్మల్ని చూసి, నవ్వి, కుర్చీలు వేసుకు కూర్చోండన్నారు. బల్ల దగ్గరగా కుర్చీలు లాక్కున్నాము.

మొదటి పేజీమీద పిచ్చిగీత లున్నాయి. చేతిలో పెన్సిలువుంటే ఏమీ తోచనివాడు గీసిన గీతల వలె ఉన్నాయి. రెండో పేజీలో "మిస్టర్ విలియం బోన్స్, తండేలు" అని వున్నది. ఇంకో పేజీలో "ఇక రమ్ తాగను," అని రాయబడివుంది. ఇంకా ఏమిటో అక్షరా లున్నాయిగాని స్పష్టంగా తెలియటం లేదు.

"ఉహూ. ఇందులో మనకి పనికివచ్చేదేం లేదనుకుంటాను," అని డాక్టరుగారు పేజీ తిప్పారు.

తరవాత పది పన్నెండు పేజీలవరకూ జమా ఖర్చుల పద్దు వ్రాయబడివుంది. మనుషుల పేర్లుగాని

స్థలాలపేర్లుగాని ఎక్కడా లేవు. మనుషులపేర్లు ఉండవలసినచోట్ల ప్లస్‌గుర్తులు, స్థలాలపేర్లు ఉండవలసినచోట్ల అక్షాంశరేఖలు, మధ్యాహ్నరేఖలు మాత్రమే ఉన్నాయి.

"ఏమిటో యీ గొడవంతా? తలా తోకా లేకుండా ఉంది," అన్నారు డాక్టరుగారు.

"ఇది ఆ తాగుబోతు పద్దు పుస్తకం. ప్లస్ గుర్తులు సముద్రపు దొంగలు దోచుకున్న పట్టణాలనో ఓడలనో తెలియజేస్తాయి. ఈ పైకం అంకెలు వాడి వాటాకు వచ్చినడబ్బు అయివుంటుంది. చూడరాదూ, ఏళ్ళు గడిచిన కొద్దీ వాడెంత ధనవంతుడయ్యాడో ఈఅంకెలే తెలుపుతున్నాయి." అన్నారు జమీందారుగారు ఒక గొప్ప అపరాధపరిశోధకుడిలా మొహం పెట్టి.

"రైట్! అంతే. నీ దేశసంచారపు అనుభవం ఇప్పుడు పనికివస్తోంది. బోన్స్ మహాశయుడు చాలా పొదుపరిలా గున్నాడు. అంతాజమే తప్ప ఖర్చు కనిపించడం లేదు." అన్నారు డాక్టరుగారు.

ఆ పుస్తకంలో ఇంక చూడవలసిందేమీ లేదు. చివర వివిధ దేశాల నాణాలకూ ఇంగ్లీషు నాణాలకూ విలువల మానం తెలియచేస్తూ ఒక పట్టిక మాత్రం వున్నది.

"సరే. ఈ కాగితం తీసి చూద్దాం ఇహ," అని డాక్టరుగారు అతి జాగ్రత్తగా సీళ్ళు తీసివేశారు. ఒక

ద్వీపపటం కనిపించింది. అక్షాంశరేఖలు, మధ్యాహ్న రేఖలతో సహా దాని ఉనికిపట్టు, ద్వీపంలోని కొండలు, సింధుశాఖలు, అఖాతాలు, ఇంకా ఇతర వివరాలన్నీ వ్రాయబడివున్నాయి. ద్వీపం తొమ్మిదిమైళ్ల పొడుగు, అయిదుమైళ్ల వెడల్పు ఉండవచ్చును. ఒక లావుపాటి రాక్షసుడు నుంచున్నట్టుగా వుంది దానిఆకారంచూస్తే. రెండు చక్కని రేవులున్నాయి. పడమటివేపున "స్పై గ్లాస్ కొండ" అని ఎత్తైన కొండ ఒకటుంది.

ద్వీపం ఉత్తరభాగంలో ఎర్రసిరాతో రెండు ప్లస్ గుర్తులున్నాయి. నైరృతి భాగంలో ఒకప్లస్‌గుర్తు "గుప్తధనం—7,00,000 పౌ॥" అని ఎర్ర సిరాతో రాయబడివున్నది.

ఈ పటం చూడగానే డాక్టరుగారు, జమీందారుగారు సంతోషాతిరేకంలో మైమరిచిపోయారు.

"లివ్‌సే! నీ వెధవ డాక్టరు వృత్తి మానెయ్. రేపు నేను బ్రిస్టల్‌కు పరిగెత్తుతున్నాను. మూడు వారాలు—మూడువారాలు—!—రెండు వారాల పదిరోజుల్లో ప్రపంచంలోకల్లా గొప్పఓడను, కళాసీలను సంపాదిస్తాను. హాకిన్స్ 'ఓడనౌకరు'గా వస్తాడు. జిమ్! ఓడ నౌకరుగా నువ్వు బలే అద్భుతంగావుంటావు. లివ్‌సే! నువ్వు ఓడ డాక్టరుగా ఉందువుగాని. నేను ఓడకు ఎడ్మిరల్ (సర్వాధికారి)గా ఉంటాను. మాఇంటి జమాన్లు రెడ్రూత్, జాయిస్, హంటర్‌లను కూడా

తీసుకుపోదాము. మన ఓడకి గాలులు అనుకూలంగా ఉంటాయి. కొద్దిరోజుల్లో ద్వీపం చేరుకోగలం; గుప్త ధనాన్నిట్టే కనుక్కుంటాం. ఇంక ఒక్కొక్కళ్ళు తినగలిగినంత డబ్బు తినేద్దాం. ఓ—బలే, అద్భుతం, మహాద్భుతం, పరమాద్భుతం—"

జమీందారు గారి ఉపన్యాసాని కడ్డం వచ్చి డాక్టరుగారు, "ట్రెలానీ! నేను నీతో ప్రపంచం చివరలవరకూ రమ్మన్నా వస్తాను. జిమ్‌కూడా వస్తాడు. కాని నా కొక మనిషి అంటే భయంగా వుంది," అన్నారు.

"ఎవడా దుర్మార్గుడు? ఎవడా కుక్క? చెప్పు ఈ క్షణంలో వాణ్ని—"

"నువ్వే. నువ్వంటే నాకు భయంగా వుంది. నీకు నోట్లో నువ్వుగింజ నానదు. ఈ ద్వీపాన్ని గురించి తెలిసినవాళ్ళం మన మొక్కళ్ళమే కాదు. ఈ రాత్రి హోటలును ముట్టడించిన సముద్రపు దొంగలకుకూడా కాంచనద్వీపం అనేది ఒక టున్నదనీ, దానికో చక్కని పటం తయారుచేయబడివుందనీ తెలుసు. వాళ్ళు ప్రాణాలకు తెగించి అయినా డబ్బు కాజెయ్యాలనే నిశ్చయంతో ఉన్నారు. మన దగ్గిర ఆ పటం ఉందని వాళ్ళకు యీపాటికే అనుమానం కలిగి ఉంటుంది. మనం సముద్రంమీద బయలుదేరే క్షణందాకా ఒంటరిగా ఎక్కడా తిరగకూడదు. నేను, జిమ్ యీ నాలుగురోజులు కలిసే ఉంటాం. నువ్వు బ్రిస్టల్‌కు

వెళ్ళేటప్పుడు జాయిస్, హంటర్‌లను వెంటపెట్టుకుని వెళ్ళు. మన ముగ్గురికీ తప్ప మరొకరికి ఈ పటం విషయం, మన గమ్యస్థానం విషయం తెలియగూడదు.

"రైట్, లివ్‌సే! నువ్వన్నమాట అక్షరాలా నిజం. నేనిదిగో చేతిలో చెయ్యేసి చెబుతున్నాను' భ స్త్రే ఇంకోడికి చెప్ప నీ విషయం. నామాట నమ్ము."

## 7. నా బ్రిస్టల్ ప్రయాణం

మేము సముద్ర యానానికి సిద్ధం కావడం జమీందారుగా రూహించిన దానికంటె ఆలస్యం అయింది. అసలు మేము మొదట్లో వేసుకున్న ప్లానుల్లో ఒకటీ అనుకున్నట్టు జరగలేదు. డాక్టరు లివ్‌సేగారూ నేను ఒకరినొకరం వదిలిపెట్టి ఉండరాదని మొదట్లో అనుకున్నా, అలా సాధ్యం కాలేదు. డాక్టరుగారు తన ప్రాక్టీసు నెవరికి అప్పజేప్పాలా అని సమస్యలో పడి చివరికి మరొక డాక్టరును మాట్లాడేందుకు లండన్ వెళ్లారు. జమీందారుగారు బ్రిస్టల్‌లో ఓడకు సంబంధించిన ఏర్పాట్లలో మునిగి ఉన్నారు. ఇక నేను మాత్రం రోజుల తరబడి జమీందారు గారింట్లోనే ఉండిపోవలసి వచ్చింది. నేనెక్కడికీ కదలకుండా చూసేందుకు జమీందారుగారు తన తోటమాలి రెడ్రూత్‌ను కాపలా ఉంచారు.

ఆ కాసిని రోజులు కారాగారంలో ఉన్నంత బాధ

పడ్డాననుకోండి. వృద్ధుడైన రెడ్రూత్ ను తప్పిస్తే మరో ప్రాణి లేదాయెను మాట్లాడేందుకు. ఒంటరిగా ఆ దివాణంలో ఏమీతోచక చచ్చేవాణ్ణి. అస్తమానమూ నా ఆలోచనలు కాంచనద్వీపంపై కేపోయేవి. ఎప్పుడూ ఆ ద్వీపపటంలోని వివరాలను గూర్చే కలలుకనేవాణ్ణి. హాల్లో చలిమంట దగ్గరగా సోఫాలో కూర్చుని ఊహాలో ద్వీప దృశ్యం చిత్రించుకుని గుప్తధనంకోసం ప్రతి అంగుళమూ అన్వేషించేవాణ్ణి. 'టెలిస్కోప్ కొండ' అని పిలవబడే ఎత్తైనకొండ ఎన్ని వందలసార్లు ఎక్కి ద్వీపరామణీయకం చూసి ఆనందించానో చెప్ప లేను. ఒక్కోసారి ద్వీపమంతా ఆటవిక మనుష్యులతో నిండివున్నట్లు, మేము వాళ్ళతో ఘోర యుద్ధంచేసి ఓడించినట్లు ఊహించుకునేవాణ్ణి. ఇంకోసారి క్రూర వనమృగాలతో నిండివున్నట్లు, మమ్మల్ని అవి నిరం తరం వెంటాడినట్లు అనిపించేది. కాని మేము కాంచనద్వీపంలో నిజంగా ఎదుర్కోవలసి వచ్చిన అపాయాలతో పోల్చిచూస్తే ఈ ఊహా ప్రమాదాలు ఏమూలకి?

కొన్నివారాలు ఇలా సోమరిగా గడిచాయి. ఒక శుభ ప్రభాతాన బ్రిస్టల్ నగరంనుండి ఒక లేఖ వచ్చింది అది డాక్టర్ లివ్ సే పేరిటవచ్చినా, "డాక్టర్ ఉళ్ళోలేకపోతే టామ్ రెడ్రూత్ గాని, జిమ్ హాకిన్స్ గాని తెరవవచ్చు," అని పైన వ్రాయబడివుంది. డాక్టరు గారింకా లండన్ నుండి తిరిగిరాలేదు. అందుచేత మేము

కవరుచించి చూశాము. మా రెడ్రూత్ అచ్చు అక్షరాలుతప్ప రాత తిన్నగా చదవలేడు. కనుక నేనే ఉత్తరం చదివి వినిపించాను:—

పాతలంగరు హోటల్,
బ్రిస్టల్, మార్చి 1, 17—

ప్రియమైన లివ్ సే,

నువ్వు మా ఇంటిలో ఉన్నావో లేవో తెలియదు కనుక ఈ ఉత్తరం నకలు లండన్‌కూడా పంపిస్తున్నాను.

ఓడకొనేశాను హార్బరులో రెడీగా ఉంది. అంతమధురమైన, సుందరమైన ఓడ నువ్వు జన్మలో చూసి ఉండవు—నాలుగేళ్ల పాపాయికూడా దాన్ని నడపగలడు—రెండువందల టన్నుల బరువు—పేరు హిస్పానియోలా.

ఆ ఓడని నాపాలి మిత్రుడు బ్లాండ్లీ సంపాయించి పెట్టాడు. అతనంతటి అద్భుతుణ్ణి నేనెక్కడా చూళ్లేదు నాకోసం ఎంతశ్రమ పడ్డాడనుకున్నావ్. అతనేకాదు—అంతా అల్లాగే మనకోసం శ్రమపడ్డారు—మనం చేస్తున్న పని (డబ్బంటే ఏమిటి మరి?) చెప్పేసరికి గులాములైపోయి సలాములు కొట్టారనుకో నాకు.”

ఉత్తరం ఆపాను. “రెడ్రూత్! చూశావా, జమీందారుగారు అందరితోనూ చెప్పేస్తున్నారు, డాక్టరుగారు వద్దన్నాకూడా,” అన్నాను.

“అది ఆయనఇష్టం. డాక్టరుగారెవరు వద్దనటానికి? అన్నాడు స్వామి భక్తుడైన రెడ్రూత్.

ఇక వ్యాఖ్యానించడం మానేసి ఉత్తరం చివరికంటా చదివాను:—

ఓడలో వేలెత్తి చూపటానిక్కూడా లోపంలేదు. చూసినవాళ్లు, చూడనివాళ్లూకూడా అదేమాటన్నారు. కాని ఒక్కటే

వచ్చింది-చిక్కు. ఓడనడిపే సిబ్బంది దొరకడం గగనమైపోయింది. కనీసం ఇరవైమందన్నా ఉండాలిగా—ఏమో ఆ ద్వీపంలో మనుష్యుల్ని నంచుకుతినే జాతివాళ్లున్నారేమో ఎవరికి తెలుసు; పైగా సముద్రపు దొంగలు మన్ని ఎదుర్కోరని నమ్మకమేమిటి?—కాని అరపజనునుంచి దొరికేటప్పటికి తాతలు దిగొచ్చాను. కాని దేవుడు దయవల అదృష్టం తోసుకొచ్చింది. నాక్కావలసిన మనిషి దొరికాడు.

మనఓడ సరంబీమీద నుంచుని బుర్ర గోక్కుంటున్నాను. ఇంతలో ఒకమనిషి చక్కా వచ్చాడు. అనుభవంగల నావికుడు; బ్రిస్టల్‌లో అత నెరగని కళాసీ లేడు; చాల రోజులెంౘట సముద్రం వదిలి; నీటిమీట చేపమోస్తునగా వుందిట అతనికి; మళ్లీ సముద్రయానం చెయ్యాలనుందిట; ప్రస్తుతం హోటలు పెట్టుకుని గడుపుతున్నాడట; ఎవరన్నా వంటవాడుగా ఉద్యోగమిస్తే బావుండునని చూస్తున్నాడట.

అతనికథ విని నాకు చాలా జాలివేసింది. వెంటనే మన ఓడలో వంటవాడుగా కుదిర్చాను. అతనిపేరు లాంగ్ జాన్ సిల్వర్ ; ఒక కాలులేదు పాపం; యుద్ధాల్లో పొగొట్టుకున్నాడట; మనదేశం తరఫున యుద్ధాల్లో పాల్గొని ఒక కాలు త్యాగం చేశాట్ట. కాని అతనికి ప్రభుత్వం ఫించనైనా ఇవ్వటంలేదు హు! ఏం ప్రభుత్వమోయ్, లివ్ సే, వెధవ ప్రభుత్వం.

నేను మంచివంటవాణ్ణిమాత్రమే సంపాదించాననుకున్నాను; కాదు—ఒక సిబ్బందినే సంపాదించి నట్లయింది. ఎందుకంటే సిల్వర్ సహాయంతో రెండుమూడు రోజుల్లో మనక్కావలసినంత మంది కళాసుల్ని సేకరించాను, చూటానికొట్టే బావుండరనుకో. కాని అతిసాహసులు; అతిసమర్థులు; పసిఫిక్ సముద్రాన్ని ఈదమన్నా కళ్లుమూసుకుని దూకేటంత దమ్ములున్న వాళ్లు. వాళ్లతో మనం బయల్దేరితే హిస్పానియోలా "ఈ రేసు జగంబుల నకేయంబు "

నేను అంతకుముందు మాట్లాడిన అరడజను కళాసీల్లో ఇద్దర్ని సిల్వర్ మాటమీద డిస్మిస్ చేసి పారేశాను. వాళ్లువట్టి దతటలని అతను అభిప్రాయ పడ్డాడు.

నా ఆరోగ్యం బాగా నేవుంది. మదించిన ఆంబోతులా తింటూ, తుమ్మమొద్దులా నిద్రపోతున్నాను. కాని మనం బయల్దేరే వరకూ నాకు మనశ్శాంతి ఉండదు. నాముద్దుల కాంచనద్వీపం? ఎప్పుడు చూస్తానో! వెధవడబ్బు — ఎవడికొక్క వాలోయ్. నాకిప్పుడు డబ్బు తక్కువైందనా? సముద్రాలమీద దూర, విర్జన ప్రదేశాలకు వెళ్లాలనే కుతూహలంగాని. లివ్ సే! నుంచున్న పళంగా బయల్దేరిరా—నామీద ఏమాత్రం గౌరవమున్నా ఆలస్యం చెయ్యకు.

జిమ్‌హాకిన్స్ వాళ్ళమ్మను చూడాలనుకుంటుంటే రెడ్రూత్ ను తోడిచ్చి పంపించు తరవాత వాళ్ళిద్దరూ బ్రిస్టల్ వస్తారు.

జాన్ ట్రెలానీ.

ఒకముక్క:—మనం ఆగస్టు నెలాఖర్లోగా తిరిగి రాక పోతే బ్లాండ్లీమన్ని వెదికేందుకు మరోకఓడను, సిబ్బందిని పంపిస్తా నన్నాడు. మర్చిపోయా—మనఓడకు బలేమంచి కెప్టెన్ దొరి కాడు. కొంచెం తల బిరుసుమనిషిగాని, తతిమా విషయాల్లో అమూల్యుడనుకో. లాంగ్ జాన్‌సిల్వర్ మనఓడకు మంచి తండే లును సంపాయించాడు; అతని పేరు యూరో.

సిల్వర్ ఏమి టనుకున్నావో, మంచిస్థితి మంతుడే, బ్యాంకిలో చాలా నిలవ వేశాడు. అతనికో నీగ్రో పెళ్లాముంది. ఆమెకు హోటల్ నడిపే బాధ్యత అప్పగించాడు. కొంచెంగయ్యాళి దని వినికిడి. నువ్వూ నేను బ్రహ్మచారిగాళ్లమైనా, సిల్వర్ పెళ్లాన్ని విడిచి సముద్రాలకు యెందుకు ఎగబడుతున్నాడో గ్రహించడం కష్టం కాదు.

జా. ట్రె.

ఇంకోముక్క:—హాకిన్స్ వాళ్ళమ్మదగ్గర ఒక్కరోజుకంటే ఎక్కువ ఉంచటానికి వీల్లేదు.

జా. ట్రె.

ఈ ఉత్తరం చదువుతుంటే నాగుండె సంతో షంతో ఎంత వేగంగా కొట్టుకుందో చెప్పనక్కర్లేదు.

మర్నాడు ఉదయం ట్రెడ్రూత్ తో కలిసి నేను "ఎడ్మిరల్ బెన్ బౌ"కు బయల్దేరి వెళ్ళాను. మా అమ్మ కులాసాగానే వుంది. మాహోటల్ వ్యాపారం యథా ప్రకారంగా సాగుతూనే వుంది. జమీందారుగారు ఈలోగా హోటల్ అంతా మరమ్మతు చేయించారు. కొత్త సామాను కూడా కొనిపెట్టారు. హాల్లో మాఅమ్మ కూర్చునేందు కొక అందమైన సోఫాకూడా అమర్చారు. నేను లేనంత కాలం మా అమ్మకు చేదోడువాదోడుగా ఉండేందుకు నాయీడు కుర్రాణ్ణి ఒకణ్ని కూడా నియమించారు.

జమీందారుగారి దివాణంలోఉన్నంత కాలమూ సముద్రయానంమీదనే మనస్సుపెట్టుకుని ఉన్నవాణ్ణి, మా అమ్మను చూడగానే, నాకు ఆపరాని దుఃఖం వచ్చింది. నాకు శైశవంనుండి బాగా పరిచయమైన మా "బెన్ బౌ" పరిసరాలను, కొండలను, అడవులను, సముద్రతీరాన్ని వదలి వెళ్ళడం ఎంతకష్టమో అప్పుడు తెలిసింది.

ఆ రాత్రి మా ఇంట్లోనే గడిపాము. మర్నాడు భోజనమైనాక మళ్ళీ ట్రెడ్రూత్, నేనూ కలిసి బయల్దే

రాము. మా అమ్మకు వీడ్కోలిచ్చాను "బెన్ బా"కు, కొండలకు, అన్నిటికీ వీడ్కోలిచ్చాను.

బ్రిస్టల్ నగరానికి టిక్కెట్ పుచ్చుకొని టపాబండి ఎక్కాము.

నేను రెడ్రూత్ కూ, మరొకస్థూలకాయుడైన పెద్దమనిషికీ మధ్య ఇరుక్కుని కూర్చున్నాను. కనుక ఆ రాత్రి ఎంత చలిగా ఉన్నా నాకు వెచ్చగానే ఉంది. బండి కుదుపులకు చక్కటి నిద్రకూడా వచ్చింది, లేచే టప్పటికి తెల్లవారింది. "అబ్బాయ్! బ్రిస్టల్ వచ్చాంలే" అని రెడ్రూత్ అంటున్నాడు.

ఇద్దరం బండిదిగాము. జమీందారుగారు హార్బరుకు దగ్గరలోనే బసచేశారు—మా ఓడ మరామత్తులు కరామత్తులు దగ్గిరుండి చేయించవచ్చుగదా అని. అక్కడికి నడిచిపోయాము. దోవలో రకరకాల ఓడలు, రంగు రంగులవి, దేశదేశాలవి ఎన్నో కన్నుల పండువుగా కనిపించాయి. ఒక ఓడలో కళాసీలు పదాలు పాడుకుంటూ పనులు చేసుకుంటున్నారు. ఇంకొక ఓడలో ఎత్తయిన తెరచాప కొయ్యలపైకెక్కి పనిచేస్తు న్నారు. అంతకుముందు ఎప్పుడూ అటువంటి గొప్ప దృశ్యం చూడలేదు నేను. కళాసీలు బలే తమాషాగా వున్నారు. చెవులకు ఇత్తడిరింగులు, గడ్డాలు, మీసాలు పిలకలు—వాళ్ళని చూసినకొద్దీ చూడ బుద్ధయింది. అంతమంది మహారాజుల్ని చూసినా నాకు అంత సంతోషం కలిగేది కాదేమో.

పైగా నేనుకూడా సముద్రయానం చెయ్యబోతున్నాను. 'మధురమైన,' సుందరమైన, హిస్పానియోలా నౌకలో, ఎక్కడికో, ఎంత దూరానికో వెళ్లిపోతున్నాను. హాయ్, హాయ్! ఎంత గొప్ప అదృష్టం నాది!

ఇల్లా మధురస్వప్నాల్లో తేలిపోతున్న నన్ను రెడ్రూత్ చెయ్యిపట్టుకుని కుదిపిందాకా నాకు తెలివే రాలేదు. చూసేటప్పటికి జమీందారుగారు ఎదురుగా నవ్వుతూ కనిపించారు, హోటల్ మెట్లమీద నుంచుని. ఆయన అప్పుడే కొత్తబట్టలు కుట్టించి నట్లున్నారు. పక్కా 'ఎడ్మిరల్' (నౌక సర్వాధికారి) వేషంలో ఉన్నారు. అంతేకాదు—నావికుల నడకనికూడా పట్టేశారు.

"మీరూ వచ్చారే," అంటూ ఆయన మా దగ్గిరికి వచ్చి లోపలికి తీసుకుపోయారు."డాక్టరురాత్రే లండన్ నుండి వచ్చాడు. సిబ్బంది సంపూర్ణమైంది మీరు రావటంతో. హేయ్, బ్రేవో!" అని ఉషారుగా అన్నారు.

"సార్. మన ప్రయాణం ఎప్పుడు?" అని అడిగాను అంతకంటే ఉషారుగా.

"ప్రయాణమా ? రేపేనోయ్, రేపే!"

# 8. "టెలిస్కోప్" హోటల్

ప్రాతఃకాల భోజనం ఆరగించాను. జమీందారు గారు లాంగ్ జాన్ సిల్వర్ కు ఒక ఉత్తరం రాసి నాద్వారా పంపించారు. హార్బరురోడ్డు వెంబడేపోతే "టెలిస్కోప్" అనే పేరుగల హోటల్ కనిపిస్తుందనీ, అక్కడ సిల్వర్ కనిపిస్తాడని చెప్పారు. మళ్లీ కొన్ని ఓడల్ని, నావికుల్ని చూడవచ్చుగదా అని ఎగురు కుంటూ బయల్దేరాను రోడ్డంతా సరుకులు తీసుకు వచ్చే బళ్ళూ, తీసుకుపోయే బళ్లూ. జనసమ్మర్దం పొద్దుటికంటే ఎక్కువైంది.

కొంతదూరం పోగా "టెలిస్కోప్" హోటలు కనిపించింది. బోర్డుమీద టెలిస్కోప్ బొమ్మ కూడా ఉంది. గోడలకు కొత్తగా వెల్లవేశారు. కిటికీలకు ఎర్రటి తెరలున్నాయి. హోటల్ కు ఆపక్క ఈపక్క సందులున్నాయి. సందుల్లోకి తెరుచుకుని ద్వారా లున్నాయి. లోపలికి గాలీ, వెల్తురూ బాగావస్తూ కళ కళలాడుతూ ఉంది.

లోపల ఫలహారాలు, పానీయాలు సేవిస్తున్న వారిలో చాలామంది నావికులే. వాళ్ళ మాటలు, మొహాలు బలే దాక్షిణ్యంగా ఉన్నాయి. లోపలికడుగు పెట్టడానికి జంకుతూ గుమ్మంలోనే నిలబడ్డాను.

ఇంతలో పక్కగదిలో నుండి ఒక మనిషి వచ్చాడు. చూడగానే లాంగ్ జాన్ సిల్వర్ అని తెలిసి

పోయింది. ఎడమకాలు తొడసమీపంలో కోసివేయబడివుంది. ఎడమచంకలో ఊతకర్ర పెట్టుకున్నాడు. పిచ్చిక గెంతినంత తేలిగ్గా గెంతుతూవచ్చాడు. మనిషి చాలా పొడుగ్గా, బలిష్ఠంగా ఉన్నాడు. మొహం గుండ్రంగా బండగా ఉన్నా తెలివితేటలు ఉట్టిపడుతూ, చిరునవ్వుతో పిప్పారి ఉన్నది. ఉత్సాహంగా, కూని రాగంతీస్తూ, బల్లలమధ్యగా ఎగురుకుంటూ, నన్ను సమీపించాడు.

నిజం చెప్పాలంటే, ఆ రోజున జమీందారుగారు రాసిన ఉత్తరంలో లాంగ్ జాన్ సిల్వర్ పేరు చూసినప్పటినుండి నాకు భయంగానే వుంది—బిల్లీ బోన్స్ చెప్పిన "ఒంటికాలు పెద్దమనిషి" ఇతడేనేమో నని. కాని మనిషిని ఒక్కసారి చూడగానే నా భయాలన్నీ తీరిపోయాయి. బిల్లీబోన్స్, నల్లకుక్క, ప్యూ మొదలైనవారిని చూశాను గనుక సముద్రపు దొంగలంటే ఎలా ఉంటారో నాకు తెలుసు. సిల్వర్ను చూస్తే ఘరానామనిషి అనిపించాడు గాని ఎక్కడా అనుమానపడటానికి ఆస్కారమే లేదు.

"మిస్టర్ సిల్వర్ అంటే మీరేనా?" అని అడిగాను.

"అవునమ్మా, నేనే," అన్నాడతడు. "నీపేరు", అని అడిగాడు. నేను మాట్లాడకుండా జమీందారుగారి ఉత్తరం అందించాను. అదిచూడగానే ఒక్కసారి ఉలికిపడి నావంక చూశాడు.

"ఓ నువ్వా? సరిసరి నువ్వు మాఓడ కుర్రాడివిగదూ? నీగురించి చెప్పార్లే జమీందారుగారు," అంటూ కరస్పర్శ చేశాడు.

అంతలో అవతల చివర ద్వారానికి దగ్గరగా కూర్చున్న ఒకడు హఠాత్తుగా లేచి బైటికి వెళ్ళి పోయాడు. నేను వాణ్ని చూడగానే గుర్తుపట్టాను.

"ఓరన్న. వాణ్ని పట్టుకోండి నల్లకుక్క!!" అని అరిచాను.

"నల్లకుక్కో, తెల్లకుక్కో నాకనవసరం. కాని వాడెవడో బిల్ చెల్లించకుండానే పారిపోతున్నాడు. హారీ! వాణ్ని పట్టుకోరా," అని సిల్వర్ ఆజ్ఞాపించాడు.

హోటల్ నౌకరుగావును గబాలున వీధిలోకి పరిగెత్తాడు నల్లకుక్కను పట్టుకోడానికి.

"వాడు సాక్షాత్తు మహారాజైనా సరే, బిల్ చెల్లించితీరాలి నాదగ్గర ఈ పప్పు లుడకవు," అని నా చెయ్యి వదిలిపెడుతూ అడిగాడు: "ఎవరన్నావు వాడు? నల్ల..."

"నల్లకుక్కండి. ట్రెలానీ గారు మీతో చెప్ప లేదా, సముద్రపు దొంగల్నిగూర్చి? వాళ్ళవాడే వాడు," అన్నాను.

"నిజంగా? ఓరి వీడి తస్సదియ్యా. నా హోటల్‌కి రావడానికి వాడికెన్ని గుండెలున్నాయ్! బెన్! పరుగెత్తు. నువ్వుకూడా వాణ్ని లాక్కురా వాడు దొంగ అన్నమాట. తస్సదియ్యా. ఆ దొంగతో కూర్చుని

కబుర్లు చెబుతోంది ఎవరు? నువ్వేనా టామ్ మోర్గన్? ఇటురా."

మోర్గన్ అనబడే ఆమనిషి సిల్వర్ దగ్గిరికి తూలుకుంటూ వచ్చాడు. అతడు వృద్ధుడు; జుట్టు నెరిసింది; కళాసీ దుస్తుల్లో ఉన్నాడు.

"ఇదుగో మోర్గన్! నువ్వు ఇదివర కెప్పుడన్నా ఆ నల్ల...నల్ల—నల్లకుక్కను చూశావా?" అని అడిగాడు సిల్వర్.

"లేదండి," అని భయపడుతూ చెప్పాడు మోర్గన్.

"వాడి పేరు తెలుసా నీకు?"

"ఉహూ."

"తన్నదియ్యా, టామ్‌మోర్గన్! బతికి పోయావ్ ఇవ్వాళ్టికి. అల్లాంటి వాళ్ళతో నువ్వు మాట్లాడుతున్నావనిగాని, తిరుగుతున్నావనిగాని తెలిస్తే నిన్నిక్కడ అడుగు పెట్టనివ్వను తెలుసా. జాగ్రత్త ఏమిటి వాడు చెబుతున్నాడు నీతో?"

"నాకు తెలియదండి."

"తన్నదియ్యా. నీ మెడకాయ మీద వున్నది తలకాయేనా? నీతలకాయలో మెదడుందా? తెలియదట తెలియదు! నువ్విప్పుడెవరితో మాట్లాడుతున్నావో తెలుసా, పోనీ? ఇదుగో మోర్గన్! నిజం చెప్పు. ఏమిటా నల్లకుక్క చెబుతున్నాడు నీతో? ఊ—"

"చుక్కాని పాడైపోతే బాగు చెయ్యట మెల్లాగో చెబుతున్నాడండి."

"తస్పదియ్యా. చుక్కానిగురించి చెబుతున్నాడేం? పో, పో ఎదటలే, వెధవ మొహమేసుకుని."

మోర్గన్ మళ్లీ తూలుకుంటూపోయి తన బల్ల వద్ద కూర్చున్నాడు. సిల్వర్ ఇలా చెప్పసాగాడు:

"ఆ టామ్ మోర్గన్ ఉన్నాడే. మంచివాడు, నమ్మదగినవాడు. కాకపోతే కొంచెం అమాయకుడనుకో. ఎవడో జ్ఞాపకం రావటం లేదే. నల్లకుక్కన్నావు గదూ? నల్ల...నల్ల...ఆ—ఇదివరకు చూసిన గుర్తుంది. అప్పుడప్పుడు ఒక గుడ్డివాడితో వచ్చేవాడిక్కడికి."

"రైట్. వాళ్లలో గుడ్డివాడు కూడా ఒకడుండే వాడు. వాడిపేరు ప్యూ," అన్నాను నేను.

"ఆ, ప్యూ, అంతే. ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. వాణ్ణిచూస్తే చంటిపిల్లలు జడుసుకుంటారు కూడాను. ఇప్పుడా నల్లకుక్క గనక దొరికితే ట్రెలానీగారు చాలా సంతోషిస్తారు. మా బెన్ బాగా పరిగెత్తాడు. వాడితో పరిగెత్తేవాడు కళాసీలలో ఎవడూ లేడు. ఈపాటికి పట్టుకునే వుండాలి నల్లకుక్కని. తస్పదియ్యా. చుక్కాని ఎల్లా బాగుచెయ్యాలో చెబుతున్నాడేం?"

ఈ మాట్లాడుతున్నంతసేపూ సిల్వర్ ఊతకర్రతో హోటల్లో అటునుంచి ఇటూ, ఇటునుంచి అటూ గెంతుతూ నడుస్తున్నాడు. నల్లకుక్క నిక్కడ

చూడగానే మళ్ళీ నాకు అనుమానాలు రేకెత్తాయి, సిల్వర్ అంటే నేననుకున్న కుంటివాడేమోనని కాస సిల్వర్ ఇప్పుడు చేసిన గొడవంతా చూడగానే అనుమానాలు పటాపంచలయినాయి. నల్లకుక్క కోసం పరిగెత్తిన ఇద్దరు మనుషులూ రొప్పుతూ, రోజుతూ తిరిగివచ్చారు. ఆ దొంగ గుంపులో కలిసిపోయాడని, ఎంత వెదికినా కనిపించలేదని చెప్పారు. సిల్వర్ వాళ్ళ తెలివితక్కువతనానికి నానా తిట్లు తిట్టాడు అప్పటికి నాకు సిల్వర్ అంటే సదభిప్రాయం పూర్తిగా కలిగింది అంతకంటె ఘరానా మనిషి లేడనుకున్నాను. అతనిలాగన్నాడు :

“చూడు, హాకిన్స్! నాకెంత చిక్కు వచ్చి పడిందో. అవతల ట్రెలానీగారు ఇది తెలిస్తే ఏమనుకుంటారు చెప్పు. ఆ దొంగ ముండాకొడుకెవడో నాకు తెలియదాయెను. వాడు వచ్చి నా ఇంట్లో. నా యెదురుగా కూర్చుని, నా కళ్ళల్లోనే కారం కొట్టి పోయాడాయెను. నువ్వు వచ్చి వాడు ఫలానా అని చెప్పిందాకా వాడెటువంటివాడో నాకు తెలియకపాయెను. ఇందులో నా తప్పేమన్నా వుందేమో చెప్పు నువ్వు కళ్ళారా చూశావుగదా. వాడు డబ్బు కూడా యివ్వకుండా పారిపోయాడు. హాకిన్స్! నువ్వు ట్రెలానీగారితో చెప్పాలి, నా తప్పేమీ లేదని. చెబుతావుగదూ? నువ్వు కుర్రాడివైనా తెలివితేటలలో మాకెవరికీ తీసిపోవులే. అలాగని నిన్ను చూడగానే

గ్రహించాను. ఇదుగో. పూర్వం నేను రెండు కాళ్ళ మీద నడిచేటప్పుడు ఇలాంటిదో లెక్కలోకి వచ్చేది కాదు. వాణ్ణి రెండు నిమిషాలలో నేనే పరిగెత్తి పట్టుకునేవాణ్ని. తన్నదియ్యా ఒక్కగుద్దుతో గిద్దెడు రక్తం కక్కించేవాణ్ని. ఆరోజులు పోయాయ్. అప్పటి బలమేదీ ఇప్పుడునాకు. హాకిన్స్! నువ్వూ నేనూ స్నేహితులంగా ఉందామేం? ఓడలో కెక్కిం తరవాత నీకు బోలెడు విషయాలు నేర్పుతాను. సరే. బయల్దేరుదాం పద. డ్యూటీ అంటే డ్యూటీయే. ట్రెలానీ గారితో ఇప్పుడు జరిగిన దంతా చెప్పాలి. ఎందుకంటే ఒక దొంగవెధవ ఇప్పుడు మనిద్దరినీ చవటదద్దమ్మల్ని చేసి పారిపోయాడు. ఆ, ఇద్దర్నీ దద్దమ్మల్ని—"

సిల్వర్ ఏదో జ్ఞాపకం వచ్చినట్లు ఆగాడు. జేబులు తడుముకుని, "అరె. వాడు డబ్బివ్వనే లేదు గదూ. చూశావా హాకిన్స్! నాకు డబ్బుసంగతి ఇప్పుడు జ్ఞాపకంవచ్చింది—హ్హా—హ్హాహ్హా—" అంటూ నవ్వ మొదలెట్టాడు. విపరీతంగా నవ్వాడు. నవ్వాపుకోలేక పక్కనున్న బల్లమీదపడి నవ్వసాగాడు. అతనన్నదాంట్లో నవ్వొచ్చే విషయం ఏముందో తెలియకపోయినా ఆనవ్వు నాక్కూడా అంటుకుంది. కళ్ళ నీళ్లు వచ్చేవరకూ ఇద్దరం పగలబడి నవ్వాం.

చివరికి మా బసకు బయల్దేరాం. దోవలో సిల్వర్ ప్రతి ఓడనుగురించి, అది ఏ దేశందో, దాని

బరువెంతుంటుందో, దాని పేరేమిటో ఏ ఓడలో ఏం చేస్తున్నారో, సవిస్తరంగా నాకు చెప్పాడు. ఒకటి సరుకులు దించుకుంటోందనీ, ఒకటిసరుకులు ఎక్కించుకుంటోందనీ, మరొకటి లంగరెత్తి బయలుదేరుతోందనీ, అన్నీ చెప్పాడు. మధ్యలో కళాసీల కథలు ఒకటి రెండు చెప్పాడు.

మేము బస చేరుకునే సరికి ట్రేలానీగారు, లివ్‌సేగారు సోఫాలో కూర్చుని ద్రాక్షరసం సేవిస్తున్నారు. ఓడను తనిఖీ చేయడానికి బయలుదేరబోతున్నట్లున్నారు.

సిల్వర్ వాళ్ళిద్దరికీ శాల్యూట్ చేశాడు. తన హోటల్లో జరిగిన విషయం యావత్తూ పూస గుచ్చినట్లు చెప్పాడు మధ్య మధ్య "అంతేగదూ, హాకిన్స్," అని నన్ను కనుక్కున్నాడు. నేను అవునని తలఆడించి అతడు చెప్పిందాన్ని ధ్రువపరిచాను

జమీందారుగారు, డాక్టరుగారు నల్లకుక్క తప్పించుకు పోయినందుకు విచారించారు. సిల్వర్ "బోలెడు రమ్ము తాగి నాకు డబ్బు చెల్లించకుండా పోయాడండీ," అని మళ్ళీ పెద్దపెట్టున నవ్వసాగాడు. అతని నవ్వు అంటుజాడ్యం లాంటిది. అందులో హాస్యంఉన్నా లేకపోయినా జమీందారుగారు డాక్టరుగారుకూడా అంటుకుని పగలబడి నవ్వారు.

తరవాత సిల్వర్ సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

"సాయంత్రం నాలుగింటికల్లా అందరూ ఓడలో హాజరు కావాలి," అని జమీందారుగారు అతనికి కేక వేసి చెప్పారు.

"అల్లాగేనండి," అంటూ అతడు వెళ్లిపోయాడు.

"ట్రెలానీ! నువ్వు ఏ పనీ సక్రమంగా చేస్తావని నాకు నమ్మకం లేదు. కాని సిల్వర్‌నుమాత్రం మంచి వాణ్ణే సంపాయించావు.

"ఫస్టుక్లాసయిన మనిషి లే. అంతకంటే నమ్మకస్థుడు మనకిదొరకడనుకో," అన్నారు జమీందారుగారు.

"ఇక వెడదాం పద. జిమ్‌కూడా మనతో వస్తాడు,"

"ఓ. తప్పకుండా. హాకిన్స్! టోపీ తీసుకో. మన హిస్పానియోలాను చూద్దువుగాని," అన్నారు జమీందారుగారు.

టోపీ తీసుకొని వారివెంట నడిచాను. బ్రిస్టల్ బజారు వీధులగుండా పోయి మా ఓడ నిలిచిన హార్బరు చేరుకున్నాం.

## 9. కెప్టెన్ స్మాలెట్

హార్బరులో చాలా ఓడలు దాటితేగాని మా హిస్పానియోలా కనిపించలేదు. సరంబీమీద కెక్కగానే మా తండేలు మిస్టర్ యారో ముందుకు వచ్చి శాల్యూట్ చేశాడు. ఏళ్లుపైబడిన ముసలిలాగా ఉన్నాడు. చెవులకు రింగులున్నాయి; ఒక కన్ను

మెల్ల; అతనికి, మా జమీందారుగారికి మంచి దోస్తీ ఏర్పడినట్లు గ్రహించాను. కాని మా కొత్త కెప్టెన్‌కి జమీందారుగారికి మధ్య వచ్చి గడ్డి వేస్తే భగ్గుమంటుందని గ్రహించడానికి ఆట్టే సేపు పట్టలేదు.

కెప్టెన్ పేరు మిస్టర్ స్మాలెట్. మహా చిరాగ్గా ఉన్నాడు. దేన్ని చూసినా, ఎవర్ని చూసినా ముఖం చిట్లించుకోవడం, గుసగుసలాడటం. మేము ఓడ గదిలోకి వెళ్లామో లేదో ఒక కళాసీ వచ్చి కెప్టెన్ మాతో మాట్లాడ గోరుతున్నాడని కబురు అందజేశాడు.

"అయ్యయ్యో, కెప్టెన్‌గారు మాట్లాడదలచుకుంటే అభ్యంతర మేముంటుంది. చెప్పవలసినవారు ఆయన, వినవలసినవాణ్ని నేను," అన్నారు జమీందారు ట్రెలానీ. గది బయట కళాసీ వెనకనే కెప్టెన్ వున్నట్లు గ్రహించి కొంచెం ఎగతాళిగా అన్నారీ మాటలు వెంటనే కెప్టెన్ దూకుడుగా లోపలికి వచ్చాడు టప్‌మని తలుపులు వేసి మాదగ్గిరికి వచ్చాడు.

"కెప్టెన్ స్మాలెట్! ఏమిటి విశేషాలు? అంతా సరిగ్గావుందా?"

"సార్, మీరు ఏమీ అనుకోకుండా వుంటే నేను ఉన్నదున్నట్లు చెప్పేస్తాను నేను లోప లొక మాట, బయటికో మాట చెప్పే మనిషిని కాదు. నాకీ ప్రయాణం నచ్చలేదు; కళాసీలు నచ్చలేదు; తండేలు నచ్చలేదు—"

"బహుశా ఓడకూడా నచ్చలేదేమో?" అన్నారు కోపం దిగమింగుతూ క్రెలాన్సీగారు.

"ఓడపిగూర్చి ఇష్టాఇష్టమేమీ చెప్పలేను—ఎలా నడుస్తుందో ఇంకా చూడలేదుగనుక—"

"బహుశా ఓడ యజమానినైన నేనుకూడా నచ్చలేదేమో?" అన్నారు క్రెలాన్సీగారు కోపం ఆపుకునే ప్రయత్నం మానేసి.

డాక్టరుగారు అడ్డొచ్చారు.

"ఆగవోయ్ క్రెలాన్సీ! ఆగు. తొందరపడితే లాభమేమిటి? సౌమ్యంగా తేల్చుకోవాలిగాని. కెప్టెన్ గార్ని సాంతం చెప్పనీ. కెప్టెన్! మీకీ ప్రయాణం ఇష్టం లేదన్నారు. ఎందుకని?"

"నన్ను జమీందార్ క్రెలాన్సీగారు ఉద్యోగిగా తీసుకునేటప్పుడు, ఓడ ఎక్కడికి వెడుతుందో ముందు చెప్పనని, ఎందుకు వెడుతున్నామో అసలు చెప్పననీ అన్నారు. నేను ఒప్పుకున్నాను. బాగానే వుంది. కాని తీరా చూస్తే ఓడలో వున్న ప్రతి చిన్న కళాసీకీ నాకు తెలియని విషయాలన్నీ తెలిసిపోయాయి. నేను వాళ్ళముందు వెర్రి మొహం వెయ్యాల్సివస్తోంది. ఇది న్యాయమేనా అని అడుగుతున్నాను—"

"ఊహు. న్యాయంకాదు. మీకు చెప్పకుండా ఇతర్లకు తెలియనివ్వడం సబబుగాదు. నిజమే," అన్నారు డాక్టరు లివ్ సే.

"తరవాత. మనం గుప్తధనంకోసం వెడుతున్నా మని తెలిసింది—నాకు మన కళాసీలు చెబితే తెలిసింది సుమండీ. సరే. డబ్బు చాలా చెడ్డది. ఎంత సత్పురుషుణ్ణయినా దుర్మార్గానికి దించుతుంది. గుప్త ధనాలకోసం ప్రయాణాలుచెయ్యటం నాకిష్టం లేదు; అందులో రహస్యప్రయాణమనిచెప్పి, ఆ రహస్యం ప్రతి చిలకకీ చెప్పేసినప్పుడు అసలిష్టంలేదు."

"లాంగ్ జాన్ సిల్వర్ చిలక కేనా?" అన్నారు ట్రెలానీ.

"అహ దానిక్కాదు. ఊరికే మాటవరస కన్నాను. ప్రతివాడికీ తెలిసిపోయిందే అని నా బాధ. మీా కెవ్వరికీ తెలియటం లేదుగాని ఈ ప్రయాణంలో మన అందరి చావుబతుకులు తేలిపోతాయి."

"సరే అది మీా అభిప్రాయం కావచ్చు. కాని మేము మీా రనుకున్నంత అజ్ఞానులం, అమాయకులం కాము. తరవాత—కళాసీ లెవరూ నచ్చలేదన్నారు. అంటే వాళ్ళకి ఓడపని ఏమీా తెలియదనా?" అని అడిగారు డాక్టరుగారు.

"వాళ్లు నాకిష్టంలేదుసార్. అసలు నా కళాసీలను నేనే చూసుకుని వుండవలసింది."

"నిజమే. వాళ్ళచేత పని చేయించేది మీారే గనక మీారే వాళ్లని మాట్లాడివుండాల్సింది. అయితే మీాతో సంప్రదించేందుకు టైము లేక అలా అయిందే గానిమ రేం కాదు.తరవాత—తండేలు ఎందుకిష్టం లేదు?"

"మిస్టర్ యారో మంచి నావికుడే; అనుభవమున్నవాడే; గాని అతనికి అధికారి కుండవల్సిన గాంభీర్యంగాని, నిగ్రహంగాని లేదు. కళాసీలకు బాగా లోకువై పోయాడు. అతని మాట ఎవరూ వినేట్టు లేరు. పైగా కళాసీలముందు తాగుతున్నాడు."

"తాగకూడదనా, మీ ఉద్దేశ్యం ?"

"అదికాదు. తండేలు అధికారంలో ఉన్నవాడు మిగతా వాళ్ళతో అంత చనువుగా ఉండకూడదని."

"సరే కెప్టెన్! స్పష్టంగా చెప్పండి, మీ అభిప్రాయమేమిటో." అని డక్టరుగారడిగారు.

"మంచిది. నేను మీతో ముందు చెప్పలేదనుకు నేరు. అన్నీ చెప్పేశాను. ఏదన్నా జరిగితే దానికి నా బాధ్యత ఏమీవుండదు. వినండి. కళాసీలు మందుగుండు సామగ్రి, ఆయుధాలు నరంబికింద ఖాళీ జాగాలోకి చేరుస్తున్నాను. ఈ ఓడగదికింద బోలెడు జాగా వుందిగదా, ఇక్కడెందుకు పెట్టగూడదు? — ఒకటి. మీరు మీ స్వంత నౌకర్లను కొందర్ని తీసుకువస్తున్నారని విన్నాను; వారిని మిగతా కళాసీలు ఉండేచోటనే ఉండమని అన్నారట వారికి ఓడగది పక్కన స్థలం ఎందు కేర్పాటు చెయ్యగూడదు ?— రెండు."

"ఊ. అయిందా ? ఇంకా ఏమన్నావుందా ?" అన్నారు ట్రెలాన్నీగారు ఇంకా కోపంగానే.

"ఇంకొక్కమాట. ప్రతివాడు మన గమ్య స్థానం విషయమే మాట్లాడుతున్నాడు"

"అవును వాళ్ళకి తెలియనివ్వడం పొరబాటే," అన్నారు డక్టరుగారు.

"మీదగ్గర అదేదో ద్వీపపు పటం వుందనీ, అందులో డబ్బెక్కడుందో తెలిపే గుర్తులున్నాయనీ, అందరికీ తెలిసిపోయింది. ద్వీపం ఏ సముద్రంలో ఏ అక్షాంశ, మధ్యాహ్న రేఖలమీదున్నదో కూడా తెలిసింది," అంటూ కెప్టెన్ స్మాలెట్ వాటి సంఖ్యలను పేర్కొన్నాడు.

"అది నేను పిట్టకూడ చెప్పలేదు," అన్నారు ట్రెలానీగారు విస్మయంతో.

"కావచ్చు. కాని అందరికీ తెలిసిందా విషయం."

"డక్టర్! నువ్వో, హాకినోస్ చెప్పివుండాలి," అన్నారు ట్రెలానీగారు.

"ఎవరైతేనేం, ఎల్లాగూ వాళ్ళకి తెలిసింతర వాత?" అన్నారు డక్టరుగారు. ఆయనగాని, కెప్టెన్ గాని, నేనుగాని జమీందారుగారి మాటలు లెక్క చెయ్యలేదు ఎందుకంటే ఆయన నోట్లో నువ్వు గింజ నానదని మాకు తెలుసు కాని ఈ విషయంలో ఆయనన్నది నిజమే; ఆయనగాని మేముగాని ద్వీపం ఉనికిని ఎవ్వరికీ చెప్పలేదు. అందరికీ ఎల్లా తెలిసిందో మాకూ విచిత్రంగానే వుంది.

"మరొకమాట," అని కెప్టెన్ మళ్లీ ప్రారంభించాడు "ఆ పటం మీలో ఎవరి దగ్గరుందో నాకు తెలియదు. ఎవరి దగ్గరున్నా, ఆ విషయం నాకు కూడా తెలియకుండా దాచండి. అది మీకిష్టం లేకపోతే నేనీ క్షణంలో రాజీనామా చెయ్యడానికి సిద్ధంగా వున్నాను."

"అర్థమైంది ఇప్పటికి," అన్నారు డాక్టరుగారు. "ద్వీపపటాన్ని రహస్యంగా ఉంచమనీ, ఓడ వెనక భాగాన్ని శత్రువులకభేద్యంగా చెయ్యమనీ, నమ్మకమైన వాళ్ళని ఆయుధాలతో సహా వెనక భాగంలో ఉంచమనీ మీరు చెబుతున్నారు. అంటే తిరుగుబాటు జరగచ్చని మీ అనుమానం. అంతేనా?"

"సార్! నే ననని మాటలు నాకు అంటగట్టకండి. తిరుగుబాటు జరుగుతోందనితో నే ఏ కెప్టెనూ ఓడ నడిపేందుకు ఒప్పుకోడు. తంజేలు మిస్టర్ యారో మీద నా కెటువంటి అనుమానమూ లేదు; అతణ్ని మనం నమ్మవచ్చు. మిగతా కళాసీలలో కొందరు మంచివాళ్లున్నారు ఏమో, అందరూ మంచివాళ్ళే నేమో, చెప్పలేను. నేనింతగా మీతో చెబుతున్నదెందుకంటే ఈ ఓడ బయలుదేరింది లగాయతు, తిరిగి ఈ హార్బరు చేరుకునేవరకూ మీ అందరి బాధ్యత నాదే. ఏ ప్రమాదం జరిగినా బాధ్యత నామీదే పడుతుంది. కొన్ని జాగ్రత్తలు తీసుకోవలసిందని కోరుతున్నాను. లేకపోతే నేను రాజీనామా చెయ్యటానికి సిద్ధంగా ఉన్నాను,"

"కెప్టెన్ స్మాలెట్ ! ఇంతేనా మీరు చెప్పేది, ఇంకా ఏమన్నా వుందా? మీరు లోపలికివచ్చినప్పటి వాలకం చూస్తే ఏదో గొప్ప విషయం బయటపెట్టా లని వచ్చినట్లనిపించింది," అన్నారు డాక్టరుగారు.

"అవును, డాక్టర్ ! నేను రాజీనామా ఇచ్చేసే వుద్దేశ్యంతో వచ్చాను. జమీందారుగారు నా మాట పట్టించుకుంటారని అనుకోలేదు."

"ఇక్కడ డక్టర్ లివ్ సీ లేకపోతే అదే జరి గేది. సరే మీరు చెప్పింది ఎలాగూ విన్నాను. ఆ ప్రకారమే చేస్తాను. కాని ఇంతవరకూ మీమీద మంచి అభిప్రాయం ఏమన్నావుంటే ఆ కాస్తా ఇప్పుడు పోయిందని గ్రహించండి," అన్నారు జమీం దారుగారు కర్కశంగా.

కెప్టెన్ వెళ్లిపోయాడు.

"ట్రెలానీ!" అన్నారు డాక్టరుగారు. "నీ మెదడు మీద నా కేలాంటి నమ్మకం లేదు, కాని మెరికల్లాంటి వాళ్ళ నిద్దర్ని సంపాదించావు. ఒకడు ఈ కెప్టెన్, రెండోవాడు లాంగ్ జాన్ సిల్వర్."

"సిల్వర్ కేమోయ్, ఫస్టుక్లాసయిన నావికుడు. ఈ కెప్టెన్ అంటే మొదట్నించీ నాకు మంటగానే వుంది, పని తెలిసినవాడని తీసుకున్నాగాని. నా కర్థం కాక అడుగుతాను, ఏమిటా పొగరు మోత్తనం? ఏమిటా తలబిరుసు? ఓడ యజమానితో అల్లాగేనా మాట్లాడ్డం?"

"సరే, చూద్దాంగా."

మేము మళ్ళీ సరంబీమీదికి వచ్చాం. అప్పటి కప్పుడే కళాసీలు మందుగుండు సామగ్రిని ఓడగది వద్దగు చేరేస్తున్నారు. కెప్టెను, తండేలు దగ్గరుండి అజ్మాయిషీ చేస్తున్నారు.

ఈ కొత్త ఏర్పాటు నాకు నచ్చింది. ఓడ వెనక భాగంలో ఆరు అరలు ఏర్పాటు చేశారు. అవి కెప్టెన్, మిస్టర్ యారో, హంటర్, జాయిస్, డాక్టరుగారు, జమీందారుగారు ఉపయోగించుకునేందుకు ఉద్దేశించ బడినై. కాని తరవాత అది మార్చారు. కెప్టెను, మిస్టర్ యారో ఓడ ముందుభాగంలో ఉండేందుకు ఒక చిన్నగదిలాగా ఏర్పాటు చేశారు; అందులో రెండు అరలు కట్టారు. వెనకభాగంలో ఖాళీ అయిన రెండు అరల్లో ఒకటి నాకూ, ఒకటి రెడ్రూత్ కూ ఇచ్చారు.

కళాసీలు పనిలో నిమగ్నమై వున్నారు. నేను కూడా వాళ్ళకి సాయపడుతున్నాను. ఇంతలో మరి ద్దరు ముగ్గురు కళాసీలతో కలిసి లాంగ్ జాన్ వచ్చాడు. అతను రావడం మేమెవ్వరం చూడలేదు. కుంటు కుంటూ వచ్చి మా పక్కన నుంచున్నాడు. జరుగు తున్న దేమిటో గ్రహించగానే ఇలా అన్నాడు:

"ఏయ్, ఏమిటీ ఇదంతా? ఎక్కడికి తీసుకెడు తున్నారు ఆ తుపాకులు, కత్తులూ?"

"కిందికి తీసుకెళుతున్నాం. ఓడ గదికింద జాగా వుందిగా?" అన్నాడొకడు.

"అరె. ఎవడు చెప్పాడురా మీకు? ఇప్పుడీ పని పెట్టు కున్నార్పుంటే ఎల్లా?"

"సిల్వర్! నేనే ఆజ్ఞాపించాను. నువ్వు కిందకు వెళ్లు. వంట సిద్ధంచెయ్యి. భోజనాలవేళ అవుతోంది." అన్నాడు కెప్టెన్.

"వెడుతున్నానండి సార్!" అన్నాడు సిల్వర్. కాని వెళ్ళడానికి కిష్టంలేనట్లు అక్కడే ఒక నిమిషం నిలబడ్డాడు.

"సిల్వర్ చాలా మంచివాడండి. ఏమంటారు కెప్టెన్?" అన్నారు డాక్టరుగారు మెల్లిగా.

"కావచ్చు!" అన్నాడు కెప్టెన్ స్మాలెట్. "ఏయ్, నెమ్మదిగా, భద్రం, భద్రం," అని కళాసీలను హెచ్చరించాడు. ఇంతలో ఆయన నన్ను చూశాడు. నేను పరధ్యానంగా తెరచాప తాళ్లు పట్టుకుని లాగుతున్నాను.

"ఏయ్, కుర్రాడా? అది వదిలెయ్. చేతులూరుకోవా? పో కిందికి పో. సిల్వర్‌కు ఏమన్నా కావాలంటే అందిస్తూవుండు," అనిఅధికార స్వరంతో ఆజ్ఞాపించాడు.

నేను శాల్యూట్ చేసి వెళ్ళిపోతుండగా, కెప్టెను డాక్టరుగారితో చెప్పాడు:

"నా ఓడమీద ఒకళ్లు ఎక్కువ, ఒకళ్లు తక్కువ అని ఉండటానికి ఒప్పుకోను. నా కందరూ సమానమే."

కెప్టెన్ మీద ఎంత రోతపుట్టిందో చెప్పలేను. జమీందారుగారి అభిప్రాయంతో నేను పూర్తిగా ఏకీభవించాను: ఈ కెప్టెన్ నిజంగా పొగరుమోతువాడే.

## 10 సముద్రయానం

ఆరాత్రి మేము ప్రయాణానికి ఆఖరు ప్రయత్నాలన్నీ చేసుకున్నాము. జమీందారుగారి స్నేహితులు, బ్లాండ్లీ మొదలైనవారు మాకు వీడ్కోలు యివ్వడానికి చిన్నచిన్న బోట్లలో మా ఓడదాకా వచ్చారు.

తెల్లవారు జామున నాలుగ్గంటలవేళ తండేలు బాకా ఊదాడు. వెంటనే కళాసీలు ఎవరి స్థానాల్లోకి వాళ్ళు వెళ్ళి పనిచేయసాగారు. రాత్రి అంతా సామానులు సర్దడంలో విపరీతంగా అలిసివున్నాను. అయినా సరంబీ మీదనుండి కదల బుద్ధికాలేదు. అంతా కొత్తగా, వింతగా వుంది; తండేలు బాకా ఊదటం లంగరు పైకి లాగటం, కెప్టెన్ ముక్తసరిగా ఆజ్ఞలివ్వటం, కళాసీలు లాంతర్లు పట్టుకుని ఎవరి స్థానాలకు వాళ్ళు పరిగెత్తటం అంతా తమాషాగానే వుంది.

"సిల్వర్! పదం పాడాలి నువ్వు," అన్నాడొకడు.

"మన పాతపాట," అన్నాడింకొకడు.

సరంబీ పిట్టగోడలను ఆనుకుని నుంచున్న సిల్వర్—

"రాసులకొద్దీ రత్నాలోయ్—"

అని గొంతెత్తాడు. కళాసీలు

"యో—హో—హో—బలె కుశ్మైన రమ్"

అని పల్లవి అందుకున్నారు వెంటనే లంగరు గొలుసులు పైకి లాగటం ప్రారంభమైంది. లంగరు పైకి రాగానే. తెరచాపలు ఒకదాని తరవాత ఒకటి పైకి లేవసాగాయి. నెమ్మదిగా ఓడ కదిలింది. ఒడ్డు క్రమంగా దూరం కాసాగింది. నేను ఒక గంటగాపును కునుకు తీసి లేచేసరికి ఓడ సముద్ర మధ్యంలోవుంది. కాంచన ద్వీప ప్రయాణం ప్రారంభమైంది.

సముద్రయానాన్ని పూర్తిగా వర్ణించ దలుచుకోలేదు నేను. అంతా సక్రమంగానే జరిగిపోయింది; పవనాలు అనుకూలంగానే వున్నాయి; ఓడ ఏ ఒడుదుడుకులూ లేకుండా నడిచింది; కళాసీలు సమర్థులని పించుకున్నారు; కెప్టెన్ సమయానుకూలమైన తెలివి తేటలు చూపించాడు. కాని కాంచనద్వీపం చేరే లోగా రెండుమూడు వింత సంఘటనలు జరిగాయి; అవి వివరించవలసిన అవసరం వుంది.

కెప్టెన్ ఊహించిన దానికంటే దరిద్రంగా తయారయ్యాడు మా తండేలు మిస్టర్ యారో.

అతన్ని ఎవ్వడూ లెక్క చేసేవాడు కాదు. అంత చులకనై పోయాడు అతడు. అదల్లా ఉంచి రెండు మూడు రోజుల తర్వాత నిత్యమూ చింత నిప్పు ల్లాంటి కళ్ళు, లోతుకుపోయిన దవడలు, తూలుడు, బూతులు, హఠాత్తుగా తెలివి తప్పిపోవడం మొదలైన లక్షణాలతో కనిపించ సాగాడు మిస్టర్ యారో. ఒకొక్కసారి ఓడమీద పడి అటూ ఇటూ దొర్లేవాడు; ఒకొక్కసారి రోజంతా మాట్లాడకుండా మత్తుగా పడు కునేవాడు; మళ్లీ రెండుమూడు రోజులపాటు తెలివిగా ఉండి చక్కగా పనిచేసేవాడు.

మాకు విచిత్రం కలిగించిన విషయ మేమంటే అతనికి రమ్ ఎక్కణ్ణించి వస్తోందా, అని. ఎంత వెది కినా ఎక్కడా రమ్ సీసాలు కనిపించ లేదు. "నీకెక్క డిది రమ్?" అని అతన్ని అడిగితే పకలబడి నవ్వి అవ తలికి పోయేవాడు; లేకపోతే "నేను చచ్చినంత ఒట్టు. కటికినీళ్ళుతప్ప ఇంకేం తాగలేదు," అని అడ్డమైన ప్రమాణాలు చేసేవాడు.

చివరకు మేమనుకున్నంత పనీ జరిగింది. ఒక రోజు రాత్రి అంతర్థానమై పోయి, మళ్ళీ కంటపడ లేదు. తెగతాగి, ఒళ్ళు తెలియక నీళ్లల్లో దూకి వుంటా డని కెప్టెన్ అన్నాడు. కాని మా ఓడకు తండేలు లేకుండా ఎల్లా? కనుక జాబ్ ఆండర్సన్ అనే అను భవజ్ఞుడైన కళాసీని తండేలుగా నియమించారు. అతనికి

సహాయం చేసేందుకు మా సరంగు (చుక్కాని నడిపే వాడు) ఇజ్రాయెల్ హాండ్స్‌ను నియమించారు.

అందరికంటే విచిత్రమైన వ్యక్తి మా వంట వాడు లాంగ్ జాన్ సిల్వర్. ఊతకర్రతో ఎప్పుడో గాని అతనికి పనివచ్చేదిగాదు. సాధారణంగా దాన్ని మెడలో వేళ్ళాడేసుకుని, తాళ్ళు పట్టుకుని, గోడలు పట్టుకుని నడిచేవాడు. ఎంత పెనుగాలిలోనైనా సరే సరంబీ మీద అటూ ఇటూ పచార్లు చేసేవాడు.

అతన్ని గూర్చి మా సరంగు చెప్పాడు: "సిల్వర్ సామాన్యమైన మనిషి కాదు. ఇప్పుడంటే ఇల్లా కుంటుతూ అదో మాదిరిగా ఉన్నాడు కాని ఇదివరకు రోజుల్లో అయితేనా? సింహాలతో అయినా పోట్లాడేంత పొగరుగా ఉండేవాడన్న మాట మాలోకల్లా కాస్త డొక్కశుద్ధి ఉన్నవాడు వాడే. ఇప్పటికైనా తల్చుకుంటే పుస్తకంలో మాదిరిగా మాట్లాడగలడు. ఇంతెందుకూ? ఒకసారి నేను చూశాను—నలుగురు దున్నపోతుల్లాంటి మనుషుల్ని టపటప పడగొట్టేశాడు, చేతులో కర్రకూడా లేకుండా."

కళాసీలందరూ సిల్వర్ అంటే గడగడలాడే వారు. కెప్టెన్ స్మాలెట్ కూడా అంత గౌరవ మిచ్చేవారు కాదు. అతడు కూడా ఎవరిదగ్గర ఎలా ఉండాలో అలా ఉండేవాడు. అందరితోనూ మంచిగా

ఉండేవాడు. ముఖ్యంగా నేనంటే ఎంతో ప్రేమ చూపేవాడు. వంటగదిలోకి పిలిచి ఏమన్నా తింటానికి పెట్టేవాడు.

"రావోయ్, హాకిన్స్! రా. కాసేపు కబుర్లు చెప్పుకుందాం. ఇదుగో మా కెప్టెన్ ఫ్లింట్‌ను చూశావా? సముద్రపు దొంగల నాయకుడు లేడూ? ఫ్లింట్—అతని పేరే పెట్టాను, దీనికి," అంటూ తన చిలకని బుజాలమీదికి ఎక్కించుకునేవాడు. "కెప్టెన్ ఫ్లింట్! ఏమిటి విశేషాలు? తస్సదియ్యా చూశావా హాకిన్స్, మన ప్రయాణం విజయవంతం అగుగాక, అని దీవిస్తోంది చిలక?"

చిలక "పెసో. పెసో, పెసో, పెసో," అని అతి వేగంగా అనేది. (పెసో అనేది స్పాయిన్ దేశపు నాణెం) చివరికి "ఆగు," అని సిల్వర్ గదమాయించే దాకా ఆగేది కాదు.

"ఈ చిలక వయస్సు ఏ రెండు వందల ఏళ్ళో వుంటుంది. చిలకలు చాలా ఏళ్లు బతుకుతాయిలే. ఈ చిలక కెప్టెన్ ఇంగ్లండుతో కొంతకాలం వుండేదిట. మడగాస్కర్, మలబారు, సూరినాం, ప్రావిడెన్స్, పోర్టోబెలో—అబ్బ, ఎన్ని చోట్లు చూసిందో, ఎన్ని హాత్యలు చూసిందో, ఎన్ని ఓడలు ధ్వంసమవుతుండగా చూసిందో చెప్పలేను. తస్సదియ్యా, గోవా వైస్రాయిగారు దీన్ని కొందామనికూడా అనుకున్నా

రట. చూడు దాని ముఖం చూస్తే ఎంత చిన్న దానిలా వుంటుందో. కెప్టెన్! నీ కెన్నేళ్లు?"

"తెరచాప లెత్తండి!" అని అరిచేది చిలక.

"బలే చిలకలే, తస్సదియ్యా," అని జేబుల్లోంచి గుప్పిళ్ళతో పంచదార తీసి చిలకకి పెట్టేవాడు. చిలక ఆశ్చర్యకరంగా ఇష్టమొచ్చిన బూతులు తిడుతూ పంచదార తినేది.

కెప్టెన్ స్మాలెట్‌కు, జమీందారుగారికి మధ్య సంబంధాలేమీ అభివృద్ధి కాలేదు. కెప్టెన్‌మీద ట్రెలానీగారికి కంఠందాకా వుంది

తన కోపం దాచాలని కూడా ప్రయత్నించే వారు కాదాయన. మింగేద్దామన్నట్టు చూసేవారతని వంక. కెప్టెన్ తన పని తను చేసుకుపోయేవాడు. పల కరిస్తేనేగాని పలికేవాడు కాదు. అదైనా ముక్తసరిగా మాట్లాడేవాడు. గుచ్చిగుచ్చి అడిగ్గా అతడు ఒప్పుకు న్నాడు. కళాసీలను గూర్చి మొదట్లో తను అపోహ పడ్డానని, హిస్పానియోలా వంటి మంచి ఓడను తా నెప్పుడూ చూడలేదని, అయినా ఈ ప్రయాణం సక్ర మంగా ముగిసేవరకూ తన కనుమానమే ననేవాడు.

ఈ మాట వినగానే జమీందారుగారు కళ్ళ నిప్పులు గక్కుతూ అవతలికి వెళ్ళిపోయేవారు. "ఎప్పుడో మే మిద్దరం దెబ్బలాడుకునేదాకా వస్తుంది ఆ," అనేవారు.

ఓడ మధ్యభాగంలో అందరికీ అందుబాటుగా ఉండేటట్లు ఆపిల్ పళ్ళ పీపా ఒకటుంది. ఎవడి క్కావల సినన్ని వాడు తెచ్చుకుని తినేవాడు

"ఎందుకండీ ఆ పీపా అక్కడ, వట్టి దండగ కాకపోతే?" అని ముఖం చిట్లించుకుని అనేవాడు. కెప్టెన్.

కాని ఆపిల్ పీపా చివరికి మా ప్రాణాలు రక్షించింది. అదేగనక అక్కడ లేకపోతే మేము ఏమైపోయి వుండేవాళ్ళమో. అసలు జరిగిన దిది:—

మేము కాంచన ద్వీపాన్ని సమీపిస్తున్నాం. రాత్రింబగళ్లు తదేకదీక్షగా టెలిస్కోపులు పెట్టుకుని చూసేవాళ్ళం భూమి కనిపిస్తుందేమోనని. ఆ రోజు రాత్రికో, ఆ మర్నాడు మధ్యాహ్నానికో ద్వీపం చేరు కోగలమని కెప్టెన్ అంచనావేశాడు. ఓడలోని దిక్సూచినిబట్టి మేము నైరృతిమూలకి దక్షిణంగా పోతు న్నాము. హిస్పానియోలా ఒడుదుడుకులు లేకుండా ఊగుతూ, తూగుతూ పోతున్నది అందరం మహో త్సాహంలో ఉన్నాము ఎందుకంటే మా ప్రయాణం అంతం కావస్తున్నది

సూర్యుడస్తమించాడు. కెరటాలమీద ఎర్రటి కాంతులు పొడుగ్గా పడ్డాయి. నేను చేయవలసిన పను లన్ని ముగించుకున్నాను. విశ్రమించే స్థలానికి వెళుతూ మధ్యలో ఆపిల్ పీపాను చూసి ఆగాను. ఒక ఆపిల్ తిందామని బుద్ధిపుట్టింది. చుట్టుపక్కల ఎవ్వరూ

లేదు. ఒకళ్ళిద్దరు కళాసీలు పాడుతున్న పల్లెపదాలు గాలి అలలమీద తేలివస్తూ నిశ్శబ్దాన్ని భంగం చేస్తున్నాయి. పీపాలోకి దూకాను. ఎంత తడిమినా ఒక్క ఆపిల్‌పండు కూడా దొరకలేదు. అన్నీ అయిపోయాయి. పీపాలో ఒక్క నిమిషం కూర్చున్నానో లేదో ఓడ ఊపుకూ, దూరంనించి అస్పష్టంగా వినిపించే పాటలయకూ ఏదో మత్తు ఆవహించినట్లై, అలాగే ఒరిగి నిద్రపోయాను.

ఎంతసేపల్లా నిద్రపోయానో తెలియదు. ఎవరో బరువైన మనిషి వచ్చి పీపాపక్కనున్న కుర్చీపీటమీద కూర్చుని పీపా నానుకోవడంతో నాకు మెలకువ వచ్చింది. ఆ మనిషి బరువుకు పీపా కదిలిపోయింది. నేను వెంటనే లేచి బయటికి రాబోయాను. ఇంతలో ఆ మనిషి మాట్లాడసాగాడు. అతడు లాంగ్ జాన్ సిల్వరే. అరడజను మాటలు వినేసరికల్లా ఎల్లా వున్న వాణ్ణి అల్లాగే పాతుకుపోయాను గజగజ వణుకుతూ, ముచ్చెమటలు పోస్తుండగా, సిల్వర్ చేప్పే మాటలు వింటూ, కిక్కురుమనకుండా కూర్చున్నాను ఆ అరడజను మాటలు వినగానే నాకు తెలిసిపోయింది—ఓడమీదగల నా స్నేహితులందరి క్షేమమూ నా ఒకడిమీదే ఆధారపడి వున్నదని.

# 11. సిల్వర్ కుట్ర

"ఊహూ. నేను కాదు," అంటూ సిల్వర్ ప్రారంభించాడు. "నేను సరంగుగా ఉండే వాణ్ణి. ఫ్లింటే మా అందరికీ కెప్టెన్‌గా ఉండేవాడు. మా ఓడ పేరు వాల్రస్, ఎల్లా ఉండేదనుకున్నావ్? తన్నదియ్యా. ఈ హిస్పానియోలా దానిముందు ఎందుకు పనికొస్తుంది?"

"కాని ఫ్లింట్ చాలా గొప్పవా డనుకుంటాను. ఆయన పేరు చెబితే రాజులే గడ గడలాడేవారుట," అన్నాడు రెండో వాడు. వాడి పేరు డిక్. కళాసీలందరిలోకీ చిన్నవాడు.

"నా చిన్నతనంలో డేవిస్ అని ఒకగొప్ప సముద్రపు దొంగ ఉండేవాడు. తన్నదియ్యా వచ్చి నెత్తురు తాగేవాట్ట. ఆయనతో పని చేసే అదృష్టం నాకు కలగలేదు. మొదట కెప్టెన్ ఇంగ్లండు కింద, తరవాత కెప్టెన్ ఫ్లింట్ కింద అదీ నా చరిత్ర. మొత్తం మూడు వేలదాకా సంపాయించాను అదంతా ఎక్కడుంది? ఎక్కడేమిటి? బ్యాంకీల్లో భద్రంగా దాచాను. కెప్టెన్ ఇంగ్లండు మనుషులిప్పు డేమయ్యారు? ఏమో, నాకు తెలియదు. కెప్టెన్ ఫ్లింట్ మనుషు లేమయ్యారు? దాదాపు అంతా ఇక్కడే వున్నారు. ప్యూ చచ్చిపోయాడు. వాడు నా కంటే ఎక్కువ సంపాయించాడు. కాని తన్నదియ్యా పార్లమెంటులో లార్డులాగా, ఏడాదికి

పన్నెండువందల చొప్పున తగలేసేవాడు. చివరి రోజుల్లో వాడి గతి ఏమయింది? అడుక్కుతిన్నాడు. దొంగతనం చేసేవాడు. పీకలుకోసేవాడు. అయినా మల మల మాడేవాడు."

"పాపం," అని జాలిపడ్డాడు డిక్.

"పాపమేమిటి, వెధవకి. అదేనాకు వళ్ళుమంట. ఎవడు తగలెయ్యమన్నాడు డబ్బు? నాలాగా జాగ్రత్తగా ఎందుకు దాచుకో కూడదు? నేనేం కడుపు మాడ్చుకోలేదే. శుభ్రంగా తిన్నాను, తాగాను, అనుభవించాను. కాని మితిమీరి ఎప్పుడు ఖర్చుచెయ్య లేదు నేను. ఇక్కడ కొంత, అక్కడకొంత అల్లా దాచాను. అంతా ఒకచోట దాస్తే ఎవరన్నా అనుమానపడవచ్చు. నా కిప్పుడు యాభయ్యేళ్ళు. ఈ ప్రయాణం నుంచి తిరిగివచ్చాక, ఇక నేను ఘరానాగా పెద్దమనిషిలాగా బతక దలుచుకున్నాను. కాలు మీద కాలేసుకుని, జరిగిపోయినదాన్ని తలుచుకోకుండా నిశ్చింతగా బతక దలుచుకున్నాను. నేనెలా ప్రారంభించాను? నీలాగే. నేనూ ఒకప్పుడు చిన్నకళాసినే,"

"నీ డబ్బంతా ఇంకా బ్యాంకుల్లోనే వుందా?"

"నేను పిచ్చివాణ్ణనా నీ ఉద్దేశం? చావు బతుకుల ప్రయాణం మీద బయలుదేరుతూ, బ్యాంకులో వుంచుతానా డబ్బు? అంతాతీసి, మా శ్రీమతి కిచ్చాను. నా హోటలు కూనా అమ్మేశాను. శ్రీమతిని ఫలానా

చోట నా కోసం ఎదురు చూస్తూ ఉండమని చెప్పి పంపాను."

"సరే అసలు విషయం మాట్లాడదాం. ఓడ మీద మనం నమ్మదగిన వాళ్లెంతమందున్నారు?" అని అడిగాడు డిక్.

"సామాన్యంగా దొంగల్లో దొంగలకి నమ్మకం ఉండదు. కాని సిల్వర్‌తో వ్యవహారం పాముతో చెలగాటం లాంటిది. నన్ను మోసం చేస్తున్నాడని తెలిస్తే అవతలివాణ్ణి ఇంకో లోకానికి సాగనంపినదాకా నేను నిద్రపోను. కొందరు ఇదివరకు ఫ్యూ అంటే గడ గడ లాడే వారు, కొందరు ఫ్లింట్ అంటే భయపడేవారు. కాని ఫ్లింట్, ఫ్యూ ఇద్దరికీ సిల్వర్‌ని చూస్తే సింహ స్వప్నంగా ఉండేది, తస్సదియ్యా. కాని డిక్! నీకు తెలుసుగా, నాతో మంచిగా ఉంటే నే నెంత మంచిగా ఉంటానో. నేను ఊరికే డాబులు కొట్టేవాణ్ణి కాను. వ్యవహారం దగ్గర మొహమాటం లేదు నాకు. నువ్వు నన్ను పూర్తిగా నమ్మిమే. నేను నిన్ను పూర్తిగా నమ్ము తాను. అదీ నా పద్ధతి."

"సిల్వర్! నువ్వు నిప్పుల్లో దూకమన్నా దూకుతాను. నువ్వు ఏం చెయ్యమంటే అది చేస్తాను," అన్నాడు డిక్.

"నాకు తెలుసు. నీ ముఖం చూడగానే నీ నిజాయితీ తనం కనిపెట్టాను. నేను చెప్పినట్టు విను, నిన్ను పైకి తీసుకువస్తాను" అన్నాడు సిల్వర్.

నాకు ఆ క్షణంలో సిల్వర్‌ను పొడిచెయ్యా లన్నంత కోపం వచ్చింది. నాదగ్గిర నన్ను పొగడినట్లే, ఆ వెధవని కూడా పొగడుతున్నాడు. అతడు ఎంత నీచుడో అప్పుడు తెలిసిందినాకు.

ఇంతలో మరి ఏడెనమండుగురు కళాసీలువచ్చారక్కడికి. నేను కూర్చున్న ఆపిల్ పీపా చీకట్లో ఉండడం మూలాన బతికి పోయాను. వాళ్ల కంట బడితే బహుశా నన్ను అక్కడే గొంతు పిసికివుండురు. మృత్యువుకు బెత్తెడు ఎడంలో వున్నా నామనస్సంతా వాళ్ళమాటల మీదనే వున్నది.

"డిక్ కూడా ఒప్పుకున్నాడు," అన్నాడు సిల్వర్.

"డిక్ ఒప్పుకుంటాడని నా కిదివరకే తెలుసు. ఇప్పుడదికాదు, సిల్వర్! ఎంత కాలం నన్నిట్లా చేతులు కట్టి వుంచుతావ్? కెప్టెన్ స్మాలెట్ ఇచ్చే ఆజ్ఞలు చూస్తుంటే నాకు వొంటిమీద తేళ్ళు, జెర్రులు పాకుతున్నట్లుంది. అసలిప్పటికే నన్ను చాలసార్లు అవమానించాడు. వాణ్ణి ఎప్పుడు కసితీరా తందామా అని తొందరగా వుంది. ఈ పళంగా వెళ్లి వాళ్ళు తినే ఊరగాయలు, మంచి మంచి కూరలు, ద్రాక్ష సారాలు అన్నీ జుర్రుకోవాలనుంది. నువ్వు 'ఊ' అను, నేను దూకుతాను," అన్నాడు సరంగు ఇజ్రాయెల్ హాండ్స్.

"ఇజ్రాయెల్! నీకు ఇంత తలకాయ ఉందన్నమాటేగాని, అందులో ఉన్నదంతా మట్టే. నేచెప్పేది

విను నువ్వు మాట్లాడకుండా నీ పని చెయ్యి. నీకేదిస్తే అది తిను. అందరితోను మర్యాదగా, నమ్మకంగా మాట్లాడు. నేను చెప్పినప్పుడు నీ పిస్టల్ ఉపయోగించు దువుగాని." అన్నాడు సిల్వర్.

"అది సరే లేరా. నే నిప్పుడు నువ్వు చెప్పినట్లు చెయ్యనంటున్నానా? నేననేదల్లా, ఎప్పుడూ అని."

"ఎప్పుడేమిటి ఎప్పుడు? నాకు 'ఆ, ఇదే సమయం,' అనిపించినప్పుడు. మతి పోయినట్టు మాట్లాడతావేమిటి? కెప్టెన్ స్మాలెట్ మంచి అనుభవమున్న నావికుడు. ఓడని మనకోసం శుభ్రంగా నడిపిపెడుతున్నాడు. ఇక ఆ జమీందారు, డాక్టరు ఉన్నారు; ఆపటం వాళ్ళదగ్గరే వుందో, మరెక్కడుందో. నే చెప్పేదేమిటంటే, ఆపటం వాళ్ళదగ్గరే వుంనసీ వాళ్ళనే ఆడబ్బెక్కడుందో వెదడన్ని. వాళ్ళనే తవ్వి తియ్యనీ. అది ఓడలో భద్రంగా చేర్చటానికి కావలిస్తే మనం కూడా ఓచెయ్యి అందిద్దాం. తన్నదియ్య, అప్పుడు చూసో మన తడాఖా. మీ కొంచెం ఓర్పు అనేది వుంటే తిరుగుప్రయాణం సగం అయిందాకా ఊరుకుంటాను. ఆ తరవాత దేవుడు కాదు, దేవుడుబాబు వచ్చినాసరే ఊరుకోను."

"మనకి ఓడ నడపటం చేతకాదనా నీభయం?" అని అడిగాడు నరంగు ఇజ్రాయెల్.

"ఇదిగో, ఇజ్రాయెల్! నువ్వు నరంగువి. దారి చూపిస్తే చుక్కాని పట్టటంలో నిన్ను మించినవాడు

లేదు కాని దారిచూపించే దేవరూ అని నే నడిగేది. అంచేత నేను చెప్పినట్టు విను. సమయం వచ్చినప్పుడు నేను పిస్టల్ పేలుస్తాను. ధన్‌ధన్‌మని ఒకళ్ళ తరవాత ఒకళ్ళని పేల్చేయటం, సముద్రంలోకి తోసెయ్యటం."

"పాపం చంపట మెందుకురా, సిల్వర్ ?" అన్నాడొకడు.

"ఏం చెయ్యమంటావ్? తన్నదియ్యా, బయల్దేరాపోయ్ ఏస్ట్రక్కీస్టు. అక్కడ ఆ లంకలోనే వది లేద్దామంటావా? ఫ్లింట్ గాని, బిల్లీబోన్స్‌గానిఅయితే అల్లాగే చేసేవారు. కాని నేను పెద్దమనిషిని. నాకూ దయా, ధర్మం, స్త్రీజాతి వున్నాయి. అంచేతనన్నడిగితేవాళ్ళని చంపెయ్యమంటాను. వాళ్ళు లంకలోనుంచి ఎల్లాగో బయటపడితే మన పనేమవుతుంది? నేను గుర్రాల కోచ్‌లో దర్జాగా కూర్చుని పార్లమెంటుకు పోతూ వుండగా ఈ జమీందారు, ఈ డక్టరు, మళ్ళీ నాకంట పడటం, నన్ను కోర్టుకు లాక్కెళ్ళటం, నా మెడకి ఉరితాడు చుట్టుకోవటం—ఈగోలంతా నేను పడలేను. అంచేత ధన్‌ధన్ పేల్చడమే పద్ధతి."

"సిల్వర్! నువ్వురా మొగాడివంటే," అని ఒకడు ఎంతో మెచ్చుకుంటున్నట్టు అన్నాడు.

"చూద్దువుగానిగా, సమయం వచ్చినప్పుడు తన్నదియ్య. నే నొక్కటే కోరుతున్నాను. ట్రేలానీ గాణ్ణి నాకిచ్చెయ్యండి. వాణ్ణి చంపాలని ఎన్నాళ్ళనించో ముచ్చట పడుతున్నాను. ఇజ్రాయెల్! కెప్టెన్

స్కామ్లెట్‌ని కావలిస్తే నువ్వే తీసుకో. ఏం? అరే అబ్బీ, డిక్! అదుగో ఆ పీపాలో ఆపిల్ పండేమన్నా వుంటే ఒకటి పట్టూ. నాలిక గురదగా వుంది."

ఈమాట వినేసరికి నాకు ఊహాతీతమైన భయం పుట్టింది. మనుషుల్లో ఇంత క్రూరులుంటారని నేను ఎప్పుడూ ఊహించలేదు. సిల్వర్ "ఆపిల్ పండు తీసుకు ర"మ్మనగానే నా పని అయిపోయిం దనుకున్నాను. డిక్ కూర్చున్న చోటనుండి లేవడం వినిపించింది. కాని నా అదృష్టం బాగుండటంవల్ల ఇజ్రాయెల్ వాణ్ణి ఆపాడు.

"సిల్వర్! ఇప్పుడా చెత్తంతా ఎందుకులెద్దూ? కాస్త రమ్ తెప్పించు, తాగుదాం," అన్నాడు ఇజ్రాయెల్.

"డిక్! ఇదిగో తాళం చెవులు. పోయి రమ్‌తీసుకురా," అన్నాడు సిల్వర్.

అప్పుడు నాకర్థమైంది, చచ్చిపోయిన తండ్రేలుకు రమ్ ఎక్కణ్ణించి వచ్చేదో. బహుశా సిల్వరే మిస్టర్ యారోను వదిలించుకోవాలనే ఉద్దేశంతో అతనికి రమ్ అందించివుంటాడు.

డిక్ అవతలికి వెళ్ళగానే ఇజ్రాయెల్ సిల్వర్ నేదో మెల్లిగా అడిగాడు. సిల్వర్ ఏదో సమాధానమిచ్చాడు. ఒకటి రెండు ముక్కలు మాత్రం స్పష్టంగా వినిపించాయి. "ఉహు, ఇంకెవ్వరూ మనతో చేరరు," అని సిల్వర్ అన్నాడు. దాన్నిబట్టి ఓడమీద కొంద

రైనా మేము నమ్మదగిన మనుషు లున్నారని గ్రహించాను. డిక్ రమ్ పాత్రలు తీసుకుని తిరిగి రాగానే అంతా తాగారు.

ఇంతలో సరంబీమీదనుండి కేకలు వినిపించాయి. "ఎహేయ్, నేం అదుగో, నేం" అని ఎవడో అరుస్తున్నాడు. వెంటనే ఆపిల్ పీపావద్ద సమావేశమంతా చెల్లాచెదరైంది. దడదడ కాళ్లు తొక్కుకుంటూ అంతా సరంబీ మీదకు పరుగెత్తారు. నేను "అమ్మయ్య" అని నిట్టూర్పు విడిచి పీపాలోనుండి బయటికి దూకాను.

## 12. యుద్ధచర్యలు

నేను ఓడ సరంబీమీదికి వెళ్లేసరికి కళాసీలు, నా మిత్రులు అందరూ అక్కడ సమావేశమైవున్నారు. సముద్రాన్ని ఆవరించిన పొగమంచు మెల్లిగా విచ్చిపోతున్నది. చంద్రుడు నిర్మలంగా ప్రకాశిస్తున్నాడు. మాకు నైరృతిమూలగా రెండు చిన్న కొండలు, వాటి వెనక ఎత్తైన మరొక కొండ కనిపించాయి.

ఇదంతా కలలోనుంచి చూస్తున్న వాడివలె చూశాను. సిల్వర్ కుట్రను చెవులారా విన్నప్పటి భయం ఇంకా నన్ను వీడలేదు. ఇంతలో కెప్టెన్ స్మాలెట్ కొత్త ఆజ్ఞలు జారీ చేశాడు. కళాసీలు హిస్పానియోలాను ద్వీపం తూర్పుదిక్కుకి మళ్లించారు.

కెప్టెన్ అడిగాడు: "మీలో ఎవరన్నా ఈ ద్వీపం ఇదివరకు చూశారా?"

"నేను చూశానండి," అంటూ సిల్వర్ ముందుకు వచ్చాడు. "ఒకసారి నేను పనిచేసిన ఓడ ఈ వైపుగా వచ్చింది."

"రేవు ద్వీపానికి దక్షిణంగా, ఒక చిన్న లంక చాటున ఉందనుకుంటాను," అన్నాడు కెప్టెన్.

"అవునండిసార్. దెయ్యాల దీవి అంటారండి దాన్ని. ఒకప్పుడిక్కడ సముద్రపు దొంగలు మాంచి జోరుగా ఉండేవారుటండి. మా ఓడలో ఒక కళాసీకి ఈ ద్వీపంసంగతి బాగా తెలుసు అతనే నాకు చెప్పాడు చూడండి, అక్కట్టు కనబడుతోందే, కొండ? దాన్ని డమాన్‌దిబ్బ అంటారండి. మనకి దగ్గర్లో కని పిస్తున్నదాన్ని చిన్న డమాన్‌దిబ్బ అంటారు. ఆమధ్య ఉన్నది చూడండి, పెద్దకొండ, దాన్ని టెలిస్కోప్ కొండ, అంటారండి. దానిమీద కెక్కితే టెలిస్కోపు లోంచి చూసినట్టు అంతా కనిపిస్తుందిటండి."

"ఇదుగో చూడు, సిల్వర్! నాదగ్గిర ఒక పటముంది. మనం ఆగవలసిన రేవు ఇదేనేమో చూడు," అన్నాడు కెప్టెన్.

సిల్వర్ గబగబ వచ్చి పటం అందుకున్నాడు. కాని ఒక్కసారి చూడగానే తెల్లమొహం వేశాడు. పటంలో అతనికి కావలసిందిలేదు. ఆపటం మాకు బిల్లీ బోన్స్ పెట్టెలో దొరికిన పటం కాదు. దాని నకలు

ఎర్రగుర్తులు, బిల్లీ బోన్స్, ఫ్లింట్ లపేర్లు తీసేసి జమీాం దారుగారు కెప్టెన్ ఉపయోగంకోసమని నకలు పటం తయారు చేశారు. సిల్వర్ తెల్ల మొహం చేసినా మరు క్షణంలో తన భావాలన్నిటినీ కప్పుకుని మామూలు మనిషయ్యాడు.

"ఇదేనండి సార్. రేవులని రాసివుందే, ఇక్కడే మనం లంగరు దించాలి. చాలా బావుందండి సార్ ఈ పటం ఎవరు తయారు చేశారో? సముద్రపు దొంగలు తయారు చేశారేమోఅంటే, వాళ్ల మొహం, వాళ్లకా తెలివితేటలుకూడ నా?"

"సరే నీపని నువ్వుచూసుకో. మళ్లీ కావలిస్తే పిలుస్తాను," అన్నాడు కెప్టెన్.

సిల్వర్ ధైర్యానికి నాకాశ్చర్యం వేసింది. నిర్భ యంగా తనకా ద్వీపం తెలుసునని చెప్పాడు. అనుమా నిస్తారేమోననికూడ జంకలేదు. అతడు నన్ను సమీా పించడం చూసి భయపడ్డాను. ఆపిల్ పీపాలో కూర్చుని అతని కుట్రను నేను విన్నాననే సంగతి అతనికి తెలిసి వుండదు. అయినప్పటికీ అతని ధైర్యం, కుత్సితం, కళా సీంపైన అతనికి గల పలుకుబడి, చూస్తూండగానే తలలు మార్చెయ్యగల శక్తి చూసి అతనంటే నా కప్పుడు చెప్పలేనంత భయం పుట్టింది.

"ఆహా! ఎంత మంచి ద్వీపమనుకున్నావ్ హాకిన్స్? నీలాగా రెండుకాళ్లూ వున్నకుర్రవాడు ఎగర టానికి, గెంతటానికి, ఆడుకోటానికి బలేగా వుంటుంది.

చెట్లెక్కచ్చు, రేవులో యీత కొట్టచ్చు, [illegible] వేటాడచ్చు, కొండమీదికి పాకచ్చు—మజాగా వుంటుందిలే. తన్నదియ్య, అదంతా తలుచుకుంటే నేనుకూడా చిన్నపిల్లడ్నైపోతున్నాను. ఈ కొయ్య కాలే లేకపోతేనా, నీతో పాటు నేనూ గంతులేసేవాణ్ణి, నువ్వు వెళ్ళేటప్పుడు నన్నుకూడా తీసుకుపో. ఏం?"

నన్ను బుజంమీద తట్టి కిందికి వెళ్ళిపోయాడు.

కెప్టెన్ స్మాలెట్, జమీందారుగారు, డాక్టరుగారు సరంబీమీద ఒకమూల పిట్టగోడ లానుకుని మాట్లాడుతున్నారు. సిల్వరు కుట్రను వారికి ఎంత తొందరగా వీలైతే అంత తొందరగా తెలియజెయ్యాలని నా ఆదుర్దా. కాని బహిరంగంగా చెప్పటం మంచిది కాదు. వాళ్ల దగ్గిరికి ఏ నెపంమీద వెడదామా అని ఆలోచిస్తుండగా డాక్టర్ లివ్‌సేగారే నన్ను దగ్గిరికి పిలిచారు. ఆయన పొగాకు పైపును కింద ఓడగదిలో మరిచిపోయారుట; పట్టుకురమ్మని చెబుదామనుకున్నారుట. నేను ఆయన్ని సమీపించగానే, మెల్లిగా చెప్పాను: "డాక్టరుగారూ! మీతో అర్జంటుగా మాట్లాడలి. వాళ్ళిద్దర్నీకూడా కిందగదిలోకి తీసుకువెళ్ళండి. తరవాత ఏదో వంకమీద నన్ను పిలిపించండి. చాలా ఘోరవార్త చెప్పాల్సివుంది," అన్నాను.

డాక్టరుగారు ఒక్కక్షణం కంగారు పడ్డారు. కాని మనుక్షణంలో మామూలైపోయారు.

"ఆ, అంతేనా సరేలే నువ్వుపోయింక," అన్నా

రాయన భిగ్గరగా. మిగతా వారిద్దరినీ కలుపుకుని ఆయన ఏదో మాట్లాడారు. వారిలో ఒక్కరూ ఉలిక్కి-పడటంగాని, "ఆ" అని కంగారుపడటంగాని, చేయలేదు. కాని డక్టరుగారు నేను చెప్పింది వారితో చెప్పారని గ్రహించాను. వెంటనే కెప్టెన్ స్మాలెట్ తండేలు ఆండర్సన్‌ను పిలిచాడు. కళాసీల సందర్శ సమావేశం చెయ్యమని ఆజ్ఞాపించాడు.

తండేల్ విజిల్ వెయ్యగానే కళాసీలు సరంబీ మధ్యభాగానికి వచ్చి నిలబడ్డారు. కెప్టెన్ స్మాలెట్ వారితో ఇలా చెప్పాడు:

జమీందారు ట్రెలానీగారు మీతో ఒక్క ముక్క చెప్పమన్నారు. మన ప్రయాణం ముగిసింది. మనం చేరవలసిన ద్వీపం చేరుకున్నాం. 'కళాసీలందరూ బాగా పని చేశారా' అని ట్రెలానీగారు నన్నడిగారు. ఒక్కడుకూడా నా ఆజ్ఞలు నిర్లక్ష్యం చెయ్యలేదని, తమ విధులు సక్రమంగా నెరవేర్చారనీ, ఆయనకు మనవి చేసుకున్నాను. అందుచేత మీ అందరి ఆయురారోగ్యాలకోసం ద్రాక్షరసం సేవించవలసిందని ఆయనన్నారు. అందుకని మేమిప్పుడు కిందగదిలోకి వెళ్ళిపోతున్నాము. మీకు ద్రాక్షరసం, మంచి ఖరీదైనది సప్లయి చేయిస్తాను. ట్రెలానీగారి ఆయురారోగ్యాలు కోరుతూ మీరుకూడా తాగండి."

సిల్వరు ఈ ఉపన్యాసం వింటూ, విప పువ్వు

నవ్వుతున్నాడు. "జమీందారు ట్రెలానీగారికీ—" అని అరిచాడు.

"జై" అని ఒక్క దద్దరిల్లేట్లు అరిచారంతా. ఆ అరుపు వింటే ఈ మనుషులేనా మనల్ని చంపటానికి చూస్తున్నది అనిపించింది.

"కెప్టెన్ స్మాలెట్ గారికీ —" అని మళ్ళీ అన్నాడు సిల్వరు.

"జై" అని మళ్ళీ అరిచారు కళాసీలు.

కెప్టెను, జమీందారుగారు, డాక్టరుగారు ఒక గదిలోకి వెళ్ళిపోయారు. రెండు మూడు నిమిషాల తర్వాత "జిమ్‌హాకిన్స్‌ని ఒకసారి పంపించవలసిందని" కబురువచ్చింది.

ముగ్గురూ బల్లచుట్టూ కూర్చున్నారు మధ్య స్పానిష్ ద్రాక్షారసం సీసా ఉంది. ప్రక్కన మూడు చిన్న చిన్న గ్లాసుల్లో బ్రాక్షాసారా ఉంది డాక్టరుగారు పైపు కాలుస్తూ గుప్పు గుప్పుమని వేగంగా పొగ వదులుతున్నారు. ఆందోళనగా ఉన్నప్పుడు ఆయన అలాగే పొగతాగుతారు. నన్ను చూడగానే జమీందారుగారు "హాకిన్స్! ఏదో చెబుతానన్నావుట, ఏమిటది?" అన్నారు.

నేను ఆపిల్ పీపాలో కూర్చునివిన్నదంతా పూస గుచ్చినట్టు వివరించాను. నా కథ పూర్తయ్యే దాకా శ్రోతలు కుర్చీలకు అంటిపెట్టుకుని కూర్చున్నారు.

నాకథ పూర్తి య్యేదాకా వాళ్లు నన్ను కూర్చో మనలేదు. తరవాత ఒక గ్లాసులో ద్రాక్షరసం పోసి ఇచ్చారు. నా ఆరోగ్యాన్ని కోరుతూ వాళ్లు సారా తాగారు. జమీందారుగారి ముఖంలో మార్పు గమనించాను.

"కెప్టెన్ స్మాలెట్! మీరు నిజం చెప్పారు నేను గాడిదనయ్యానని ఒప్పుకుంటాను ఇక మీరెల్లా చెబితే అల్లా నడుస్తాను," అన్నారు జమీందారుగారుముఖం తప్పిస్తూ.

"నాకంటే పెద్దగాడిద కాలేదులెండి మీరు. మొదట్లోనే తగినజాగ్రత్త పడివుండవలసింది నేను. నా అనుమానం రెటో కాదో మొదటనే తేల్చుకోక పోవటం నా పొరబాటే."

"కాని కెప్టెన్! ఈ సిల్వర్ మహాదేవాంతకుడు లాగా వున్నాడు. మనిషిని చూస్తే అంతకంటే మర్యాదస్థుడు లేనట్లుంటాడు. ఎంత కుట్రపన్నాడు? అన్నారు డక్టరుగారు.

"సరే, యీ మాటలకేంగాని అసలు సంగతి మాట్లాడదాం," అన్నాడు కెప్టెన్. "ట్రెలానీగారను మతిస్తే రెండుమూడు విషయాలు చెబుతాను."

"అనుమతి ఇవ్వవలసింది మీరు," అన్నారు ట్రెలానీగారు ముఖమెత్తకుండా,

"మొదటిది మనం వెనక్కి తిరగటానికివీల్లేదు. ముందుకే పోవాలి. రెండు. మనకింకా వ్యవధి వుంది.

అంటే గుప్తధనం సాధ్వి ఎత్తేవరకూ వాళ్లు మనకే హాని తలపెట్టరు. మూడు. ఓడలో మనం నమ్మదగిన మనుషు లింకా కొందరున్నారు. ఎప్పుడో ఒకప్పుడు కుట్ర దారులకూ మనకూ బహిరంగయుద్ధం తప్పదు. కనుక నే చెప్పే దేమంటే, ఒక మంచిరోజుచూసి, వాళ్ళు అనుకోని సమయంలో హఠాత్తుగా మనమే ముందు దాడి చేద్దాం. ముందు దాడిచేసే అవకాశం వాళ్ళకివ్వ కూడదు. ట్రెలానీగారూ! మీ స్వంత నౌకర్లు ముగ్గు రున్నారు. వాళ్లని మనం విశ్వసించవచ్చునా?"

"ఆ. నన్ను నమ్మినంతగట్టిగా నమ్మవచ్చు."

"సరే. వాళ్ళు ముగ్గురు. హాకిన్స్‌తో కలిపి మనం నలుగురం. మొత్తం ఏడుగురం. ఇంకెవరున్నారు మన వాళ్ళు?"

డాక్టరు గారందుకున్నారు: "ట్రెలానీ సిల్వ రును కలుసుకోక ముందు నలుగురైదుగుర్ని మాట్లా డడుగా. వాళ్లు బహుశా మంచివాళ్ళే కావచ్చును."

"ఉహూ. కాదు లే. ఇజ్రాయెల్ హాండ్స్‌ని నేనేగా మాట్లాడింది. వాడుకూడా ఆ ముఠాలో చేరిన వాడేగా. అంచేత వాళ్ళలో ఎవర్ని నమ్మటానికి వీల్లేదు."

"నేను చెప్పేది వినండిసార్. మనం తొందర పడకుండా ఎవరు నమ్మకస్థులో ఎవరు కాదో ముందు కనిపెట్టాలి," అన్నాడు కెప్టెన్.

"మనకు జిమ్ ఉన్నాడుగా. అతదరగ్గిర కళాసీ

లంతా చనువుగా ఉంటారు. జిమ్‌కూడా తెలివి తేట లైనవాడు. ఒక్కచూపుతో మనిషితత్వం కనిపెట్ట గలడు," అని సిఫార్సు చేశారు డాక్టరుగారు.

"హాకిన్స్! సిమీదే ఆశలు పెట్టుకున్నాం," అన్నారు జమీందారుగారు.

మా చర్చలు ముగిశాయి. కాని ఎంత చర్చిం చినా సమస్య తెగలేదు. మొత్తం ఓడమీద నున్న వాళ్లు ఇరవైమూరుగురు. అందులో మా శత్రువులు పందొమ్మిదిమంది. మేము ఏడుగురం. అందులో ఒకడు బాలుడు. కనుక యుద్ధం అంటూ వస్తే ఇటు ఆరుగురు, అటు పందొమ్మిదిమంది నన్నమాట.

## 13. నేను చేసిన సాహసం

మర్నాటి ఉదయం సరంబీమీదికి వచ్చిచూశాను. కాంచనద్వీపం రాత్రి చూసినట్టు లేదు; చాలా మారిపోయింది. బూదిదరంగుచెట్లు దట్టంగా పెరిగి వున్నాయి. మధ్యమధ్య ఎత్తైన దేవదారు వృక్షాలు ఉన్నాయి. కొండ గుట్టలు చెట్లకంటే ఎత్తుగా ఉండి బోడిగా కనిపించాయి. టెలిస్కోప్ కొండ మిగతా వాటికంటే నాలుగైదు వందల అడుగులు ఎత్తుగా వున్నది. కొండల ఆకారాలు తమాషాగా వున్నాయి. మొత్తానికి దీపస్వరూపం చూస్తే ఏమిటో వికారం పుట్టింది.

హిస్పానియోలా దెయ్యాలదీవికీ అసలు ద్వీపానికీ మధ్యవున్న రేవుకు అభిముఖంగా పోతోంది. ద్వీపానికి చెందిన రకరకాల పక్షులు మా ఓడపైగా ఎగురుతూ రొద చేస్తున్నాయి. కెరటాలు ఉవ్వెత్తుగా లేచి ఓడను ఉయ్యాల లూపుతున్నాయి అక్కడ సముద్రమంతా మురికిగా, నానా ఛండాలంగా ఉంది. ముక్కలు బద్దలు కొట్టేసేటంత దుర్గంధం వస్తోంది. ఇదంతా చూస్తే నాకు కాంచనద్వీపం మీద ఇంత వరకూ ఉన్న మోజు పోయి రోత పుట్టుకొచ్చింది.

ఇక ఓడమీద పరిస్థితులేమన్నా బాగున్నాయేమో అంటే, అవీ అంత అధ్వాన్నంగానూ ఉన్నాయి రేవు దగ్గిర కొస్తున్న కొద్దీ కళాసీల్లో తిరుగుబాటు చిహ్నాలు ఎక్కువ కాసాగాయి. జాబ్ ఆండర్సన్ అందరికంటే ఎక్కువగా పొగరుమోతుతనం ప్రదర్శిస్తున్నాడు. నాకు వినిపించేట్టు రెండు మూడుసార్లు "ఇంకెంత సేపులే మీపని," అని బూతులతో సహా గొణిగాడు మిగతావాళ్ళు కూడా కెప్టెన్ వంక, నా ఇతర మిత్రులవంక కొరకొర విషపు చూపులు చూస్తున్నారు ఒక్క సిల్వర్ మాత్రం మామూలు మర్యాద ధోరణిలోనే ప్రవర్తిస్తున్నాడు. కెప్టెన్ ఏదన్నా ఆజ్ఞాపిస్తే ఇదివరటికంటే ఎక్కువ వినయంగా నెరవేరుస్తున్నాడు. మిగతా కళాసుల దగ్గిరికి వెళ్ళి ఏదో గుసగుసలాడుతున్నాడు. "తొందర పడకండి," అని హెచ్చరిస్తున్నట్లు నాకు తోచింది.

ఓడ ద్వీపపటంలో సూచింపబడిన రేవును చేరింది. ఓడకు ఒకవేపు దెయ్యాలదీవి, మరోవైపు కాంచనద్వీపం అరమైలు దూరాల్లో ఉన్నాయి. లంగర్లు పెద్దశబ్దాలుచేస్తూ నీటిలో మునగగానే ఒడ్డుల నున్న చెట్లమీది పక్షులు గోలగా ఒక్కసారి పైకెగిరి మా ఓడను ముసిరాయి. మళ్లీ కాస్సేపటికి ఎక్కడి వక్కడ సర్దుకున్నాయి.

ఓడ ఆగగానే కళాసీల తిరుగుబాటు లక్షణాలు ఇంకా ఎక్కువయ్యాయి అందరూ ఒకచోట చేరి గుసగుస లాడటం, మాలో ఎవరమున్నా సమీపిస్తే మాట లాపివెయ్యడం సాగించారు. కెప్టెన్ ఎంతచిన్న పని చెప్పినా, నిర్లక్ష్యంగా గొణుగుతూ చెయ్యటం, లేకపోతే అసలు చెయ్యకపోవటం మొదలెట్టారు.

చివరికి మేము మళ్ళీ ఓడగదిలో సమావేశ మయ్యాము. కెప్టెన్ చెప్పాడు:

"సార్! నే నింకొక్క ఆజ్ఞ ఇచ్చానూ అంటే తిరుగుబాటు తప్పదు. వాళ్లకేదన్నా పనిచెబుదామా అంటే! ప్రమాదం సంభవించేట్టుంది. చెప్పకుండా ఊరుకుంటే, మనం తమరహస్యంకనిపెట్టినట్లు అనుమానిస్తారు. మన ఈ పరిస్థితుల్లో ఒక్కణ్ణే నమ్మటానికి వీలుంది."

"ఎవరతను?" అన్నారు ట్రెలానీగారు.

"సిల్వరే. తన అనుచరుల ఆవేశాన్ని అణచటానికి శాయశక్తులా తంటాలు పడుతున్నాడు.

అతడు సాధ్యమైనంత వరకూ తొందరపడడు. అందర్నీ ఒకచోట జేర్చి నచ్చ చెప్పటానికి చూస్తున్నట్లున్నాడు. కనుక వాళ్లకు మనం అవకాశం యివ్వాలి. ఒకపని చేస్తాను. ఈ పగలంతా మీరు ద్వీపంలోకిపోయి విశ్రాంతి తీసుకోవచ్చునని చెప్తాను. ఈ అవకాశం వాళ్లు జారవిడవరు. అందరూ కట్టగట్టుకునిపోతారు. అప్పుడు మనం వాళ్ళని మళ్ళీ ఓడ మీాదికి రాకుండ పోరాడాల్సివస్తుంది. ఎవరూ పోరనుకోండి. అప్పుడు మనం ఈ ఓడగది భాగంలోనే నిలిచి యుద్ధం చెయ్యాలి కొందరు వెళ్లి కొందరిక్కడ దిగబడతారనుకోండి అప్పుడు మనకేమీ ప్రమాదం రాదని, ఇంకా మైను వుందని అనుకోవాలి."

ఆవిధంగా ఒక నిశ్చయానికి వచ్చి ఒక ప్లాను తయారు చేసుకున్నాం. తూటాలు నింపిన పిస్టల్లు నమ్మకస్థులందరికీ పంచబడినయ్. ట్రెలానీగారి ఇంటి నౌకర్లు హంటర్; రెడ్రూత్, జాయిస్‌లకు కుట్రసంగతి చెప్పాము. వాళ్లు మేమనుకున్నంత ఆశ్చర్యపడలేదు. వాళ్లకు కళాసీల ప్రవర్తన మొదటినుంచీ అనుమానాస్పదంగానే వుందిట. "ఒక్కొక్క ముండాకొడుకును నల్లిని నలిపినట్టు నలిపిపారేస్తా"మని హంటర్ అన్నాడు.

• తరవాత కెప్టెన్ స్మాలెట్ నరంబీమీాదికి వెళ్లాడు. కళాసీ లందరినీ పిలిచాడు, "మిత్రులారా!

అందరం అలిసిపోయాము. చాలా రోజులు సముద్ర ప్రయాణం చేశాక కాసేపు నేలమీద విహరించాలని సహజంగా మీకు కోరిక వుంటుంది. బోట్లను నీళ్ళలో వెయ్యండి. వెళ్ళదలుచుకున్న వాళ్ళందరూ వెళ్ళవచ్చు. సూర్యాస్తమయానికి అరగంట ముందు తుపాకీ పేలుస్తాను. అప్పుడు మీరు వచ్చెయ్యవచ్చు."

ఈమాట వినగానే కళాసీలు సంతోషం ఆపుకోలేక గంతులు వేశారు. నేలమీదికి పోగానే గుప్తధనం ఇట్టే వెదికి పట్టుకోవచ్చు ననుకున్నారల్లే వుంది. "కెప్టెన్ స్మాలెట్ కీ జై" అని మళ్ళీ కేక వేశారు. ఆ కేక దూరపు కొండల్లో ప్రతిధ్వనించింది; మళ్ళీ పక్షులు గోలగా లేచి ముసిరాయి.

కెప్టెన్ తెలివిగా అవతలకు వెళ్ళిపోయాడు. సిల్వర్ తనపార్టీలో ఎవరెవరు రావాలో, ఎవరు ఓడమీద ఉండలో ఏర్పాటు చేశాడు. ఆరుగురు ఓడలోనే ఆగిపోయారు. సిల్వర్‌తో కలిపి మిగతా పదముగ్గురూ బోట్లలో బయల్దేరారు.

అప్పుడు నాబుర్రలోకి ఒక ఆలోచన ప్రవేశించింది. అది వట్టి తెలివితక్కువ ఆలోచనే కావచ్చును. కాని నేనల్లా చెయ్యకపోతే మా ప్రాణాలు సహకారణంగా కాంచన ద్వీపానికి బలి అయి వుండేవి.

ఓడమీద వుండి ప్రస్తుతం నేను చెయ్యగలిగిందేమీ లేదు. అందుచేత తీరానికి పోయి ఏవో సాహస

కృత్యాలు చెయ్యాలని, గుప్తధనం ఉన్నచోటు నామిత్రులకంటె ముందే కనిపెట్టి వాళ్ళను ఆశ్చర్య పరచాలని ఒక ఉత్సాహం పుట్టింది ఇక వెనకా ముందూ ఆలోచించకుండా అయిదారుగురు కళాసీలున్న ఒక బోటులోకి దూకేశాను. వెంటనే బోటు ప్రయాణం మొదలెట్టింది. ఇంకా రెండు మూడు బోట్లలో కళాసీ లున్నారు. వారి బోట్లకంటే తేలికైనది కావడంవల్ల నేనున్నబోటు, చురుకుగా, త్వరగా పోతోంది. నేను బోటులో వున్నట్లు ఎవరూ కనిపెట్టలేదు. చుక్కాని పట్టుకున్న కళాసీ ఒకడుమాత్రం "జిమ్! నువ్వేనా అక్కడుంది? కదలకుండా కూర్చో" అన్నాడు. దూరాన బోటులో ఉన్న సిల్వర్ కళ్లు చిట్లించుకుని నాకేసి చూస్తూ నేను అవునో కాదో అని పరిశీలిస్తు న్నాడు. మాబోటు ఒడ్డు తగిలీ తగలగానే దగ్గరగా ఉన్న ఒకకొమ్మనందుకుని ఒక్కవూపుతో ఒడ్డుమీద పడ్డాను. సిల్వర్ బోటు ఇంకా వందగజాల దూరంలో వుంది.

"జిమ్! జిమ్! ఆగు," అని సిల్వర్ గద్దిస్తూ కేకలు వేస్తున్నాడు. నేను వినిపించుకోకుండా ముక్కుకు సూటిగా పరుగు పుచ్చుకున్నాను కాలిలో సత్తువ వున్నంతవరకూ పరిగెత్తాను. ఇక పరిగెత్తలేక ఆగి నలుదిక్కులా పరికించాను.

# 14. మొదటి హత్య.

స్క్వైర్‌ను తప్పించుకొని రాగలిగినందుకు గర్వ పడుతూ ఒక చెట్టుకింద ఆగి నలుప్రక్కలా పరీక్షగా చూశాను. సముద్ర తీరంనుండి కొంతదూరం దాకా అంతా బురదనేల. బురదలో పెరిగే చెట్లు, పొదలు అన్నీ దాటివచ్చాను. నేను నుంచున్నచోట పొడి ఇసుక వున్నది. ఆ ప్రదేశంలో ఉన్నతమైన దేవదారు వృక్షాలు, సింధూర వృక్షాలు గుబురుగా పెరిగి వున్నాయి.

ద్వీపాన్నంతా పరిశోధించాలనే కుతూహలం కలిగింది. అంతా నిర్జనంగా ఉన్నట్లు తోచింది. నోరు లేని జంతువులు, పక్షులు మాత్రమే కనిపిస్తున్నాయి. మళ్ళీ కొంతదూరం నడిచాను. ఏవో పువ్వుల మొక్కలు కనిపించాయి. అవేమి పువ్వులో తెలియ లేదు. వాటి సందులనుండి పాకుతూ కొన్ని చిన్న చిన్న పాములుకూడా కనిపించాయి. ఒకపాము తల ఎత్తి నావంకచూసి బుస్సుమంది— ఈకొత్తవాడిక్కడి కెందుకొచ్చాడన్నట్లు. నాకప్పుడు తెలియలేదు, అది అపాయకరమైన పాముని. తరవాత తెలిసింది అది కట్ల పాముని.

చెట్ల వెనకగా కనిపిస్తున్న టెలిస్కోప్ కొండ వంకచూస్తూనుంచున్నాను. ఇంతలో నా వెనక చెట్ల మీది పక్షులన్నీ గోలచేస్తూ ఒక్కసారిగా ఎగిరాయి

కళాసీలు ఒడ్డుచేరుకుని ద్వీపంలోకి వస్తున్నారని గ్రహించాను. కొంతసేపటికి మాటలుకూడా వినిపించ సాగాయి. మాటలు క్రమంగా దగ్గిరిగా, దగ్గిరిగా విని పిస్తున్నాయి.

నాకు భయం వేసింది. శత్రువులకు కనిపించ కుండా దగ్గర్లోఉన్న ఒక లావాటి చెట్టుచాటున నక్కి-కూర్చున్నాను. మాటలు బాగా సమీపంలో విని పిస్తున్నాయి. ఒక కంఠం సిల్వర్‌దని గుర్తుపట్టాను. తీవ్రంగా, క్రోధంతో మాట్లాడుతున్నాడు. రెండో కంఠం నెమ్మదిగా, కొద్దిగా భయపడుతున్నట్లుంది, చివరికి వాళ్లోకచోట కూర్చున్నట్లున్నారు. ఎందుకంటే వాళ్లమాటలు కాస్సేపు ఆగిపోయాయి. పక్షులుకూడా చెట్లమీద తిరిగి సర్దుకున్నాయి. అందుచేత నేను ధైర్యంచేసి మెల్లిగాపాకుతూ వారినిసమీపించి ఇంకొక చెట్టుచాటున నక్కాను. అక్కడినించి సిల్వర్, అతని అనుచరుడూ శుభ్రంగా కనిపిస్తున్నారు. నేనుమాత్రం వారికి కనిపించకుండా జాగ్రత్తపడ్డాను.

సిల్వర్ టోపీతీసి కింద పడేశాడు. అనుచరుణ్ణి చూస్తూ ఇలాగన్నాడు.

"టామ్! నువ్వంటే నాకు మొదట్నించీ యిష్టం. నీ మంచికోసమే నేను చెప్పేది. నీకల కాపాడాలనే నేను తంటాలు పడుతున్నాను. నువ్వు ఒప్పుకోకపోతే వాళ్లని ఉరుకోబెట్టటం కష్టం. అసలు నిన్ను ఒప్పిస్తానని చెబుతూ ఇంతవరకూ వాళ్ళని ఆపుతూ

వచ్చాను. చెప్పు. ఆఖరిసారిగా అడుగుతున్నాను. మాలో కలుస్తావా! కలవ్వా?

రెండోవాడన్నాడు: "సిల్వర్! నువ్వు అందరి లోకి పెద్దవాడివి. గౌరవంగా బతికినవాడివి. నీకు కావలసినంత డబ్బు, మా అందరిదగ్గర ఉన్నదానికంటె ఇరవై రెట్లు ఉంది. నీ ధైర్యంలో పదోవంతుకూడా మాలో ఎవరికీ లేదు. నువ్వు కూడ ఆ వెధవల్లోచేరి ఇంత నీచానికి ఒడిగడతావా? తప్పు కాదట్రా?"

ఇంతలో దూరాన మళ్ళీ పక్షులన్నీ ఒక్క సారిగా ఎగిరాయి. ఒక పెద్ద కేక, తరవాత చచ్చి పోతూన్న మనిషి ఎవరో దారుణమైన బాధతో మూలుగుతున్నట్లు వినిపించింది.

ఈ శబ్దాలకు టామ్ భయంతో కంపిస్తూ ఒక్క ఉదుటున లేచాడు. సిల్వర్ కూడా ఒక్క ఊపుతో లేచాడు. చంకలో ఊతకర్ర పెట్టుకుని కప్పపైకి దూక సిద్ధంగావున్న తాచుపాములాగ కనిపించాడు.

"సిల్వర్!" అని అరిచాడు టామ్.

"చేతులెత్తుపైకి," అని భయంకరంగా గర్జిం చాడు సిల్వర్. ఆ గర్జనకు టామ్‌కంటే నేనే ఎక్కు వగా వణికిపోయాను.

"చేతులెత్తుతాను, కాని, నన్ను చంపడంవల్ల నీకేమి లాభం, సిల్వర్? నేను అమాయకుణ్ణని నీకు తెలియదా? నేనేమీ మాట్లాడను. మీ యిష్టం వచ్చి

నట్లు చేసుకోండి మీరు. నేను మాత్రం మీలో కలవను. ఇప్పుడు ఎవరూ అరిచింది? చెప్పు సిల్వర్ !"

టామ్‌ను ఒక్క క్షణంకూడా విడవకుండా గమని స్తున్నాడు సిల్వర్. సమాధానం చెప్పాడు: "వాడ? ఎలాన్ అనుకుంటాను."

"ఎలాన్ గాడా ? వాణ్ణి చంపేశారా? అంత మంచివాణ్ణి, చంపేశారా?" అని ఏడుపు గొంతుకతో అన్నాడు టామ్. "సిల్వర్ ! నువ్వూ, నేను ఇరవై ఏళ్లనించీ స్నేహితులంగా ఉన్నాం. ఇక నీకూ నాకూ సరి. నన్ను చంపాలనుకుంటే చంపెయ్. కాని నేను మాత్రం అంత పాపానికి ఒడిగట్టను "

ఇలా అంటూ టామ్ వెనక్కి తిరిగి ధైర్యంగా సముద్రపుగొడ్డుకు అడుగులు వేయసాగాడు. అయి దారు అడుగులు వేశాడో లేదో సిల్వర్ బెల్టులోంచి అతివేగంగా పిస్టలుతీసి టామ్‌కేసి గురిపెట్టి పేల్చాడు. "ఆ—" అంటూ టామ్ కుప్పకూలినట్లు కూలి పోయాడు. సిల్వర్ మరుక్షణంలో మెరుపు మెరిసినట్లు మెరిసి ఊతకర్రను వదిలేసి టామ్ మీదికి దూకాడు. బొడ్డులోనుండి బాకు తీసి టామ్‌ను కసితీరా పోట్లు పొడిచాడు.

తరవాతేమి జరిగిందో నాకు తెలియదు. ఈ ఘోరదృశ్యం చూసి స్పృహతప్పి ఒరిగిపోయాను. మళ్ళీ లేచేసరికి సిల్వర్ ఇంకా అక్కడే వున్నాడు. ఎదురుగా టామ్ శవం నెత్తురు వరదల్లో తేలుతోంది.

సిల్వర్ తన బాకుపై నెత్తురు తుడుచు కుంటున్నాడు. తక్కిన ప్రకృతి అంతా ఎప్పటిలాగే వున్నది. చల్లటి గాలి వీస్తోంది. చెట్ల ఆకులు రొద చేస్తున్నాయి. ఆ ప్రశాంత ప్రకృతిలో అక్కడ ఒకమనిషి హత్యచెయ్యబడ్డాడనేందుకు ఎదురుగా శవంతప్ప మరే నిదర్శనమూ లేదు.

సిల్వర్ తరవాత జేబులోంచి విజిల్ తీసి చాల సార్లు, రకరకాలుగా ఊదాడు. ఎందుకు ఊదాడో తెలియలేదు కాని మళ్ళీ నన్ను భయం ఆవేశించింది. బహుశా దూరానున్న సిల్వర్ మిత్రులు అందరూ బిలబిలమంటూ అక్కడికి రావచ్చు. నన్ను చూశారంటే ఏం జరుగుతుంది? ఏం జరుగుతుందో నా కళ్ళారా చూడనేచూశాను. వాళ్ళ కుట్రలో కలవనందుకు ఇద్దరు కళాసీలు—ఎలాన్, టామ్, ఇద్దరూ దారుణంగా వధించబడ్డారు. నన్ను మాత్రం చంపరని నమ్మకమేమిటి?

మళ్ళీ వచ్చినదారినే పాకిపోయాను. ఎక్కడా శబ్దం కాకుండా, సాధ్యమైనంత వేగంగా నేను మొదట్లో ఆగిన చెట్టువరకూ పాకాను. తరవాత లేచి కాలికొద్దీ పరిగెత్తాను. ఎటు పోతున్నదీ కూడా గమనించకుండా, ఎంత దూరం వచ్చిందీకూడా చూడకుండా పరిగెత్తాను.

మళ్ళీ వెనక్కి వెళ్ళడం అసంభవం. కెప్టెన్ స్మాలెట్ సూర్యాస్తమయానికిముందు తుపాకీ పేలుస్తా

నన్నాడు. కాని నేను హిస్పానియోలాను చేరుకోవడ మెల్లా? బోట్లు శత్రువుల స్వాధీనంలో ఉన్నాయి. అసలు నేను ఓడనువిడిచి వీళ్ళతో ఎందుకు రావాలి? వచ్చినందుకు తగిన శాస్తి జరిగింది. ఇక ఓడలోకి వెళ్ల గలగటం కలలో మాట. గుడ్ బై హిస్పానియోలా! గుడ్ బై డాక్టర్ లివ్ సే! మిత్రులందరికీ గుడ్ బై. ఇక నేను ఈ నిర్జన ద్వీపంలోనే శాశ్వతంగా సంచరించా లేమో.

ఇలా ఆలోచిస్తూ ఇంతసేపూ పరిగెత్తుతూనే వున్నాను. ముందు విశాలమైన మైదానం వున్నది. దేవదారుచెట్లు, సిందూరపుచెట్లు వెనకాలంత దట్టంగా లేవు. కాని బాగా ఎత్తుగా వున్నాయి. గాలి కూడా సముద్రతీరాన వున్నట్టుకాక నిర్మలంగా, హాయిగా ఉన్నది.

కాని మళ్లీ కొత్తఅపాయం ఎదురుపడింది. మళ్లీ కాళ్ళకు సంకెళ్లు పడినట్లు ఆగవలసి వచ్చింది.

## 15. అడవిమనిషి

వందగజాల దూరంలో ఒక చిన్న కొండవున్నది. హఠాత్తుగా దాని శిఖరంనుండి రాళ్లు, రప్పలు దొర్లటం ప్రారంభించాయి. ఆశబ్దానికి అప్రయత్నంగా అటువైపు దృష్టి సారించాను. కొంతసేపటికి ఒక అకా రం శిఖరంమీద కనబడింది. అతివేగంగా ఎగురుతూ

గెంతుతూ కిందికి వస్తోంది. అది ఎలుగుబంటో, కోంప ముచ్చో, మరే ఇతరజంతువో తెలియలేదు. ఆకారం మటుకు అతి వికృతంగా ఉన్నది. దాన్ని చూసీచూడ గానే భయంతో ఒళ్లు బిగుసుకు పోయినట్లై ఆగి పోయాను.

వెనక్కి పోవటానికిగాని, ముందుకు పోవటానికి గాని కాళ్లాడలేదు. వెనకవేపు తెలిసిన శత్రువులు ముందువేపు తెలియని శత్రువు- వెనకగొయ్యి, ముందు నుయ్యిగా తయారైంది నాపని. కాని చివరికి తెగిం చాను. తెలియని ఈ వింతజంతువు నెదుర్కోవటం కంటె సిల్వర్ దగ్గిరికిపోవటమే మంచిదని పించింది. వెంటనే వెనక్కితిరిగి పరిగెత్తసాగాను. ఇరవై గజాలు పరిగెత్తానో లేదో, ఆవింత జంతువు ఏదారినవచ్చిందో ఏమోగాని నాఎదురుగా మళ్లీ కనబడింది. కాని ఈసారి స్పష్టంగా తెలిసింది, అది జంతువుకాదని, మనిషేనని. మనిషని తెలిసినంత మాత్రాన నా భయం తగ్గలేదు. ఇలాంటి నిర్జనద్వీపాల్లో మనుషుల్ని తల బద్దలు కొట్టి పీక్కుతినే వాళ్లుంటారని వినివుండటం చేత ఇక ఎల్లాగూ చావుతప్పదని గుండె రాయిచేసుకుని నుంచున్నాను.

అడవిమనిషి నేనాగటంతోనే తనూ ఆగాడు. సందేహిస్తూ రెండడుగులు వేశాడు. మళ్లీ ఆగాడు. మళ్ళీ కదిలి మళ్ళీ ఆగాడు. నాకు ఆశ్చర్యం వేసింది. నాలాంటి చిన్న కుర్రవాడినిచూసి ఈ అడవి మనిషి

ఎందుకిల్లా జంకుతున్నాడని. చివరికి అతడు రెండు చేతులూ పైకెత్తి మోకరించాడు.

నేను అతన్ని సమీపించాను. "ఎవరునువ్వు?" అని అడిగాను.

"బెన్‌గన్" అన్నాడు. అతని కంఠం తుప్పు పట్టిన గొలుసులు గరగర మన్నట్లు, కఠోరంగా, అసహ్యంగా వినిపించింది. "బెన్‌గన్ అంటారు సార్ నన్ను. నేను బెన్‌గన్నండి నేను." మాసలకోసం తడుముకుంటున్నట్లు, నాలిక స్వాధీనంలో లేనట్లు అని పించింది. "నాపేరు బెన్‌గన్ అండి. మూడేళ్ళ నుండి మనుషుల్తో మాట్లాళ్లేదండి."

ఎండకు కమిలిపోయివున్నా అతని శరీర వర్ణం తెల్లగా నేవుంది. ఇంగ్లీషువాడేనని గ్రహించాను. పెద వులు మాత్రం నల్లగా మాడిపోయి ఉన్నాయి. జుట్టు, గడ్డం, మీసాలు తెల్లగా పండిపోయాయి. తెరచాప గుడ్డలే కట్టుకున్నాడు. అవైనా తెగమాసి, చిరిగి వున్నాయి.

"మూడేళ్ళా? అని ఆశ్చర్యపోయాను. "ఇక్కడి కెల్లా వచ్చావ్? ఏదన్నా ఓడ మునిగి యిక్కడికి చేరు కున్నావా?"

"లేదండి. ఇక్కడ వదిలేశారండి నన్ను."

నేనిటువంటివి ఇదివరకు విన్నాను. ముఖ్యంగా సముద్రపు దొంగల్లో ఎవడన్నా ఎదురుతిరిగితే వాణ్ణి నిర్జన ద్వీపాల్లో వదిలివేస్తారు. వాడు కొంతకాలం

పాటైనా చూపకుండా కాస్త ఆహారం, తుపాకి, మందు కూడా ఇస్తారు. ఇది వాళ్ళ ఆచారం.

"మూడేళ్ళ కిందనండి, నన్నిక్కడ వదిలేశారు. అప్పట్నుంచీ సార్, గొర్రెలు, నత్తలు, రొయ్యలు, ఆకులలములు తింటున్నానంటే నమ్మండి. మనుషులు తినే అన్నం కోసం మొహం వాచిపోయానండి. మీదగ్గరేమన్నా జున్నుగడ్డగాని, కేక్ గాని వుందాండి. మీ కాళ్ళు పట్టుకుంటానండి సార్, కాస్త పెట్టండి."

"దగ్గరేమీ లేదుగాని మా ఓడమీదికి మళ్ళీ ఎప్పటికైనా వెళ్లడమంటూవస్తే నీకు తప్పకుండా బోలెడు పెడతాను," అన్నాను నేను.

"ఏమండి సార్ ! ఎందుకు వెళ్లలేరండి?" అని అడిగాడు.

"దానికి అంతా కథ వుందిలే."

"మీ పేరేమిటండి?"

"జిమ్ హాకిన్స్."

"హాకిన్స్‌గారూ! మీరు నమ్ముతారో నమ్మరో గాని, యీ మూడేళ్లు నేనెన్నికష్టాలు పడ్డానో చెప్పలేనండి. మృగాల్లాగా బతికానండి. నా కొక మంచి అమ్మ వుందంటే నమ్ముతారా అండి మీరు?"

"ఎందుకు నమ్మను!" అన్నాను మా అమ్మను తలుచుకుంటూ.

"మా అమ్మ చాలా మంచిదండి. ఎప్పుడూ దేవుణ్ణి ప్రార్థిస్తూ వుంటుందండి. ఆవిడ మాటలు విన

కుండా నేను సముద్రపు దొంగల్లో చేరానండి. ఇప్పుడు బుద్ధి వచ్చిందండి. ఇంకెప్పుడూ పాడుపనులు చెయ్య నండి. మంచిగా ఉంటానండి," అని ఆగి అన్నివేపులా సందేహిస్తూ చూశాడు. తరవాత మెల్లిగా చెవిలో చెప్పాడు. "నా దగ్గర చాలా డబ్బు ఉందండి."

మూడేళ్లు ఏకాంత ప్రవాసం అనుభవించినందు వల్ల ఈ మనిషికి మతిపోయిందనుకున్నాను. అలా అనుకుంటున్నట్లు అతడు గ్రహించాడల్లే వుంది. కొంచెం గట్టిగా, కోపంగా ఆమాటలే మళ్లీ అన్నాడు,

"నాదగ్గిర బోలెడు డబ్బుంది, ఏమనుకుంటున్నారో? నేను మొదట్లో మిమ్మల్ని చూశాను. కావలిస్తే ఆడబ్బంతా మీకే యిచ్చేస్తాను."

అంతలో అతని ముఖంమీద సందేహ రేఖలు తోచాయి. నావంక తీవ్రంగా చూశాడు. నా చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు. సముద్రతీరం కేసి చూపిస్తూ,

"ఆఓడ ఎవరిది? ఫ్లింట్ దేనా?" అని అడిగాడు.

ఆ, ఫరవాలేదనుకున్నాను. ఇతడు ఫ్లింట్ శత్రువై ఉంటాడని, అందువల్ల నాకు మిత్రుడని అనుకున్నాను.

"కాదు. కెప్టెన్ ఫ్లింట్ చచ్చిపోయాడు. కాని అతని మనుషులు చాలమంది ఓడలో మాతో వచ్చారు. వాళ్లు మా మీద కుట్రపన్నారు," అని చెప్పాను.

"వాళ్లలో కుంటివా డున్నాడా?"

"సిల్వరేనా?" అన్నాను.

"అవును, లాంగ్ జాన్ సిల్వర్!"

"ఉన్నాడు. వాణ్ణి వంటవాడుగా పెట్టుకున్నాము. వాడెదురు తిరిగి మిగతా వాళ్ళతో కలిసి మమ్మల్ని చంపటానికి చూస్తున్నాడు."

"ఈ ద్వీపం ఏమిటనుకుంటున్నారు మీరు?" అని అడిగాడు.

నేను మేము ఎల్లావచ్చిందీ, ఎందుకు వచ్చిందీ అంతా చెప్పాను. శ్రద్ధగా, కుతూహలంతో విన్నాడు. విన్నాక నా తల నిమురుతూ ఇలాగన్నాడు.

"హాకిన్స్ గారూ! మీరు బెన్ గన్ ని నమ్మండి. బెన్ గన్ మీకే సహాయం కావాలన్నా చేసిపెడతాడు. ఈ ద్వీపంలో నాకు తెలియనిచోటు లేదు. అయితే మీ జమీందారుగారు నన్ను నమ్ముతారా మరి?"

"ఆయన చాలా మంచివాడు," అని చెప్పాను.

బెన్ గన్ కొంచెంసేపు ఆలోచించాడు.

"మీతో ఒక రహస్యం చెపుతాను. మీరు ఏ పనిమీద వచ్చారో ఆ పని నేనిదివరకే పూర్తిచేశాను. ఆ, అంతా, కాస్తకూడా మిగల్చకుండా చేసేశాను."

"నిజంగా" అని ఆశ్చర్యపోతూ అడిగాను.

"నిజంగా. నేను చచ్చినంత ఒట్టు"

"ఎక్కడుంది అదంతా?"

"ఎక్కడుంటే నేం? ఎక్కడో ఆ మూలగా దాచాను. హాకిన్స్ గారూ! మీరు నాకు మాటివ్వాలి. జమీందారుగారికి నా సంగతంతా చెప్పి ఒప్పించాలి.

నాకే మక్కర్లేదు. వెయ్యి పౌన్లు యిస్తే చాలు. ఒప్పుకుంటారా?"

"తప్పకుండా ఒప్పుకుంటారు. అసలు అందరం కలిసి పంచుకోవాలనే మా ప్లాను.

"మరి ఇంకోటుంది. నన్ను మీ ఓడలో మళ్ళీ ఇంగ్లండు తీసుకు వెడతారా?"

"తప్పకుండా. అసలు మాకు వెళ్ళేటప్పుడు కళాసీలు ఎలాగూ తక్కువౌతారు గనక నువ్వుంటే మాకు చాలా తోడుగా వుంటుంది."

బెన్ గన్ ముఖం ఎంతో సంతోషంతో చేటంత అయింది. మనిషి స్థిమితపడ్డాడు.

"ఇహ చెబుతాను వినండి. నేను కెప్టెన్ ఫ్లింట్ ఓడలో కళాసీని. అతను తను దోచిన డబ్బంతా ఈ ద్వీపంలో పాతిపెట్టాడు. అప్పుడు నేను, సిల్వర్, బిల్లీబోన్సూ ఓడలో వున్నాం. ఆ ఓడ పేరు మీరు విన్నారుగా, వాల్రస్ అంటారు. ఫ్లింట్ ఇంకో ఆరుగుర్ని వెంటపెట్టుకుని వెళ్ళి డబ్బు పెట్టెలు ఎక్కడో పాతిపెట్టాడు. పాతిపెట్టి, వచ్చేటప్పుడు ఒక్కడే వచ్చాడు. మిగతా ఆరుగురూ ఏమయ్యారని మేమడగలేదు. వాళ్ళందర్నీ చంపేసి వుంటాడని మాకు తెలుసు. ఆ, అతడొక్కడే ఆరుగుర్నీ చంపేసి వుంటాడు. అతని స్వభావం మాకు తెలుసు. కాని "డబ్బెక్కడ పాతిపెట్టావని" అడిగాం. "కావలిస్తే మీరుపోయి వెతుక్కోండి. నేను

మాత్రం మీకోసం ఆగను," అన్నాడు ఫ్లింట్. మేం నోరు మూసుకున్నాం.

మూడేళ్ల కిందట నేను ఇంకో ఓడలో పనిచేస్తున్నాను. ఆఓడలో స్నేహితుల్ని ఒప్పించి ఈ ద్వీపానికి తీసుకొచ్చాను. వాళ్లు, నేనూ కలిసి పన్నెండు రోజుల పాటు లంకంతా వెతికాం. డబ్బెక్కడుందో కనిపించ లేదు. వాళ్లు నేను మోసగించా ననుకున్నారు. నాకు ఒకతుపాకి, ఒకపార, గునపంయిచ్చి "బెన్‌జమిన్‌గన్! నువ్విక్కడ నియిష్టం వచ్చినంతకాలం యిక్కడే హాయిగా వుండు. డబ్బుదొరికితే నువ్వేతీసుకో" అనిచెప్పి వదిలేశారు. హాకిన్స్‌గారూ! అప్పట్నించీ యిక్కడే మృగాల్లో మృగంలాగా వుంటున్నాను. మిమ్మల్ని చూడగానే నాకు ప్రాణంలేచి వచ్చింది," అని కళ్ల నీళ్లు పెట్టుకున్నాడు.

"బాబూ! మీ జమీందారుగారితో చెప్పండి. 'బెన్‌గన్ చాలా మంచివాడు. మూడేళ్లు ఎండలో, వానలో, చలిలో, వెలుగులో, చీకటిలో బతికాడు. ఎప్పుడూ దేవుణ్ణి ప్రార్థనచేసుకుంటూ, వాళ్లమ్మని తలుచుకుంటూ, ఉన్నాట్ట. కాని చాలాకష్టపడి చివరికి ఫ్లింట్ రహస్యాన్ని కనిపెట్టాడట, అని చెప్పండి. ఏమిటా రహస్యమని ఆయనడిగితే ఇదిగో ఇల్లా కన్నుగీటండి. ఏం, తెలిసిందాండి."

"సరే. చెబుతాను. కాని నేను ఓడలోకి వెళ్లటమా? రావటమంటే సిల్వర్ వాళ్ళబోట్లలో

వచ్చాను. కాని యీసారి నన్ను చూడగానే వాళ్లు చంపేస్తారు," అన్నాను దిగులుగా.

"నేనున్నాను గదండి. నేనిన్నాళ్లూ ఏం చేస్తున్నా ననుకున్నారు? ఓ మంచిబోటు తయారు చేశాను ఆముక్కా యీ ముక్కా చేర్చి. ఓడ రేవుకు తూర్పుగా తెల్లగుట్ట అనివుందే అక్కడ చెట్లచాటున దాచానుదాన్ని. కావలిస్తే చీకటిపడ్డాక పీలవు తుందేమో చూద్దాం......ఏమిటది?" అని అదిరి పడ్డాడు బెన్‌గన్. నేనుకూడా అదిరిపడ్డాను.

ఎందుకంటే, మా ఓడ దిశనుండి ధామ్మని ఫిరంగిమోత వినిపించింది. సూర్యాస్తమయానికి ఇంకా గంట రెండుగంటలు పైనేవుంది. కనుక ఆ ఫిరంగి కెప్టెన్ స్మాలెట్ పేల్చినదైవుండదు. కనుక ఏదో గొడవ ప్రారంభమై వుండాలి.

"యుద్ధం మొదలు పెట్టారల్లేవుంది," అన్నాను కంగారుగా. వెంటనే రేవుకేసి పరిగెత్తసాగాను. నావెనకాల బెన్‌గన్ అతి తేలిగ్గా లేడిపిల్లలా చెంగు చెంగున ఎగురుతూ వస్తున్నాడు.

"ఈపక్కగా రండి. ఇటు, ఇటు. ఎడమవేపు చెట్లకిందగా పరిగెత్తండి. చూడండి ఇక్కడే నేను మొట్టమొదటి గొర్రెను చంపాను. ఇక్కడికి అప్పు డప్పుడువచ్చి దేవుణ్ణి ప్రార్థిస్తూ వుంటాను......" ఇలా మాట్లాడుతూ అతడు నాతోపాటు పరిగెత్తుతూ వస్తు న్నాడు.

ఫిరంగిమోత వినబడిన చాలసేపటికి థాం థాం మ్మని తుపాకులు పేలిన చప్పుళ్లు క్రమంగా ఎక్కువయ్యాయి. యుద్ధం జోరుగా జరుగుతోందన్న మాట. ఇంకా కొంతదూరం పరిగెత్తాము. హఠాత్తుగా ఒక పావుమైలు దూరంలో ఎదురుగా 'యూనియన్ జాక్' జెండా కనిపించింది. చెట్లపైగా అస్తమయ సూర్యుడి ఎర్రకాంతిలో ఇంకా ఎర్రగా మెరిసిపోతూ కనపడింది.

## 16. డాక్టర్ లివ్‌సే చెప్పిన కథ.

సిల్వర్ మొదలైనవారి బోట్లు రెండూ తీరానికి వెళ్లాక, నేను, కెప్టెను, జమీందారు ఓడగదిలో కూర్చుని మా కార్యక్రమాన్ని గూర్చి చర్చించుకొంటున్నాము. గాలిపాటు ఏమాత్రం అనుకూలంగా వున్నా, ఓడలో మిగిలిన అరుగురు తిరుగుబాటుదార్ల పైన పడి వారిని ఖైదుచెయ్యటమో ఏదోచేసి, లంగరు ఎత్తి వెనక్కి బయలుదేరి పోయేవాళ్ళం. కాని గాలిపాటు ప్రయాణానికి అనుకూలంగా లేదు. అదీకాక జిమ్‌హాకిన్స్ కూడా కుట్రదారులతో పాటు తీరానికి వెళ్లాడని హంటర్ వచ్చిచెప్పాడు. దాంతో మేము ఏం చెయ్యటానికి తోచక కూర్చుండిపోయాము.

జిమ్‌హాకిన్స్ కుట్రదారులతో కలిశాడని మేము ఎన్నడూ అనుమానించలేదు. కాని అతని కేదపాయం వాటిల్లుతుందోనని గాబరాపడ్డాం. సిల్వర్ మొదలైన వారి స్వభావం మాకు తెలుసు గనక, జిమ్ హాకిన్స్ నింక చూడటం అసంభవమని భావించాము. నరంబీ

మీాదికి వచ్చి చూశాము. గాలి దుర్గంధ భూయిష్ఠంగా వున్నది. కుట్రదారులు ఆరుగురూ ఒకమూల నణుగుతూ, మాకేసి విషపుచూపులు చూస్తూకూర్చున్నారు.

ఊరికే చూస్తూ కూర్చోటం మాకూ డా దుర్భరంగా వుంది. చివరికి హంటర్, నేనూ కలిసి ఒడ్డుకి వెళ్లి సంగతి సందర్భాలు తెలుసుకురావాలని నిశ్చయించాము. వెంటనే మరొక బోటులో, పటంలో "మట్టికోట" అని గుర్తుపెట్టబడిన ప్రదేశానికి సూటిగా బయల్దేరాము.

ఒడ్డు చేరగానే హంటర్‌ను బోటు కాపాడటానికి, వదిలి నేను లోపలికి నడిచాను. చెట్లు, తీగలు అల్లిబిల్లిగా పెరిగివున్నాయి. రెండుచేతుల్లో రెండు పిస్తళ్లు రెడీనా పట్టుకున్నాను. వందగజాలు నడిచానో లేదో "మట్టికోట" కనబడింది. అది మట్టిగోడలతో కట్టబడివున్నా, గోడలలోపల బలమైన దుంగ లున్నందున ఇల్లు దృఢంగా నేవుంది. ఇంటివెనక ఒకమాదిరి ఎత్తైన దిబ్బవున్నది. దిబ్బపైనుండి నీటిబుగ్గ ఒకటి దిగువకు ప్రవహించివస్తోంది. ఆ నీరు నిర్మలంగా, తాగటానికి బాగానే వుండేటట్లున్నది. ఇంటికి, నీటిబుగ్గకు చుట్టూ కొంత ఖాళీస్థలము, దానిచుట్టూ ఆరడుగుల ఎత్తుగల ఒకకంచె ఉన్నాయి. కంచె కవతల మళ్ళీ ఖాళీస్థలముంది. మట్టికోట నెవరైనా ముట్టడిస్తే లోపలివాళ్లు కాలుమీాద కాలేసుకుని యుద్ధం చెయ్యవచ్చు. ఎందుకంటే గోడలకు అన్నివేపులా పెద్ద రంధ్రాలున్నాయి.

గోడచాటున నిలబడి, రంధ్రంలో తుపాకు లుంచి, ముట్టడిదారులను కాకుల్ని కొట్టినట్టు కొట్టవచ్చు. బయటివాళ్లు ఖాళీస్థలంలో నుంచు నే యుద్ధం చెయ్య వలసి వస్తుంది గనక, వాళ్ళకి రక్షణ ఉండనే ఉండదు. ఇంటిలోపల నలుగురైదుగురు... 

ఇంటిలోపల నలభై, యాభైమంది చులాగ్గా పడతారని అంచనా కట్టాను.

కాని అన్నిటికంటే నాకు నచ్చింది. నీటిబుగ్గ. తగినంత ఆహారపునిలవలు ఉంటే ఇక్కడ ఎంతకాల మైనా గడపవచ్చు ననిపించింది. ఓడలో మాకు అన్ని సదుపాయాలూ ఉన్నాయిగాని మంచినీళ్లు లేవు. ఇక్కడ పుష్కలమైన జలసౌకర్యం ఉన్నది.

ఇలా ఊహాగానం చేస్తుండగా, నా ఆలోచనలను చెదరగొడుతూ పిస్టల్ పేలినధ్వని, "అమ్మో" అని చనిపోతున్నవాడెవడో వేసిన కేక వినిపించాయి. అదిరిపడ్డాను. జిమ్‌హాకిన్స ఎగిరిపోయివుంటాడని భయపడ్డాను.

ఇంక ఇక్కడ తారట్లాడటం మంచిదికాదని గబగబ బోటుదగ్గరకు వచ్చేశాను. హంటర్ అతి వేగంగా తెడ్లువేశాడు. హిస్పానియోలాలోనికి ఎక్క ఎక్కగానే జమీందారు నన్ను కావిలించుకున్నాడు. ఇందాకటి పిస్టల్ ధ్వనివిని నన్నో, హంటర్‌నో పేల్చేసి వుంటారని అతను భయపడ్డాడట.

కెప్టెన్ స్మాలెట్ చెప్పాడు:-"అక్కడ కూర్చున్న ఆరుగురిలో ఆఖరివాణ్ణి చూశారా? వాడు పిస్టల్

మోత వినగానే మూర్ఛపోయాడు. వారికి హాత్యలు కొత్తగావును. బహుశా వాడు మంచివాడు కావచ్చును. మన వేపు తిరిగితే తిరగవచ్చునుకూడా. ప్రయత్నించి చూద్దాం."

నేను ద్వీపంలో చూసిందంతా చెప్పాను. మేమేమి చెయ్యాలో నిశ్చయించుకున్నాము.

ఓడగదిముందు కాపలాగా రెడ్రూత్‌ను నిల బెట్టాము. అతనికి తూటాలునింపిన నాలుగు చిరు తుపాకులిచ్చాము. హాంటర్ బోటును ఓడ వెనకభాగాన నిలిపి వుంచాడు. నేనూ, జోయిస్ కలిసి బోటులో సామాన్లు నింప నారంభించాము. తుపాకి మందు డబ్బాలు, తుపాకులు, బిస్కట్ల సంచులు, మాంసపు టిన్నులు, ద్రాక్షసీసాలు, అన్నిటికంటే ప్రధానమైనది నా మందులపెట్టె బోటులో చేర్చాము.

మేమీ పని చేస్తుండగా ఈలోగా జమీందారు, కెప్టెన్ సరంబీమీదికి వెళ్లి కుట్రదారులను బెదిరించారు. కెప్టెన్ సరంగు ఇజ్రాయెల్ హాండ్స్‌ను పిలిచి ఇలా గన్నాడు: "మిస్టర్ హాండ్స్! మే మిద్దరం ఇక్కడ వున్నాం. మాయిద్దరివద్దా చెరి రెండేసి పిస్టళ్లున్నాయి. మీలో ఎవరన్నా ఒడ్డున వున్న మీ స్నేహితులకు ఏవిధమైన సంజ్ఞగాని చేసినట్లయితే వాడిపని ఆ క్షణం లోనే ఆఖరు. తెలిసిందా?"

ఈ బెదిరింపుకు వాళ్లు భయపడటమే కాకుండా, తెల్లబోయారు. ఎందుకంటే వాళ్ళ కుట్రసంగతి మా

కింకా తెలియదనే ఉద్దేశపడుతున్నారు. కెప్టెన్ మాటలు విని వారిఆశ్చర్యానికి మేర లేదు. వెంటనేవాళ్లు సరంబీ మెట్లు దిగి కిందభాగానికి వెళ్ళారు. బహుశా వెనకనుండివచ్చి మామీద పడదామని వాళ్ళ అభిప్రాయం కావచ్చు. కాని ఓడ గదిముందు పడవలో తుపాకీలతో రెడీగా ఉన్న రెడ్రూత్ను చూసి హడిలిపోయి మళ్ళీ సరంబీమీదికి వచ్చారు. వచ్చి మళ్ళీ మొదటచోటే కూర్చున్నారు.

ఈలోగా మాబోటును, సామాన్లతో పూర్తిగా నింపాము. హంటర్, జోయిస్, నేనూ బోటు నడుపుకుని ఒడ్డుచేరాము. ఆ సామానంతా మట్టికోటలో చేర్చాము. జోయిస్ను అక్కడ కాపలాపెట్టి హంటర్ నేనూ తిరిగి ఓడలోకి వచ్చి మళ్ళీ ఇదివరకులాగే బోటులో సామాను నింపాము. అదంతా మట్టికోటలోకి చేర్చి, హంటర్నుకూడా జోయిస్కు తోడుగా వుంచి నేనొక్కణ్ణే బోటులో తిరిగి హిస్పానియోలా వద్దకు వచ్చాను.

మూడోసారికూడా బోటును నింపనారంభించాము. ఈసారి తుపాకిమందు, బిస్కట్ల సంచులు మాత్రమే నింపాము. ఇదే ఒడ్డుకె ఆఖరి ప్రయాణం కనుక బోటులో ఈమాటు నేనూ, కెప్టెన్, జమీందారు, రెడ్రూత్ నలుగురం ఎక్కాలి. నలుగురం ఎక్కగా బోటు ఎంత బరువును భరించగలదో అంత మాత్రమే సామాను చేర్చాము. కాని చూస్తూచూస్తూ

ఓడలో అంత మందు గుండు సామగ్రిని వదిలివేయ బుద్ధికాలేదు. అందుచేత కొంచెం ఎక్కువ సామగ్రినే బోటులో నింపామనుకుంటాను. మేము నలుగురం తలొక చిరుతుపాకిని, కత్తిని ధరించాము. మిగతా ఆయుధాలను, మందు సామగ్రిని సముద్రంలో పార బోశాము. రెడ్రూత్ ఓడగదిని విడిచిపెట్టి బోటులోకి వచ్చాడు. నేను, జమీందారుకూడా బోటులో కూర్చున్నాము. కెప్టెన్‌మాత్రం ఇంకా సరంబీ మీదనే నిలబడ్డాడు.

"ఏయ్ కళాసీలూ! వినిపిస్తోందా నా మాట?" అన్నాడు కెప్టెన్.'

సమాధానం లేదు.

"నీకే చెప్పేది. అబ్రహాం గ్రే! నీతోనే మాట్లాడుతోంది."

"ఇంకా సమాధానం లేదు. కెప్టెన్ గొంతు హెచ్చించాడు: "గ్రే! నేను ఓడ వదిలివెడుతున్నాను. నీ అధికారితోపాటు రావలసిందని ఆజ్ఞాపిస్తున్నాను. నీహృదయం మంచిదని, పొరపాటున వాళ్ళ కుట్రలో అడుగుపెట్టావని నాకు తెలుసు. నాచేతిలో గడియారం వుంది. ముప్ఫయ్ సెకండ్లు గడువిస్తున్నాను నువ్వు మాతో రావడానికి"

కాసేపు నిశ్శబ్దం.

"వచ్చెయ్, వచ్చెయ్. త్వరగా రావాలి. ఇంకా పది సెకండ్లు మాత్రమే వుంది టైము. ఒక్కొక్క

సెకండు గడుస్తున్నకొద్దీ నా ప్రాణానికి, ఈ పెద్ద మనుషుల ప్రాణాలకి అపాయం ఎక్కువౌతోందన్న మాట. వస్తున్నావా?"

హఠాత్తుగా తెరచాపచాటున పెద్ద చప్పుడైంది. దెబ్బలు వినిపించాయి. అబ్రహాంగ్రే ఒక్క దూకులో కెప్టెన్ స్మాలెట్ వద్దకు వచ్చాడు.

అతని ఎడమ దవడమీద కత్తి గంటునుండి రక్తం కారుతోంది.

"వచ్చానండి సార్. నేను మీతోనే వుంటానండి."

మరుక్షణంలో అతడూ, కెప్టెనూ బోటులోకి దూకారు. వెంటనే బోటు కదిలింది. పిస్టల్ ధ్వని వినిపించినప్పుడు మూర్ఛపోయినవాడే అబ్రహాంగ్రే.

# 17. యుద్ధం మొదలు

(డాక్టర్ చెప్పిన కథ)

ఈ ఆఖరి ప్రయాణం మాకు అపాయకరంగానే పరిణమించింది. బోటులో ఐదుగురం వున్నాం. అందులో ముగ్గురు—జమీందారు, కెప్టెన్ స్మాలెట్, రెడ్రూత్ లు—ఆరడుగులకంటె పొడుగున్న మనుషులు. అదికాక తుపాకిమందు, బిస్కట్ల సంచులు. దీంతో బాటు ఏక్షణాన్నైనా మునిగిపోవచ్చు ననిపిస్తోంది. అంచులు నీటిమట్టానికి దాదాపుసమానంగావున్నాయి.

పెద్దతరంగం వచ్చినప్పుడల్లా లోపలికి నీళ్లువస్తున్నాయి. ఆ నీళ్ళను వెంటనే తోడివేస్తున్నాము కాబట్టి సరిపో యింది, లేకపోతే మునిగిపోయేవాళ్ళమే. గట్టిగా ఊపిరి పీల్చటానికికూడా మాకు భయంగా వుంది.

అదల్లా వుంచి, సముద్రపు పోటు మమ్మల్ని ఒడ్డుకు చేరనివ్వడం లేదు. ఎంత బలంగా తెడ్లు వేసినా బోటు కదలటం లేదు. కదిలితే పడమటికో, నైరృతికో కదులుతోందిగాని మేము చేరవలసినదిశగా మాత్రం కదలటం లేదు ఈ లెక్కన మేము పడమటివైపున సిల్వర్ వాళ్లబోట్లు నిలిచిన రేవుకు చేరేటట్లున్నాము.

నాబలం యావత్తూ ఉపయోగించి చుక్కాని పట్టుకున్నాను. "కెప్టెన్! చుక్కాని నిలవటం లేదు. ఇంకొంచెం బలంగా తెడ్లు వెయ్యగలరా?" అని అడి గాను. కెప్టెన్, రెడ్రూత్ తెడ్లు వేస్తున్నారు. కెప్టెన్ అన్నాడు: "తెడ్డు ఇంక ఏమాత్రం గట్టిగా ఊపినా పడవ తల్లకిందులౌతుంది. ఇంకొంచెం సేపు చుక్కా నితో తంటాలు పడండి."

అంతవరకూ నేను మట్టికోట దిశగా చుక్కాని పట్టుకున్నాను. అందుచేత మా పడవని కెరటాలు పడ మటగా ఉన్న సిల్వర్ బోట్లకేసి తోసివేస్తున్నాయి. అదిచూసి కెప్టెను తూర్పుగా తిప్పమన్నాడు చుక్కానిని. వెంటనే బోటు తూర్పుగా ప్రయాణం సాగించింది.

"ఇట్లా అయితే మనం ఒడ్డు ఎంతసేపటికి చేరు కోలేమనుకుంటానండి," అన్నాను నేను.

ఫరవా లేదు. ఎక్కడో ఒక చోట ఒడ్డును సమీపించగలం. సిల్వర్ గాడి బోట్లదగ్గిరికి పోకుండా వుంటే చాలు ఒక వేళ మనం మట్టికోటకి దూరంగా చేరినా, ఒడ్డు వెంబడే పడవ నడిపి తేలిగ్గా అసలు చోటుకు వెళ్ళగలం," అని ఉపాయం చెప్పాడు కెప్టెన్.

"కెరటాలు తగ్గుతున్నాయి సార్, అప్పుడే," అన్నాడు అబ్రహాం గ్రే.

"మంచిది," అన్నాడు కెప్టెన్ తలవూపుతూ. గ్రేను మాతోవాడిగానే పరిగణించడానికి నిశ్చయించుకున్నాము.

హఠాత్తుగా కెప్టెన్ స్మాలెట్ అరిచాడు: "ఫిరంగి!"

నేనన్నాను: "ఫిరంగి ఏం ఫరవా లేదు. దాన్ని ఓడలోనుంచి ఊడదీయటం అసాధ్యం. ఒకవేళ ఊడదీసినా ఒడ్డుకి తీసుకురావటం, చెట్ల గుబురుల్లోంచి మన మట్టికోటదాకా తేసుకురావటం వాళ్ళ తరం కాదు." (ఓడలో బ్రహ్మాండమైన ఫిరంగి ఒకటుంది. దాంతో పేలిస్తే మా మట్టికోట దెబ్బ కెగిరిపోతుంది.)

"అది కాదు డాక్టర్! తిరిగిచూడండి వెనక్కి."

అందరం ఓడకేసి చూశాము. ఓడలో మిగిలిన అయిదుగురు ద్రోహులు ఫిరంగిని మా బోటుకేసి తిప్పటానికి ప్రయత్నిస్తున్నారు. ఒకడు మందు కూరుతున్నాడు. మేము వచ్చేటప్పుడు ఫిరంగి గుండ్లు, మందు ఓడలోనే వదలివేసి వచ్చాము.

ఆ తొందరలో వాటినికూడా సముద్రంలో పార వెయ్యాలని మాకు జ్ఞాపకం రాలేదు.

"కెప్టెన్ ఫ్లింట్ ఎప్పుడూ ఇజ్రాయెల్ హాండ్స్‌ని మెచ్చుకుంటూ ఉండేవాడు, ఫిరంగి చాలా బాగా పేలుస్తాడని" అన్నాడు అబ్రహాం గ్రే.

ఈలోగా మేము ఓడనుంచి చాలదూరం వచ్చేశాము. కాని ఫిరంగి పేల్చబడితే మాత్రం మేము నామరూపాలు లేకుండా ధ్వంసమవుతాము. ఈ ప్రమాదం గమనించి కెప్టెన్ స్మాలెట్ అడిగాడు:

"మనలో ఎవరు బాగా గురిపెట్టగలరు?"

"ట్రెలానీ!" అన్నాను.

"ట్రెలానీగారూ! దయచేసి మీరు నాకో ఉపకారం చెయ్యాలి. వాళ్లలో ఒకణ్ణి, వీలైతే ఇజ్రాయెల్ హాండ్స్‌ని పడగొట్టాలి," అన్నాడు కెప్టెన్.

ట్రెలానీ మారుమాట లేకుండా తుపాకీ తీశాడు

"జాగ్రత్తగా ఉండండి. ట్రెలానీగారు పేల్చే సమయానికి ఈ పక్కకి ఒరగండి. ట్రెలానీగారూ! తుపాకీ కాస్త దబాయించి పట్టుకోండి. పడవ ఏమాత్రం ఊగినా తలకిందు లవుతుంది," అని హెచ్చరించాడు కెప్టెన్.

కెప్టెన్ చెప్పినట్టే మేము ఒక పక్కకి ఒరిగి ఊపిరి బిగపట్టి నిరీక్షిస్తున్నాము. ఓడమీద ఫిరంగి మూతికి దగ్గరగా ఇజ్రాయెల్ నుంచునివున్నాడు.

అతని వెనక మిగతా వాళ్ళు నుంచున్నారు. ట్రెలానీ ఇస్రాయెల్ కేసి గురిచూసి తుపాకి పేల్చాడు. కాని వాడు ఆ సమయానికి నేర్పుగా వంగాడు. గుండు వెన కాల మనుషుల్లో ఒకడికి తగిలింది. వాడు నేల కొరి గాడు. ఓడమీదవున్న వాళ్లందరూ "బాబోయ్" అని ఒక్కసారిగా కేకలు వేశారు. ఆ కేకలను ప్రతిధ్వని స్తున్నట్లుగా సిల్వర్ పడవలు వున్న ప్రదేశంనుండి మిగతా కుట్రదారులందరూ కేకలు వేశారు. ఒడ్డున వున్న ఒక బోటులోకి కొందరు ఎక్కి మా పడవను వెంబడించడానికి ప్రయత్నిస్తున్నారుకూడాను. మిగతా వాళ్ళలో కొందరు ఒడ్డునే మా కేసి పరిగెత్తి వస్తు న్నారు. కాని వాళ్ళుగాని, కుట్రదారుల పడవగాని మమ్మల్ని సమీపించేలోగానే ఒడ్డు చేరుకోగలమనే ధైర్యం మాకున్నది. మా కింకా ప్రమాదకరంగా ఉన్నది హిస్పానియోలాలోని ఫిరంగి ఒక్కటే.

"ట్రెలానీగారూ! మరొకణ్ణి పడగొట్టాలి" అన్నాడు కెప్టెన్.

ట్రెలానీ మళ్ళీ తుపాకిఎత్తి గురిపెట్టాడు. ఈ సారి దెబ్బకు విద్రోహుల్లో ఎవరు కూలిపోయారో చూసే వ్యవధి లేదు మాకు. ఎందుకంటే తుపాకిపేలం గానే మా పడవ ఒక్క గంతువేసి మునిగిపోయింది. నేను, కెప్టెను కొంచెం జాగ్రత్తగా ఉండబట్టి నిల దొక్కుకోగలిగాము. మిగిలిన ముగ్గురూ బోటుతో

పాటు మునిగారు. కాని ప్రాణనష్టం ఏమీ జరగలేదు. బోటులో ఉన్న సామగ్రిమాత్రం నష్టమైంది.

రెండు బారలు యీదేసరికి కాళ్ళకు నేల అందింది పూర్తిగా తడిసిపోయి సాధ్యమైనంత వేగంగా ఒడ్డుకు వచ్చాము. ఒడ్డునే పరిగెత్తివచ్చి తిరుగుబాటు దార్లు మమ్మల్ని ఎదుర్కొనేలోగానే మట్టికోటను చేరుకోవాలని మా ఉద్దేశ్యం. వాళ్ళు అంతకంతకు మమ్మల్ని సమీపిస్తున్నారు. మట్టికోట ఇంకా డెబ్భయ్ ఎనభైగజాల దూరంలో ఉంది. ఒక వేళ ఈలోగానే వాళ్ళెదురుపడితే ఏం చెయ్యాలో మాకు తోచలేదు. నాదగ్గర, కెప్టెన్‌దగ్గర మాత్రమే తుపాకు లున్నాయి. ట్రెలానీ దగ్గర తుపాకీ ఉన్నది గాని అది తడిసిపోయి పనికిరాకుండా పోయింది అందుచేత ట్రెలానీ కెప్టెన్ తుపాకిని తీసుకున్నాడు. అబ్రహాంగ్రే దగ్గర ఏ ఆయుధమూ లేకపోవటం చూసి నా కత్తిని అతనికిచ్చాను. ఈవిధంగా సన్నద్ధులమై చెట్లను మరుగుగా చేసుకుంటూ మట్టికోటదిశగా నడవసాగాము.

## 18. మొదటి రోజు యుద్ధం

(డాక్టరు చెప్పిన కథ)

మరొక నలభై అడుగులు వెయ్యగానే చెట్ల గుబురు గుండా మా మట్టికోట కనిపించింది. అదే సమయంలో ఎడమ పక్కనుండి తిరుగుబాటు దార్లు మా కేసి పరుగెత్తుకు రావటం చూశాం. మమ్మల్ని చూడ

గానే అదిరిపడి ఎక్కడి వాళ్ళక్కడ ఆగిపోయారు. వాళ్ళు తేరుకునే లోపుగానే నేను, జమీందారు తుపాకులు పేల్చాము మాతోపాటు సమానంగా మట్టికోటలో నుంచి హంటర్, జోయిస్‌లు కూడా పేల్చారు. ఇన్ని కాల్పులకీ శత్రువుల్లో ఒకడు మాత్రం నేలకూలాడు. మిగతా వాళ్ళు వచ్చిన దోవనే కాలికి బుద్ధి చెప్పారు.

తుపాకీలు మళ్ళీ మందుతో నింపుకుని పడి పోయిన మనిషిని సమీపించాము. అప్పటికే వాడి శరీరం చల్లబడింది. మొదటి దెబ్బలోనే ఒకణ్ణి హతమార్చినందుకు సంతోషిస్తూ మళ్ళీ మట్టికోట కేసి నడిచాము ఇంతలో పొదలచాటున ఒక పిస్టల్ పేలింది. ఒక తూటా నా చెవిపక్కగా కుయ్యిన దూసుకుపోయింది. వెంటనే నేను జమీందారు పొదల వేపు తుపాకులు పేల్చాము. తరువాత పక్కకు తిరిగాము. శత్రువులు పేల్చిన తూటా వృద్ధ సేవకుడు టామ్ రెడ్రూత్‌కు తగిలింది. అతణ్ణి మోసుకుని మట్టికోటలో ప్రవేశించాము.

మేము దెబ్బకుదెబ్బ తియ్యటానికి సిద్ధంగా ఉన్నామని గ్రహించారు కాబోలు శత్రువులు మళ్ళీ ఆ పరిసరాలలో ముఖం చూపకుండా ఉడాయించారు. రెడ్రూత్‌కు పరిచర్యలు చేయటానికి మాకు కావలసినంత వ్యవధి లభించింది. పాపం అతని రోదనం వింటూంటే మాకు గుండెలు తరుక్కుపోయాయి.

గాయంనుండి రక్తం కాలువలుగట్టి కారుతున్నది. అతని నాడి పరీక్షించాను. ఇక నేను చేయదగినదేమీ లేదని, అనుకున్నాను.

మా కష్టాలు ప్రారంభమైంది మొదలు ఇప్పటి వరకూ ఆవృద్ధుడు ఒక్కసారైనా గొణగలేదు, సణగలేదు. ఏ పని చెబితే ఆ పని మారుమాట లేకుండా చేశాడు. పాపం ఇప్పుడు అందరికంటే ముందు అతని వంతు వచ్చింది.

అతనికి ఒక పక్క వేసి పడుకో బెట్టాము. ట్రెలానీ అతని పక్కన ముఖం కప్పుకుని కూర్చుని నిశ్శబ్దంగా ఏడుస్తున్నాడు. రెడ్రూత్ హీనస్వరంతో అడిగాడు:

"డాక్టరుగారూ! జమీందారుగారూ! నాకు సెలవిప్పిస్తారా?"

మే మెవ్వరం మాట్లాడలేదు. పొంగివచ్చే దుఃఖం ఆపుకుంటూ మౌనంగా చూస్తూనుంచున్నాం.

"ఆ వెధవల్లో ఒక్కణ్ణయినా పడగొట్టకుండా వెళ్ళిపోతున్నానే అని నాబెంగ," అన్నాడు రెడ్రూత్. మళ్ళీ కాసేపు నిశ్శబ్దం.

ట్రెలానీ ముఖంమీద చేతులు తీసేసి రెడ్రూత్ చేతులు పట్టుకుని,

"టామ్! నన్ను రక్షిస్తావా?" అని అడిగాడు.

"అదేమిటి బాబుగారూ! అంతమాట అనకండి. మీ ఉప్పు తిని బతికానిన్నాళ్ళూ. మీ ఒడిలో

నిశ్చింతగా చనిపోతున్నాను. ఇంతకంటే ఏం కావాలి నాకు?" అన్నాడు రెడ్రూత్.

ఈలోగా కెప్టెన్ స్మాలెట్ ఏమిటేమిటో సవరిస్తున్నాడు. పంట్లాం జేబుల్లోంచి రెండు యూనియన్ జాక్ జెండాలు తీశాడు. ఒక బైబిలు, ఒక మోకు, కలం, సిరాబుడ్డి, లోలెడు పొగాకు తీశాడు. ఒక జెండాను కర్రకు తగిలించి ఇంటి నసికక్కమీది కెక్కి అక్కడ కట్టివేశాడు. దాంతో అతనిమనస్సు కుదుట బడినట్లుంది. సంతృప్తితో కిందికి దిగివచ్చి రెడ్రూత్ పక్కన నుంచున్నాడు.

ఎవరన్నా బైబిల్ చదివితే బావుంటుందని రెడ్రూత్ కోరాడు బైబిల్‌లోని ప్రార్థనలు చదువుతుండగా రెడ్రూత్ సునాయాసంగా, నిశ్శబ్దంగా ఈలోకాన్ని విడిచిపోయాడు. కెప్టెన్ వెళ్లి రెండో జెండా తీసుకువచ్చి గౌరవపూర్వకంగా దాన్ని శవం మీద కప్పాడు. ట్రెలానీ శవం పక్కనే ఇంకా దుఃఖిస్తూ కూర్చున్నాడు. కెప్టెన్ అతన్ని ఊరడించ టానికిలా అన్నాడు :

"జమీందారుగారూ! మీరు దుఃఖించకండి. రెడ్రూత్ అదృష్టవంతుడు. ఇంత వృద్ధాప్యంలో కూడా మిమ్మల్ని అనుసరించి ఈ ఎడారి ద్వీపానికి వచ్చాడు. మీ సేవలోనే చనిపోయాడు. అతనికేం ఫరవాలేదు."

తరవాత కెప్టెన్ నన్ను అవతలకు పిలిచి చెప్పాడు :

"మనమిక్కడ ఎన్నిరోజులిల్లా పోరాడవలసి వస్తుందో తెలియదు. మన పడవలో అంత సామాను నీటిపాలు కావటం నిజంగా దురదృష్టమనే చెప్పాలి. మందు సామగ్రిపోయినా అంత ఇబ్బంది లేదు గాని, ఆహార పదార్థాలుకూడా నీళ్ళలో కలిసిపోవడం మనకు దెబ్బే. ఎంత కఠినంగా రేషనింగు పెట్టుకున్నా వారం పది రోజులకంటే ఈ నిలవలు ఎక్కువకాలం సరిపోవు. ఒకవిధంగా మనలో ఒకడైనా తగ్గిపోవడం మంచిదే అయింది."

ఇంతలో ఫిరంగిమోత మళ్ళీ వినిపించింది. ఓడ లోని వాళ్ళకు మాకోట శిఖరంమీది ఇంగ్లీషు జెండా శుభ్రంగా కనిపిస్తూ ఉండి ఉండాలి. దానికేసి గురిపెట్టి శత్రువులు ఫిరంగి పేలుస్తున్నారు. కాని మొదటిగుండు మాకోటనుదాటి దూరాన చెట్లలోపడి వ్యర్థమైంది.

"ఓహో! ఫిరంగి పేలుస్తున్నారే. పేల్చండి పందల్లారా! ఉన్న కాస్త మందుగుండు అయిపోయే దాకా అల్లాగే పేల్చండి," అన్నాడు కెప్టెన్ పళ్లు కొరుకుతూ.

ఫిరంగి రెండోసారి పేలింది. ఈసారి గురి అట్టే తప్పలేదు. గుండు మా ఆవరణలోకే ప్రవేశించి నేల మీద పడింది. అంతకంటే ప్రమాదమేమీ జరగలేదు.

"ఓడలోని వాళ్ళకు మన మట్టికోట కనిపించదు.

కాని మన జెండాను చూసి దానికేసి గురిపెట్టి కొడు తున్నారు. కనుక అపాయ మేమీ జరక్కముందే జెండాను లాగివెయ్యటం మంచిదికాదా?" అన్నాను కెప్టెన్‌తో.

"జెండాను తీసివెయ్యమంటారా? అసంభవం. ఛస్తే తీసెయ్యను." అని ఖచ్చితంగా జవాబుచెప్పాడు కెప్టెన్. అతని అభిప్రాయంతో మేమంతా ఏకీభవించాము. ఎందుకంటే, కోటపై ఎగరవేసిన యూనియన్ జాక్ మా ఆత్మగౌరవానికి చిహ్నం. అంతే కాకుండా, తిరుగుబాటుదార్ల ఫిరంగి బెదరింపులను మేము లెక్క చెయ్యటం లేదనటానికి కూడా మంచి నిదర్శనం. అందుచేత అది అక్కడ వుండటమే మంచిదని అంగీకరించాము.

ఆవిధంగా చీకటి పడేవరకూ ఓడలో వాళ్లు ఫిరంగి పేలుస్తూనే వున్నారు. ఫిరంగి గుండ్లలో ఒకటీ మా కోటలోకి చొచ్చుకురాలేకపోయింది. ఒక్కటీ మా జెండాను పడగొట్టలేకపోయింది. ఆవరణలో మాత్రం చాలాపడ్డాయి. ఒక్కొక్కగుండు పడినప్పుడల్లా ఒక ఇసుక తుపాను రేగినట్లయ్యేది. మేము లోపల కూర్చుని క్రికెట్ ఆటచూస్తున్నట్లు వినోదిస్తూ కూర్చున్నాం.

కెప్టెన్ స్మాలెట్ ఒకచోట కూర్చుని తనడైరీ పుస్తకం తీసి ఇలా వ్రాయసాగాడు.

"అలెగ్జాండర్ స్మాలెట్ — ఓడ కెప్టెన్;

డేవిడ్ లివ్‌సే—ఓడ డాక్టరు; అబ్రహాం గ్రే—కళాసీ; జాన్ ట్రెలానీ—ఓడ యజమాని; జాన్ హంటరు, రిచర్డు జాయిస్—యజమాని స్వంత నౌకర్లు; వీరు మాత్రమే తిరుగుబాటు నెదుర్కోటానికి మిగిలారు. పదిరోజులకు సరిపడే రేషన్లతో ఈరోజునే కాంచన ద్వీపం ప్రవేశించారు. మట్టికోటపై ఇంగ్లీషు జెండా ఎగరవేశారు. థామస్ రెడ్రూత్—యజమానిగారి సేవకుడు, తిరుగుబాటుదార్ల చేతిలో మరణించాడు; జేమ్సు హాకిన్సు—ఓడనౌకరు........."

ఇంతలో మట్టికోట కుడివైపునుండి కేకలు వినిపించాయి. ఎవరో గొంతెత్తి పిలుస్తున్నారు. సంజ చీకట్లలో ఎవరైనదీ కనిపించటం లేదు.

"డాక్టరుగారూ! జమీందారుగారూ! హల్లో, ఎక్కడుంది నువ్వేనా హంటర్?" అని కేకలు వినిపించాయి. జిమ్‌హాకిన్సు కంఠం గుర్తుపట్టాను. నేల మీద పాకుకుంటూ జిమ్ కోటలోకి ప్రవేశించాడు.

## 19. మళ్లీ మిత్రుల్లోకి.

(జిమ్ హాకిన్సు కథ)

బెన్‌గన్ బ్రిటిష్ జెండాను చూడగానే నన్ను చెయ్యి పట్టుకుని ఆపి "అదుగో! మీ స్నేహితు లక్కడ ఉన్నట్టున్నారు," అన్నాడు.

"తిరుగుబాటుదార్లు కాగూడదా?" అన్నాను.

"సిల్వర్ సంగతి మీకు తెలీదు. సముద్రపు దొంగలుతప్ప ఇక్కడికి ఇంకెవ్వరూ రారు. ఇల్లాంటి చోట దొంగల జెండా ఎగరెయ్యక యూనియన్ జాక్ ఎగరేస్తాడా సిల్వర్? వాళ్లు మీ స్నేహితులే. సందేహంలేదు. పోట్లాటకూడా ముమ్మరంగా జరుగుతోంది. మీ స్నేహితులే గెలుస్తున్నారనుకుంటాను. మట్టికోట బలేగా వుంటుంది లెండి. కెప్టెన్ ఫ్లింట్ చాలా గట్టిగా కట్టించాడు దాన్ని. ఫ్లింట్ బలే గొప్పవాడు లెండి. ఎంతెంత వాళ్ళనయినా గజగజ లాడించేవాడు ఒక్క సిల్వర్ని తప్ప. సిల్వర్, ఫ్లింట్ సమ ఉజ్జీలు."

"సర్లే. ఏ సోదివింటూ కూర్చోటానికి నాకు తీరిక లేదు. చప్పునపోయి మా వాళ్ళను కలుసుకోవాలి."

"కాదండి హాకిన్స్గారూ! మీతో వద్దామనుందిగాని భయం వేస్తోందండి. మీరు జమీందారు గారితో నాసంగతి తప్పకుండా చెప్పాలి. ఆయన సరే అంటేగాని నేను రాను. 'బెన్గన్ మీకో తమాషా చూపిస్తాడట' అని కూడా ఆయనతో చెప్పాలి. చెప్పి ఇల్లా కన్నుగీటాలి," అని బెన్గన్ కన్నుగీటి చూపించాడు.

"మీరు మళ్లీ నన్ను కలుసుకోవాలంటే ఇవ్వాళ నన్నెక్కడ చూశారో అక్కడికే రండి. మీరుకాక ఇంకెవరైనా వచ్చేట్లయితే ఆయన ఒంట

రిగా నే రావాలి. చేతిలో తెల్లటిగుడ్డ పట్టుకురావాలి. తెలిసిందాండి."

"జమీందారుగార్ని గాని, డాక్టరుగార్ని గాని చూడాలను కుంటున్నా వన్నమాట. వాళ్ళతో మాట్లాడాలను కుంటున్నా వన్నమాట అంతేనా?"

"అవు నండి."

"అయితే నేనిక వెళ్ళనా?"

"మర్చిపోరుగదూ? ఒక తమాషాఅని మాత్రం చెప్పండి. ఇదుగో మన్లో మనమాట—"

ఢామ్మని శబ్దంచేస్తూ ఒక ఫిరంగి గుండు మాకు వందగజాల్లో ఇసుకలోపడి దుమారం రేగింది. వెంటనే చేతులు విడిపించుకుని చెరోదిక్కుకు పారిపోయాము.

అక్కణ్ణించి ఒక గంటదాకా ఫిరంగి విరామం లేకుండా పేలుతూనే వుంది.

ఈ చెట్టునుంచి ఆచెట్టుకు, ఆ చెట్టునుంచి ఆచెట్టుకు అంగలువేస్తూ, ఫిరంగి గుండ్లు ఎక్కడ మీద పడతాయోనని హడిలిపోతూ తూర్పుగా సము ద్రం వైపు నడిచాను.

సూర్యుడు అస్తమించాడు. చెట్లమీదుగా సముద్రపు చలిగాలి వీవసాగింది. నెమ్మదిగా చీకట్లు అలుము కుంటున్నాయి. నేనీ పాటికి దాదాపు సముద్ర తీరం దాకా వచ్చాను. దూరంగా తెల్లరాళ్ల గుట్ట కనిపించింది. బెన్‌గన్ చెప్పిన తెల్లగుట్ట అదే అయి వుంటుంది. అక్కడే తనపడవ దాచానన్నాడు బెన్

గన్. ఎప్పుడన్నా అవసరమైతే ఆ పడవ వాడుకో వచ్చునని ఆ ప్రదేశం గుర్తు పెట్టుకున్నాను.

అప్పటికి ఫిరంగి కాల్పులు ఆగిపోయాయి. కనుక ఇక అపాయం లేదని వెనకనుండి నా మిత్రులున్న స్థలంవైపు నడిచాను మట్టికోట చేరగానే నా కేకలు విని డాక్టరుగారు, ఇతరులు ఎదురువచ్చి లోపలికి తీసుకుపోయారు.

నాకథంతా క్లుప్తంగా చెప్పాను. తరవాత చుట్టూ పరకాయించి చూసి పరిస్థితు లర్థం చేసుకున్నాను. రెడ్రూత్ శవం ఇంకా సమాధి చేయబడ లేదు. అబ్రహాం గ్రేకు కణతలమీద తగిలిన గాయం పచ్చి పుండై అతడొకమూల పడుకుని మూలుగుతున్నాడు.

కెప్టెన్ స్మాలెట్ మమ్మల్ని సోమరిగా కూర్చో నివ్వలేదు. రాత్రంతా మట్టికోటను కాపలా కాయవలసి ఉంటుందన్నాడు. మమ్మల్ని రెండు దళాలుగా విభజించాడు. నేను. డాక్టరుగారు, గ్రే ఒకదళం. జమీందారుగారు, హంటర్, జోయిస్ మరొకదళం. అందరం అలిసిపోయి వున్నాం. ఎవరికీ వంట్లో పీస మెత్తు ఓపికలేదు. కాని పడుకుని నిద్రపోతే పనులెల్లా జరుగుతాయి? కెప్టెన్ ఇద్దర్ని కట్టెలు కొట్టుకురావడానికి పంపించాడు. ఇద్దర్ని రెడ్రూత్ శవం పాతి పెట్టేందుకు గొయ్యి తవ్వమన్నాడు. డాక్టరుగారికి వంటపని అప్పగించాడు. నన్ను ద్వారంవద్ద గస్తీ

కాయమన్నాడు. తాను ఎవరికేది కావలిస్తే అది అందిస్తూ, అందరినీ ఉత్సాహపరుస్తూ తిరుగుతున్నాడు.

డాక్టరుగారు పొయ్యిదగ్గిర ఎప్పుడూ అలవాటు లేదుగావును పొగలో ఉక్కిరి బిక్కిరౌతున్నారు. ఉండుండి లేచి ఒకసారి అటూయిటూ పచార్లుచేసి మళ్లీ పని చేసుకుంటున్నారు. ఒక్కోసారి నాదగ్గిరికి వచ్చి కబుర్లుచెప్పి వెడుతున్నారు.

"జిమ్! స్మాలెట్ ఉన్నాడే నాకంటే, ట్రెలానీకంటే దిట్టమైనమనిషి. కెప్టెన్ అంటే అలా వుండాలి. ఎంత వ్యవహారజ్ఞానం, తెలివితేటలు ఉన్నాయో చూశావ్ అతనికి", అన్నారు డాక్టరుగారు,

ఇంకోసారి వచ్చి అడిగారు: "జిమ్! ఈ బెన్ గన్ నిజంగా మనిషేనా? లేక ఏదన్నా భూతమా?"

"ఏమోనండి నాకూ తెలియటంలేదు. మనిషో కాదో గాని పిచ్చివాడని మాత్రం అనుమానించవచ్చును," అన్నాను.

"మూడేళ్ల పాటు ఈ ఒంటరి ద్వీపంలో గోళ్లు గిల్లుకుంటూ కూర్చున్న మనిషి నీ లాగా, నాలాగా ఉండమంటే ఎల్లా ఉంటాడు. అన్నట్టు అతనికి జున్ను బాగా ఇష్టమని చెప్పావుగదూ?

"అవునండి."

"చూశావా, మనం అనుకోకుండానే ఒక్కోసారి మంచి పనులు చేస్తూంటాము. నాదగ్గిర వెండి

పొడుండబ్బా ఉందే, దాంట్లోంచి నేను పొడుంతీసి పీలుస్తుంటే ఎప్పుడన్నా చూశావు నువ్వు? చూడ లేదు ఎందుకంటే; దాంట్లోఉన్నది ముక్కుపొడుం కాదు; ఇటలీలో తయారైన జున్నుముక్క. ఎందుకో బుద్ధిపుట్టి దాన్ని అల్లా దాచాను. ఆజున్ను బెన్‌గన్ కిస్తాను."

రైఫూత్‌ను పాతిపెట్టాక భోజనాలు చేశాము. తలొకగ్లాసు బ్రాందీ తాగాము· తరవాత మా ముగ్గురు నాయకులు ఒకమూలచేరి చర్చలు సాగించారు.

మాదగ్గిరున్న ఆహారపదార్థాలు ఆట్టే రోజులు రావు. బయలు దేరేముందు జమీందారుగారు ఏర్పాటు చేసిన ప్రకారం ఇంగ్లండు నుండి మాకు రక్షణ వచ్చే వరకూ ఉన్న ఆహారాన్నే సరిపెట్టుకోవాలి. అది ఎలాగూ అసంభవం కనుక మాకు ఇక రెండే మార్గా లున్నాయి: తిండికి మాడి చనిపోనైనా చనిపోవాలి; లేక తిరుగుబాటు దార్లకు లొంగిపోవాలి. చివరకు ముగ్గురు నాయకులూ చర్చించి తేల్చిన దేమిటంటే తిరుగుబాటు దార్లలో వీలైనంత ఎక్కువమందిని హతం చెయ్యాలి. ఇప్పటికే వాళ్ళసంఖ్య పందొమ్మిది నుండి పదిహేను వరకూ దిగింది. మరిద్దరు గాయాలుతిని వున్నారు. ఓడమీద ఇజ్రాయెల్ హాండ్స్‌కు తగల వలసిన దెబ్బతగిలి పడిపోయినమనిషి చనిపోయాడో లేదో తెలియదు కాని వాడుకూడా లేనట్టేలెక్క.

ఆరాత్రి చాలాపొద్దు పోయేవరకూ ఓడమీద

శత్రువులు రమ్ తెగతాగి పాటలు పాడుకుంటూ, దెబ్బలాడుకుంటూ గడిపారు. మేము వంతుల ప్రకారం కాపలా కాశాము. నావంతు అయిపోయిన తర్వాత శుభ్రంగా పడుకుని నిద్రపోయాను. తెల్లవారుకట్ల నా మిత్రుల సందడితో లేచాను. "సంధిజెండా" అని ఎవరో అనడం వినిపించింది. "సిల్వర్ వచ్చాడండోవ్!" అని మరొకరు కేకవేశారు. నేను కళ్లు నులుపుకుంటూ లేచి గోడలోని రంధ్రంద్వారా బయటికి చూశాను. ఆవరణ అవతల ఇద్దరు నుంచున్నారు. ఒకడు తెల్ల జెండా ఊపుతున్నాడు. రెండోవాడు సిల్వర్. ఊత కర్ర చంకలో పెట్టుకుని మాకేసి చెయ్యి వూపుతూ ఠీవిగా నుంచుని వున్నాడు.

## 20. సిల్వర్ రాయబారం

ఇంకా పూర్తిగా తెల్లవారలేదు. చలికిఒళ్లు కొయ్య బారి పోతున్నది; వేళ్లుకొంకర్లుపోతున్నవి. పొగ మంచుకూడా ఇంకా దట్టంగా అలముకునే వున్నది.

గోడలోని కన్నాలలోంచి బయటికి తొంగి చూస్తున్న మమ్మల్ని చూసి కెప్టెన్ స్మాలెట్ లోపలికి పొమ్మని ఆజ్ఞాపించాడు. ఇందులో ఏదో మోసం వుందని అన్నాడు.

"ఎవరక్కడ? అని సిల్వర్‌ను చూస్తూ గద్దిం చాడు కెప్టెన్.

"సంధిజెండా" అని కేక వేశాడు సిల్వర్.

కెప్టెన్ మళ్ళీ వెనక్కి తిరిగి మాకేసి చూసి "డాక్టరుగారూ! మీరు ఉత్తరపువేపు గోడవద్ద నుంచొండి. జిమ్ తూర్పు వేపు, గ్రే పడమటి వేపు. మిగతావాళ్ళు తుపాకులు దట్టించండి. జాగ్రత్త?" అని ఆజ్ఞాపించాడు.

"సంధిజెండాతో నీకేం పని?" అని ప్రశ్నించాడు సిల్వర్‌ను.

సిల్వర్ పక్కన నుంచున్న అనుచరుడు సమాధాన మిచ్చాడు.

"కెప్టెన్ సిల్వర్ మీతో సంధి చేసుకోవాలనుకుంటున్నాడు"

"కెప్టెన్ సిల్వరా? అత డెవరో ఎరగనే. ఎవడు వాడు?" అన్నాడు కెప్టెన్ కోపంగా. "కెప్టెన్ట కెప్టెన్! చేసింది చాలక పైగా కెప్టెన్ పదవికూడానా?" అని నెమ్మదిగా గొణుక్కున్నాడు.

సిల్వర్ సమాధాన మిచ్చాడు:

"నేనే నండి, లాంగ్‌జాన్ సిల్వర్‌ను. ఈ కుర్రాళ్ళంతా కలిసి వద్దంటున్నా నన్ను కెప్టెన్ని చేశారండి. మీరు పారిపోయిన తరవాత హిస్పానియోలాకు ఒక అధికారి అంటూ ఉండాలి గదండీ. అందుకని — మనం సంప్రదింపులు ప్రారంభించే ముందు మీరొక వాగ్దానం చెయ్యాలండి సార్.

మమ్మల్ని ఇక్కణ్ణుంచి క్షేమంగా పోనివ్వాలండి. ఏమంటారు?"

"సిల్వర్! నీలాంటి విశ్వాస ఘాతకుడితో రాజీ సంప్రదింపులు చేసేటంత ఓర్పు లేదు నాకు. చెప్పేదేదో రెండుముక్కల్లో చెప్పెయ్. మేము మిమ్మల్నేమీ చెయ్యము. మీరుమాత్రం ఏదన్నా మోసం తలపెట్టా రంటే ఊరుకోము," అన్నాడు కెప్టెన్ స్మాలెట్.

"చచ్చా! మీలాంటి పెద్దమనుషుల దగ్గిర అల్లాంటి పాడుపనులు చేస్తాముటండీ. మీరు మాటిచ్చారు; అది చాలు నాకు." అంటూ సిల్వర్ ఆవరణ చుట్టూవున్న కంచెను లంఘించి లోనికివచ్చాడు. అతని అనుచరుడు "వెళ్లవ"ద్దని ఆపబోయాడు కాని 'భయం లేదులే' అన్నట్టు సిల్వర్ వాణ్ణి వీపుమీద తట్టాడు. సిల్వర్ అంత ధైర్యంగా శత్రువులమైన మమ్మల్ని సమీపించటం నాకు అచ్చెరువు గొలిపిందనక తప్పదు.

సిల్వర్ మట్టికోట ద్వారం సమీపించి చాల మర్యాదగా కెప్టెన్‌కు సెల్యూట్ చేశాడు.

"అక్కడేకూర్చో," అని ఆజ్ఞాపించాడు కెప్టెన్.

"బయట చాలా చలిగా వున్నదండి. లోపలికి వచ్చి కూర్చుంటాను," అన్నాడు సిల్వర్ నవ్వుతూ.

కెప్టెన్ ముఖం చిట్లించాడు: "సిల్వర్! నువ్వు సజావుగా ప్రవర్తించివుంటే మాకున్న సదుపాయాలన్నిటినీ నీతో పంచుకునే వాళ్లం. ఉహూ—నువ్వు

కెప్టెన్ సిల్వర్‌వి గదూ — నీలాంటి గొప్పవాడికి సత్కారం చెయ్యగలమా మేము?"

"సరేపోనీండి, ఇక్కడే కూర్చుంటాను. అని సిల్వర్ అక్కడే ఇసకలో చతికిలపడ్డాడు. "చాలా బావుందండి. ఇక్కడ. అదృష్టవంతులు మీరు— మాకంటే ముందే సంపాదించారు మట్టికోటను. ఓ— జిమ్ కూడా ఉన్నాడే. హాలో జిమ్! కులాసాగా వున్నావా? డక్టరుగారూ! నమస్కారా లండి. మీ అందర్నీ చూస్తుంటే సంతోషంగా ఉందండి. కులాసాగా ఒక కుటుంబంలో వాళ్లలాగా వున్నారు," అని సోదిగా మాట్లాడసాగాడు సిల్వర్.

"నువ్వు చెప్పదలచుకున్న దేదో త్వరగా చెప్పు," అని గద్దించాడు కెప్టెన్ స్మాలెట్.

"అరెరె. తొందరపడతా రేమిటండి స్మాలెట్ గారూ! కిందటిరోజు యుద్ధంలో మీరే గెల్చారని ఒప్పుకుంటాను. ఒప్పుకోకతప్పదు కనక ఒప్పుకుంటాను. ఎందుకంటే మావాళ్లకి కాస్త వణుకు పుట్టినట్లుంది. నాకూడా వణుకు పుట్టిందేమో తెలియదు. ఏమైనా మీతో రాజీబేరాలు ఆడదామనే వచ్చాను. అసలు మా రహస్యం మీరు కనిపెట్టారని నాకు తెలియలేదు గాని, ఏమాత్రం ముందు తెలిసినా, తస్సదియ్యా, మిమ్మల్ని ఒక ఊపు ఊపేవాణ్ణి."

"ఇంతకీ ఏమిటీ?—" అన్నాడు కెప్టెన్.

"ఏమీ లేదు. ఫ్లింట్ డబ్బు మాక్కావాలి. ఆకాశం విరిగిపడ్డా ఆ డబ్బును మేము కొట్టెయ్యదలుచుకున్నాం. మీకు ప్రాణాలపై తీపివుంటే మాతో రాజీకి రండి. మీ దగ్గరొక పటంవుంది కదూ?"

"ఉంటేఉండచ్చు. లేకపోతే లేకపోనూవచ్చు—"

"మీ దగ్గర ఆ పటం వుందన్న సంగతి నాకు తెలుసు. మా కాపటం ఇచ్చెయ్యండి. అదీ నేను కోరేది."

"సిల్వర్! నిన్ను గడ్డిపోచకింద పరిగణిస్తున్నాను. తరవాత నీయిష్టం," అంటూ కెప్టెన్ స్మాలెట్ తీరిగ్గా తన పొగాకుపైపు నింపుకోసాగాడు.

కెప్టెన్ స్వరంలోని కఠినధోరణి గమనించి సిల్వర్ వెంటనే ఏమీ మాట్లాడలేకపోయాడు. తనుకూడా జేబులోంచి పైపు తీసి పొగాకు నింపుకుని అంటించాడు. ఇద్దరూ తాపీగా పైపులు కాలుస్తూ ఒకళ్ల మొహాలు ఒకళ్లు చూసుకుంటూ, మధ్యమధ్య, ముందుకు వంగి ఉమ్ములువేస్తూ గడిపారు. కొన్ని నిమిషాల తర్వాత సిల్వర్ ప్రారంభించాడు:

"స్మాలెట్ గారూ! మళ్ళీ చెబుతాను వినండి. పటం మాకు స్వాధీనం చెయ్యండి. మా కుర్రాళ్ళను తుపాకులతో కొట్టడం మానెయ్యండి. డబ్బు మేమే తవ్వి ఎత్తుకుంటాము. అదంతా ఓడలోకి చేర్చిన తర్వాత, మిమ్మల్ని కూడా ఓడలోకి ఎక్కించుకుంటాము. క్షేమంగా ఏదో దేశంలో దింపుతాము.

అక్కణ్ణించి మీరు ఇంగ్లండుకు ఎల్లా చేరుకున్నా సరే. అసలు నేను మంచివాణ్ణి కనుక మిమ్మల్ని ఓడలో తీసుకుపోతా నంటున్నాను. మావాళ్లు అందుకు ఒప్పుకోక పోవచ్చు. అల్లాగైతే మీ రీ ద్వీపంలోనే ఉండి పోవలసి వస్తుంది. కాని ఒక సహాయం మాత్రం చేస్తాను. మాకు కనిపించిన మొదటిఓడను ఆపి వాళ్ళతో మాట్లాడి మీకోసం దాన్ని ఇక్కడికి పంపించగలను. ఏమంటారు? నేను చెప్పేదాంట్లో బేసబబు ఏమన్నా వుందా? నామాటలు లోపలవాళ్ళంతా వింటున్నా రనుకుంటున్నాను. ఒకరితో చెబితే అందరితో చెప్పి నట్టే. నేను చెప్పింది నచ్చినవాళ్ళ నెవరైనా మాలోకి తీసుకోవడానికి సిద్ధంగా ఉన్నాను," అని గొంతు హెచ్చించి చెప్పాడు సిల్వర్.

కెప్టెన్ స్మాలెట్ లేచి నుంచుని పైప్‌లోని బూడిద దులుపుకున్నాడు.

"అంతేనా?" అని అడిగాడు.

"అంతే. ఇదేఆఖరుమాట. ఒప్పుకోకపోయూరా తన్పదియ్యా, ఈ మట్టికోటతో సహా మిమ్మల్నందర్నీ ధ్వంసం చేసిందాకా నిద్రపోను."

కెప్టెన్ సౌమ్యంగా ఇలా హెచ్చరించాడు:

"సరే. నేను చెప్పేది విను. మీరంతా ఒకళ్ళ తర్వాత ఒకళ్లు చేతిలో ఆయుధ మేమీ లేకుండా ఇక్కడికి వచ్చినట్లయితే సంకెళ్ళు వేసి బంధించగలనని వాగ్దానం చేస్తున్నాను. ఓడలో అందర్నీ ఇంగ్లండు

తీసుకుపోతాను. అక్కడ కోర్టులో విచారణ జరిపించి అందర్నీ ఉరి తీయించినదాకా నిద్ర పోననికూడా వాగ్దానం చేస్తున్నాను. ఈ పద్ధతి మీ కిష్టంలేకపోతే మీగతి నక్కలకీ కుక్కలకీ ఎరుక. మీరు ఎన్ని రోజులు వెదికినా డబ్బు పట్టుకోలేరు. మీలో ఒక్కడికీ ఓడ నడిపించటం తెలియదు. అసలు మీరు మాతో యుద్ధమే చెయ్యలేరు. గెలుపు మాదే. ఇక పో. ఈ ప్రాంతంలో మళ్లీ నీ ముఖం కనిపించిందంటే నీ రెండు గుడ్లల్లోకీ రెండు గుండ్లు గురిచూసి వదులుతాను. ఏం బావుందా నే చెప్పింది? ఇవే నా ఆఖరి మంచిమాటలు. ఊఁ. లే. వెనక్కి తిరుగు. కుంటి కాలు ఆడించుకుంటూ పరుగెత్తు."

కెప్టెన్ స్మాలెట్ యిచ్చిన ఈ ఉపన్యాసంతో సిల్వర్ అవతారం పూరిగా మారిపోయింది. మొహంలో కత్తివాటుకి నెత్తురుచుక్క లేదు. పైప్ బూడిద దులుపుకున్నాడు. లేవబోతూ, 'కాస్త చెయ్యి అందివ్వండి" అన్నాడు.

"నేనా? ఛీకా? ఫో అవతలికి," అని కసిరాడు కెప్టెన్.

"ఏయ్ లోపలున్నవాళ్లూ! ఎవరన్నా వచ్చి నాకు చెయ్యి అందిస్తారా?" అని గర్జించాడు సిల్వర్. మే మెవ్వరం కదల్లేదు.

తనలో తను పరమబూతులు తిట్టుకుంటూ దొంగల నాయకుడు ఇసుకలో పాకుతూ కంచెవరకూ

వెళ్లాడు. కంచె పుచ్చుకుని లేచి అక్కడ వదిలిపెట్టిన ఊతకర్రను తిరిగి పుచ్చుకున్నాడు. ఒక్క ఉదుటున అవతలికి లంఘించి మాకేసి తిరిగి,

"తస్సదియ్యా! మిమ్మల్నందర్నీ ఊచకోత కోయిస్తా. నవ్వండి అల్లాగే నవ్వండి. రేపీ పాటికి మీాలో ఒక్కణ్ణికూడా మిగలనివ్వను," అంటూ అతి వేగంగా చెట్ల గుబురులోకి నడిచి తన అనుచరుడితో సహా మాయమయ్యాడు.

## 21. రెండోరోజు యుద్ధం

సిల్వర్ పోకడను జాగ్రత్తగా గమనిస్తున్న కెప్టెన్ అతడు కనుచూపు దాటిపోగానే వెనక్కి తిరిగాడు. అతడు మొదట ఆజ్ఞాపించిన ప్రకారం మాలో ఎవ్వరం ఉండవలసిన చోట్ల లేము—ఒక్క అబ్రహాం గ్రే తప్ప. కెప్టెన్‌కు మామీాద కోపం రావటం మొదటిసారిగా చూశాను.

"పొండి, ఎవరి చోట్లలో వాళ్లు ఉండండి. ట్రెలానీగారు! మీా ప్రవర్తన ఆశ్చర్యకరంగా ఉంది. లివ్‌సేగారూ! మీారు వైద్యులు. మీారుకూడా ఇల్లా క్రమశిక్షణ మర్చిపోతా రనుకోలేదు. అబ్రహాం గ్రే! నువ్వొక్కడివే నిజమైన కళాసీవి. నీ పేరు నా డైరీలో రాసుకుంటాను."

కెప్టెన్ వెనక్కి తిరగ్గానే మేము ఎవరి వోట్లకు వాళ్లం పోయి నుంచున్నాము. సిల్వర్ రాయబార సంప్రదింపులను వినే కుతూహలంలో మేము మాకు తెలియకుండానే వచ్చి కెప్టెన్ వెనక నిలబడ్డాం. మేము మాస్థానాల్లోకి మళ్లీ పోయి నుంచోటం చూసి కెప్టెన్ సంతృప్తితో అన్నాడు:

"సిల్వర్ రాయబారం మీరు విన్నారు. ఇంక కాసేపట్లో మళ్లీ పోట్లాట ప్రారంభం కావచ్చును. వాళ్ళకి సంఖ్యాబలం ఉన్నమాట నిజమే. కాని మనకి మట్టికోట రక్షణ వున్నది.

మనం గనక క్రమశిక్షణ చెడకుండా నిలబడి నట్లయితే శత్రువులను దుమ్ము చెయ్యగలమని నాకు నమ్మకమున్నది."

తరవాత కెప్టెన్ నలుపక్కలా తిరుగుతూ మట్టి కోటను పరీక్షించాడు. తూర్పు, పడమర వేపు గోడ లకు రెండేసికన్నాలు మాత్రమే ఉన్నాయి. దక్షిణపు గోడకు ద్వారంగాక మరి రెండు కన్నా లున్నాయి. ఉత్తరపు గోడకు అయిదు కన్నాలున్నాయి. మా ఏడుగురికీ మొత్తం ఇరవై తుపాకులున్నాయి. ఇంటి మధ్యలో కర్రల బల్ల వున్నది. దానిమీద తుపాకులను పేర్చాము. ప్రతి గోడవద్దను కూడా అలాంటి బల్ల లున్నాయి. వాటిమీద కూడా తుపాకులను, కత్తులను రెడీగా అమర్చాము.

"చలిమంట ఆర్పివెయ్యండి. సూర్యుడు బాగా పైకొచ్చాడు. మన కళ్ళకి యీ పొగ అడ్డంకూడా ఎందుకూ?" అన్నాడు కెప్టెన్. నన్ను చూసి "జిమ్! నువ్వు ఏమీ తిన లేదల్లే వుంది. నీ ప్లేటు తీసుకుపోయి నీ చోటులోనే కూర్చుని తిను. జాగ్రత్త! తిండిలో పడి బయటికి చూడటం మరిచిపోయేవు. ఏక్షణాన్నైనా చెట్ల లోంచి తుపాకి గుండ్లు రావచ్చును. హంటర్! అంద రికీ తలొక గ్లాసు బ్రాందీ అందించు," అని కెప్టెన్ ఆజ్ఞాపించాడు.

"డాక్టర్! మీరు ద్వారంవద్ద నిలబడండి. గోడ చాటున మాత్రమే వుండండి గాని బయటికి కనిపించ కండి. హంటర్! నువ్వు తూర్పున కాపలా కాయ్. జాయిస్ నువ్వు పడమటి గోడవద్ద. ట్రెలానీగారూ! మాలోకల్లా మీరే తుపాకీవిద్యలో సమర్థులు. మీరూ, గ్రే ఉత్తరపు గోడను రక్షించండి. జాగ్రత్త! ఆవేపున అయిదు కన్నాలున్నాయి. శత్రువులు ఆగోడను సమీ పించారంటే మన పని ఆఖరు. మన గోడలోనుండి మననే రాలగొడతాను. జిమ్! నువ్వూ నేను తుపాకీలకి దణ్ణం పెట్టవలసినవాళ్లమే కాబట్టి ఖాళీ తుపాకీలు నింపి వీళ్ళకి అందిస్తూ ఉంటమే మనపని."

కెప్టెన్ అపరిమితోత్సాహంతో ఇలా ఆజ్ఞ లిస్తోంటే మాకూ్కడా ఆ ఉత్సాహం వ్యాపించింది. ఓ మహాయుద్ధంలో పాల్గొంటున్నంత ఉత్సాహంతో నిలబడ్డాం.

ఒక గంట గడిచింది. ఎంతసేపటికీ శత్రువు దర్శనం కాకపోయేసరికి మాకు విసుగుపుట్టింది. ఆవలిస్తూ బయట చెట్లమీద పక్షులకేసి చూస్తూ ఎంతసేపు గడపగలం. ఇంతలో జాయిస్ అతి అమాయకంగా అడిగాడు:

"కెప్టెన్! ఎవడన్నా కనిపిస్తే పేల్చమంటారా?"

మాకా ప్రశ్నకు నవ్వు వచ్చింది. కెప్టెన్ నవ్వును పెదవులనుండి తొలగించుకుంటూ సమాధానమిచ్చాడు:

"పేల్చటానికే నీ చేతులో ఆ తుపాకీ. దాంతో ఫిడేలు వాయిద్దామనుకుంటున్నావా?"

"సరేనండి సార్," అన్నాడు జాయిస్ అంతే అమాయకంగా. జాయిస్ మాటతో మళ్ళీ అందరికీ ఉత్సాహం వచ్చింది. కొన్ని సెకన్లు ఊపిరి బిగపట్టి నిరీక్షించాము. హఠాత్తుగా జాయిస్ తుపాకి పేల్చాడు. వెంటనే చెట్ల చాటునుండి టపటప తుపాకులు పేలి గోడలకు చాల గుండ్లు కొట్టుకున్నాయి. ఒక్కటీ లోపలికి రాలేదు. పొగ చెదరిపోగానే చూశాము; కాని చెట్లలో ఒక్కడుకూడా కనిపించలేదు. మళ్ళీ నిశ్శబ్దం ఆవరించుకుంది.

"ఒకణ్ణన్నా కొట్టావా?" అడిగాడు కెప్టెన్.

"లేదనుకుంటానండి," అన్నాడు జాయిస్.

"జిమ్! జాయిస్ కింకో తుపాకీ యిచ్చి ఖాళీ తుపాకి నింపు. డాక్టర్! మీ వైపున ఎందరున్నా రను కుంటున్నారు?"

"ముగ్గురు మూడుసార్లు మెరుపు కనిపించింది; మూడు తూటాలు ఈవైపు పడ్డాయి," అన్నారు డాక్టరుగారు.—

"ముగ్గురా? మీ వైపున ఎందరండి ట్రెలానీ గారూ?"

కాని ఉత్తరపువైపున ఎందరు కేంద్రీకరింప బడిందీ అంత తేలిగ్గా లెక్కకట్టటానికి వీల్లేకపోయింది. జమీందారుగారి లెక్కప్రకారం ఏడుగురు; గ్రే లెక్క ప్రకారం ఎనిమిదిమందో, తొమ్మిదిమందో. తూర్పు పడమరల ఒక్కొక్క శత్రువే ఉన్నట్లు తేలింది. కనుక ఎక్కువమంది ఉత్తరపు దిక్కున కేంద్రీకరింప బడ్డారనీ, ఆవైపునే యుద్ధం ముమ్మరంగా జరగవచ్చనీ భావించాము. ఆ దిక్కును జాగ్రత్తగా రక్షించాలని, తిరుగుబాటుదార్లు ఏ ఒక్క కన్నం స్వాధీనపరుచు కున్నా, లోపలివాళ్లపని ఆఖరేనని కెప్టెన్ హెచ్చ రించాడు.

ఇంతలో ఉత్తర దిశనున్న వృక్ష సమూహం నుండి కొందరు తిరుగుబాటుదార్లు వెర్రికేకలు వేసు కుంటూ, చెంగు చెంగున ఎగురుతూ మట్టికోటకు అభిముఖంగా రాసాగారు. అదే సమయంలో డాక్టరు

గారున్న దిశనుండి తుపాకి తూటాలు వచ్చి ఆయన చేతిలోని తుపాకిని తుత్తునియలు చేశాయి.

జమీందారుగారు, గ్రే మరల మరల తుపాకీలు కాల్చారు. ముగ్గురు దెబ్బతిని నేల కొరిగారు. పడినవారిలో ఒకడు లేచి తూల్చూ వెనక్కి పారిపోయాడు. మిగతా నలుగురు కంచెదాటి ఆవరణలో ప్రవేశించారు. చెట్ల చాటునుండి తుపాకులు పేలుస్తున్నవాళ్లు ఈ నలుగుర్నీ ఉత్సాహపరుస్తూ అరుస్తున్నారు.

తండేలు జాబ్ ఆండర్సన్ తలకాయ కనిపించింది. "పేల్చండిరా, వీళ్ళ పని పట్టాలి," అని అరిచాడు. మరుక్షణంలో ఒకడు హంటర్ చేతులో నుండి తుపాకి లాక్కొని దాని మడమతో అతన్ని కొట్టాడు. ఇంకొకడు ఇంటిచుట్టూ పరిగెత్తి ద్వారం వద్దకువచ్చి కత్తితో డక్టరుమీద కలబడ్డాడు.

మా పరిస్థితి క్షణంలో తారుమారైంది. ఒక నిమిషం కిందవరకూ మా స్వాధీనంలోవున్న మట్టికోటలోకి శత్రువులు ప్రవేశించి మమ్మల్నే తరుముతున్నారు.

"బయటికి పదండి అవతలికి పోయి వాళ్ళతో పోరాడండి. కత్తులు తీసుకోండి," అని కెప్టెన్ అరిచాడు.

కత్తుల కట్టనుండి ఒకటి లాగి పట్టుకున్నాను. అప్పుడే ఇంకొక రెవరో ఇంకొక కత్తి లాగారు. లోపల

తుపాకుంపొగ దట్టంగా అలుముకున్నందున మరి మనిషి కనిపించడం లేదు. నేను బయటికి పరిగెత్తాను. నన్నెవరో వెంటాడుతున్నారు. ఎదురుగా డాక్టరుగారు కత్తి ఝుళిపిస్తూ, తనపైకి ఉరికిన శత్రువును తరుముతున్నారు. చివరి కాయన కొట్టిన దెబ్బకి వాడు మట్టికోట వెనక గల దిబ్బపైనుండి దొర్లుకుంటూ దొర్లుకుంటూ కిందకి పడిపోయాడు,

ఇంతలో నన్ను తండేలు జాబ్ ఆండర్సన్ ఎదిరొక్కన్నాడు. నన్ను చూడగానే సింహనాదంచేసి, కత్తి పైకెత్తాడు. నేను తప్పించుకొనే ప్రయత్నంలో పక్కకి దూకి, కాలుజారి దిబ్బనుండి సరాసరి కిందకి దొర్లుకుంటూ పోయాను.

అదృష్టవశాత్తు ఆండర్సన్ నన్ను వెంబడించకుండా అబ్రహాం గే అడ్డుపడి వాణ్ణి ఒక్క వేటులో వధించాడు. మరొక తిరుగుబాటుదారును తుపాకి పేల్చి చంపాడు. డాక్టరుగారు తన నెదిరొక్కన్న శత్రువును పరలోకానికి సాగనంపారు.

ఇదంతా కొద్ది నిముషాల్లో జరిగిపోయింది. చివరికి పొగ తేలిపోయినతర్వాత చూడగా విజయం మా పక్షాన్నే వరించినట్లు స్పష్టపడింది. కాని ఆ విజయం ఏ ఖరీదుకు లభించిందో గ్రహించగానే మా మనస్సులెంత బాధపడ్డాయో చెప్పలేను. నమ్మిన బంటు జాయిస్ చచ్చిపోయాడు. హంటర్ తలమీద బలమైన గాయం తగిలి స్మృతి తప్పిపోయాడు కెప్టెన్

కూడా ఆ దేస్థితిలో జమీందారుగారి చేతుల్లో వాలి పోయి వున్నాడు.

"కెప్టెన్‌కు బాగా దెబ్బతగిలింది," అన్నారు ట్రిలానీగారు. ఇంతలో కెప్టెన్ స్మృతి కోలుకొని లేచి "వాళ్ళంతా పారిపోయారా?" అని ఆదుర్దాగా అడిగాడు.

"ఆ. పారిపోగలిగినవాళ్ళంతా పారిపోయారు. అయిదుగురు మాత్రం ఇక ఎప్పటికీ పారిపోలేరు," అన్నారు డాక్టరుగారు.

"అయిదుగుర్ని వధించామా? ఓ, చాలు ఇవాళ్టికి అది ఫరవాలేదు. మొదట్లో వాళ్ళు పంధొమ్మిదిమంది, మనం ఏడుగురం. ఇప్పుడు వాళ్ళు తొమ్మిదిమంది మనం ఆరుగురం."

# 22. నా రెండో సాహసం

వాళ్ళీ ఆరోజున శత్రువుల బాధ మాకు తగల్లేదు. ఆరోజల్లా ఒక తూటాకూడా పేల్చ బడలేదు. మట్టికోట మా స్వాధీనంలోనే వున్నది. మా సామగ్రి యావత్తూ చెక్కు చెదరకుండా ఉన్నది. గాయపడిన వారికి చికిత్స చేయటానికి, వంట వండుకోటానికి తగినంత వ్యవధి లభించింది. వంట సరంజామా అంతా బయటికి చేరేసి నేను, జమీందారుగారు వంట ప్రారంభించాము.

ఆరోజు యుద్ధంలో గాయాలుతిన్న ఎనిమిది మందిలో అయిదుగురు అప్పుడే చనిపోయారు. మిగతా వారిలో ఒకడు తిరుగుబాటుదారు. వాడికి డాక్టరుగారు శస్త్ర చికిత్స చేస్తుండగానే గుటుక్కు మన్నాడు. మరొకడు మా హంటర్. అతడు ఆరోజల్లా బాధపడి బాధపడి సాయంత్రానికి ప్రాణాలు వదిలాడు. ఇక మిగిలినవాడు మా కెప్టెన్ స్మాలెట్: ఆయనకి దెబ్బలు తగలడం బాగానే తగిలాయిగాని ప్రాణ ప్రమాదకరంగా తగల్లేదు. ఒకతూటా బుజంలోనుంచి దూసుకుపోయింది. మరొకటి ఎడమకాలికి తగిలింది. తప్పక నయమవుతుందని డాక్టరుగారు ధైర్యం చెప్పారు; కాని కొన్ని వారాలపాటు ఆయన కదలటానికి, నడవటానికి వీల్లేదని అన్నారు.

భోజనాలైన తరవాత డాక్టరుగారు, జమీందారుగారు కెప్టెన్ పక్కవద్ద కూర్చుని చాలాసేపు ఏవేవో చర్చలు జరిపారు. చివరికి డాక్టరుగారు లేచి టోపీపెట్టుకుని జేబుల్లో పిస్టళ్లు, నడుముకు కత్తి పెట్టుకున్నారు. చొక్కా జేబులో కాంచన ద్వీపపటం దాచుకున్నారు; పెద్దతుపాకిని బుజంమీద ఆనించుకుని ఆవరణదాటి నడిచి చెట్లలో మాయమయ్యారు.

ఇదంతా నేనూ, గ్రే ఒకచోట కూర్చుని చూస్తున్నాము. డాక్టరు ఒంటరిగా అవతలకు పోవటం చూసి గ్రే ఆశ్చర్య చకితుడై నోట్లోంచి తీసిన పైప్

మళ్ళీ నోట్లో పెట్టుకోవడం మరిచిపోయి అలాగే చూడసాగాడు.

"డక్టరు లివ్‌సే గారికి పిచ్చెక్కిందా?" అన్నాడు.

"కాదు, కాదు. ఆయన బెన్‌గన్‌ని చూడ టానికి వెళుతున్నారనుకుంటాను," అని సమాధాన మిచ్చాను. నా ఊహ రైటేనని తరవాత తెలిసింది.

ఈలోగా మట్టికోట యావత్తూ అట్టుడికి నట్టు ఉడికి పోతోంది. ముచ్చెమటలు పోసి, అక్కడ ఉండటం దుర్భరంగా వుంది. డక్టరుగారు చల్లని చెట్లనీడలో, సముద్రపుగాలిలో అలా షికారుకు వెళుతుంటే నాకు ఆయనమీద ఈర్ష్య పుట్టింది. అదీకాక నాకు భోజన పాత్రలు తోమి శుభ్రం చేసే పని, నేల శుభ్రం చేసేపని అప్పగించారు. ఆపని చేస్తున్నంతసేపూ నాకు డక్టరుగారి మీద ఈర్ష్య, ఇక్కణ్ణించి దాటుకు పోవా లనే ఆసక్తి ప్రబలం కాసాగాయి. నేల ఊడుస్తూ ఊడుస్తూ బిస్కట్ల సంచీని సమీపించాను. ఎవరూ చూడకుండా రెండు జేబుల్లోను బిస్కట్లు నింపు కున్నాను.

నేను చేసేపని అతి సాహసం, తెలివి మాలిన తనం అని స్పష్టంగా తెలుసు. అయినా అలా చెయ్య కుండా ఉండలేకపోయాను. ఏదన్నా అవాంతరం వస్తే రక్షణకోసం రెండు పిస్తోళ్లు, తూటాలు నింపుకుని జాగ్రత్త పడిచాను. మరికొన్ని తూటాలు, మందు

కూడ జేబుల్లో పెట్టుకున్నాను. నా ఉద్దేశ్యమేమి టంటే ద్వీపం తూర్పుగట్టునవున్న తెల్లగుట్టకు వెళ్ళి అక్కడ బెన్‌గన్ చెప్పిన పడవవున్నదో లేదో చూడా లని. ఇదేమంత అత్యావసరమైన పనికాదు. ఆ పడవ అక్కడఉన్నా లేకపోయినా కొంప మునిగేదేమీ లేదు. కాని నేను పికారు పోవటానికి ఏదో ఒక నెపం వుండలిగా. అందుచేత ఈ పని పెట్టుకున్నా నేను సమాధాన పరుచుకున్నాను. కెప్టెన్‌తోగాని, త్రెలానీ గారితో గాని చెబితే కదలనివ్వరని "ఫ్రెంచి లీవ్" పుచ్చుకుని పోవాలని నిశ్చయించాను.

చివరికి మంచి అవకాశం దొరికింది త్రెలానీ గారు, గ్రే కెప్టెన్ వద్ద కూర్చుని కట్లు వదులైతే మళ్ళీ కడుతున్నారు. ఆ పనిలో మునిగి వాళ్లు నన్ను మరిచి పోయారు. ఇదే సమయమని నేను అవతలికి దాటాను. నేను చేస్తున్న పని తప్పని అడుగడుగునా మనసు పీకు తూనే వుంది. మట్టికోటలో వున్నదే ముగ్గురు. అందులో ఒకరు లేవలేని స్థితిలో వున్నారు. అలాం టప్పుడు నేను చెప్పకుండా పోవటం తప్పు కాదా? కాని చిన్నవాణ్ణి నేను వుండిమాత్రం చెయ్యగలిగిన దేమిటిలే అని సమాధాన పరుచుకుని బయలుదేరాను.

తూర్పుదిశగా నడిచాను. కుడిచేతివైపుగా సము ద్రంలో కొంతదూరాన హిస్పానియోలా తరంగాలకు ఉయ్యాల లూగుతూ కనిపించింది. ఒడ్డున ఉన్న పడ వలలో సిల్వర్, అతని అనుచరులు కూర్చుని పాటలు

పాడుతున్నారు. తరంగాలహోరు క్రమేపీ ఎక్కువౌ తోంది. సూర్యుడు ఒలిస్కోప్ కొండచాటుకు దిగు తున్నాడు. నెమ్మదిగా చీకట్లు వ్యాపిస్తున్నాయి. నేను వేగం హెచ్చించాను. ఆ సాయంత్రమే బెన్‌గన్ పడవను కనుక్కోవాలని. చీకటి బాగా పడకముందే మట్టికోటకు తిరిగి రావాలని నా ఊహ.

తెల్లగుట్టను చేరుకున్నాను. అది ఎక్కి అవతలి వైపుకు దిగి చూశాను. కొంతసేపు వెదకగా పొదలు బాగా గుబురుగావున్న ప్రదేశంలో ఆకు లాలములతో కప్పబడివున్న పడవ కనిపించింది. నేనుకూడా పట్టె నేమో అన్నంత చిన్నదిగా, యిరుకుగావుంది. చాలా కష్టం మీదగాని అది పడవఅని, అది నీళ్ళలో ప్రయా ణానికి పనికి వస్తుందని ఎవరూ ఊహించలేరు. అంత దరిద్రంగా వుంది అది. ఏ పనిముట్లు లేకుండా, ఎవరూ సహాయం లేకుండా బెన్‌గన్ దాన్ని తయారుచేశాడు. మరింకెల్లా వుంటుంది ఆ పడవ?

పడవను కనిపెట్టడమే నా ఆశయం కనక నేను వెనక్కి తిరిగి వెళ్ళి పోవలిసింది కాని ఇంతలో ఇం కొక ఆలోచన తట్టింది. ఏదో మహా ఘనకార్యం చేస్తే గాని మళ్ళీ తిరిగి పోకూడదని పించింది. చీకటి బాగా పడగానే పడవలో హిస్పానియోలా వరకూ వెళ్ళి లంగరు తాళ్లు తెగగొట్టి వెయ్యాలనుకున్నాను. ఆరోజు యుద్ధంలో మా శత్రువులు చాలా నష్టపడ్డారు. అందుచేత వాళ్ళు కాంచనద్వీపానికీ, అక్కడి బంగా

రపు పాతర్లకి దణ్ణం పెట్టి హిస్పానియోలాలో వెనక్కి పోవాలని ఆలోచిస్తున్నట్లు నాకొక దృఢమైన అనుమానం కలిగింది కనుక సిల్వర్ వాళ్లు ఇంకా ఒడ్డున ఉండగానే ఓడ లంగరు ఛేదించి దాని దారిన దాన్ని పోనివ్వాలనుకున్నాను.

బాగా చీకటి పడేదాకా పడవలోనే కూర్చున్నాను. పొగమంచు దట్టంగా వ్యాపించి ఆకాశమంతా ఆవరించింది ఆ చీకట్లో రెండే వెలుగులు కనిపిస్తున్నాయి ఒకటి ఓడలోని దీపం. ఇంకొకటి తీరాన సిల్వర్ వాళ్ళు వేసుకున్న చలిమంట.

అప్పుడు లేచి పడవను రెండు చేతులతోను ఎత్తి నీటిలో విడిచాను. కొంత దూరంవరకూ బురద నీళ్ళలో నడిచి తరవాత పడవలో ఎక్కి ప్రయాణం సాగించాను.

## 23. ఓడలోని కళాసీలు

బెన్‌గన్ పడవమీద మొదటనాకు కలిగిన దురభిప్రాయం త్వరలో తొలగిపోయింది. నా ఎత్తు, బరువుగల మనిషికి ఆ పడవ చాలా సౌకర్యంగా ఉన్నది. కాని తీరా దాన్ని నడపబోయే టప్పటికి అంత సుకరంగా లేదేమో ననిపించింది. ఎంతసేపు తెడ్డువేసినా వలయంగా తిరుగుతుందేగాని ముందుకు పోదే! నేను వెళ్లాలనుకున్న దిక్కు తప్ప మిగతా అన్ని దిక్కులకూ తిరుగుతుంది. చిన్నపిల్లణ్ణి బతిమాలుకున్నట్టు ఎన్నోసార్లు నెమ్మదిగా ప్రయత్నించాను

దాన్ని సముద్రంలోనికి నెట్టదామని. కాని మళ్ళీ మళ్ళీ కెరటాలతో పాటు ఒడ్డుకే రావటం మొదలెట్టింది.

ఆఖరికి ఎలాగైతేనేం ప్రవాహ వేగంలోపడి హిస్పానియోలా వైపు ప్రయాణం సాగించింది నా పడవ. ఓడను సమీపించగానే లంగరు తాడు చేతికందింది; దానిని గట్టిగా పట్టుకున్నాను. నా జేబులో ఉన్న కత్తి తీశాను కాని ఇంతలో ఒక విషయం జ్ఞాపకంవచ్చింది. లంగరు తాడు చాలా బిగుగావున్నది. దానిని గనుక అప్పుడు కోస్తే ఓడ ఒక్కగంతు వెనక్కి వేసి తర్వాత ముందుకు పోతుంది ఆ వెనక్కి గెంతటంలో వెనకనేవున్న నేనూ, నా పడవ చిత్తయి పోతాము. ఏం చేద్దామని ఆలోచిస్తుండగా ఓడ నా పడవకు దగ్గరగా జరిగి లంగరు తాడు కొంచెం సడలింది. ఇదే సమయమని కత్తితో తాడును పరపర కోసేశాను. కాని పూర్తిగా కోయలేదు; ఇంకా కొంచెంగా పట్టువున్నది. పూర్తిగా ఎందుకు కొయ్యలేదంటే ఓడ మళ్లీ దూరానికి జరిగి తాడు బిగిసింది. మళ్ళీ గాలివాటుకి ఓడ దగ్గరికిజరిగే దాకా ఆగటం మంచిదనుకున్నాను.

ఇంతలో ఓడగదిలో నుండి పెద్దపెద్ద కేకలు వినిపించాయి. అందులో ఒక గొంతుక సరంగు ఇజ్రాయెల్ హాండ్స్‌ది. రెండోది హాండ్స్‌తో పాటు ఓడకు కాపలాగా నియమింపబడిన కళాసీది. వాళ్ళ కంఠా

లనుబట్టే వాళ్లు తెగతాగి వున్నారనీ, మంచి మల్ల యుద్ధంలో నిమగ్నులై వున్నారనీ గ్రహించాను.

ఒడ్డున చలిమంటవద్ద కళాసీలు కూడా తాగి తందనా లాడుతున్నారు. ఎవరో "యో—హో—హో—బలె గుమ్మైనరమ్" అని పాడుతున్నారు.

ఇంతలో గాలివీచి హిస్పానియోలా ఇందాకటి వలెనే దగ్గరికి జరిగింది. అదను కనిపెట్టి నేను మిగిలిన తాడునుకూడా కోసివేశాను. వెంటనే హిస్పాని యోలా గిరున ఒక చుట్టు తిరిగి నా పడవకు అభి ముఖంగా రాసాగింది. ప్రాణభీతితో నేను నాపడవను దూర దూరంగా నెట్టుకుంటూ ఓడ వెనక భాగాన్ని సమీపించాను. అక్కడ ఓడగది దగ్గరనుండి వేళ్ళా డుతూ నీళ్లలో తేలుతున్న ఒక సన్నటి తాడు చేతి కందింది. దానినాధారంగా చేసుకుని నా పడవను మెల్లిగా ఓడదగ్గరికి జరుపుకుంటూ, ఓడలో కెక్కాను. లంగరు తాడు తెగిపోయి ఓడ ప్రమాదస్థితిలో ఉన్న సంగతిని కాపలా కళాసీలు ఇంతవరకూ గుర్తించ లేదేమో అని ఆశ్చర్యపడుతూ గది కిటికీలో నుండి తొంగిచూశాను. వారి ప్రమత్తతకు కారణం వెంటనే అర్థమైంది. ఇజ్రాయెల్ హాండ్స్, అతనితోటి కళాసీ భయంకరంగా యుద్ధం చేస్తున్నారు. ఒకరి మెడమీద ఒకరు చేతులువేసి ఒకరినొకరు పడవేసే స్థితిలో వున్నారు. వెంటనే తాడు సహాయంతో మళ్ళీ నా పడవలోకి వచ్చేశాను.

అప్పటికి ఓడ మొకటి సందిగ్ధస్థితి నుండి తెప్పరిల్లి దెయ్యాలదీవికీ కాంచనద్వీపానికీ మధ్య పడమటి వైపున ఉన్న యిరుకు సందుగుండా ప్రయాణం చేస్తున్నది. ఓడతో పాటు నా పడవకూడా దాని వెనకనే లాక్కోని పోబడుతున్నది. దెయ్యాలదీవిని దాటి పెద్ద సముద్రంలోకి ప్రవేశించామా అంటే ఓకమాట ఎల్లాగున్నా నా చిన్నపడవ మాత్రం అలల తాకిడికి మునిగిపోక తప్పదు ఇక నా జీవితం అంతమైనట్లే నని భావించుకుని భగవంతుణ్ణి స్మరించుకుంటూ, నా భవిష్యత్తు ఆయనకే వదిలి పడవలో కూర్చున్నాను. ఓడలోని ఇద్దరు కళాసీలుకూడా తమ ప్రమాదస్థితి గమనించారల్లేవుంది. ఆదుర్దాగా ఓడలో అటూ యిటూ పరుగులిడుతున్న చప్పుడు వినిపించింది. అటువంటి సమయంలో వాళ్ళకి ఏం చెయ్యాలో తోచివుండదు; అందుకని పోట్లాట విరమించి ఇద్దరూ కలిసి గాబరా పడుతున్నారు. పడవ కుదుపుకీ, అలలహోరుకీ అలిసి ఎప్పుడు నిద్రపోయానో తెలియదు. చాలసేపు గాఢంగా, నిశ్చింతగా మా అమ్మను గూర్చి, "ఎడ్మిరల్ బెన్‌బౌను" గూర్చి కలలు కంటూ నిద్రపోయాను.

## 24. పిస్టోలాలోకి

లేచేటప్పటికి బాగా తెల్లవారింది. నా పడవ కాంచన ద్వీపానికి నైరృతి మూలగా అలల్లో ఉయ్యాల లూగుతూ ప్రయాణిస్తున్నది. సూర్యుడుద

యించాడు గాని ఇంకా టెలిస్కోప్ కొండ చాటునే వున్నాడు. డమాన్‌దిబ్బ నాకు అనతి దూరంలో కనిపిస్తున్నది. తీరానికి రెండు ఫర్లాంగులకంటె ఎక్కువ దూరంలో లేను; వెంటనే ఒడ్డుకుపోయి దిగాలనిపించింది కాని మరుక్షణంలో అది అసాధ్యమని గ్రహించాను. ఎందుకంటే డమాన్‌దిబ్బపైనుండి దొర్లిన బండరాళ్లు అనేకం ఒడ్డుపొడుగునా నీళ్ళలోనుండి పైకి కనిపిస్తున్నాయి. ఏ రాతికి కొట్టుకున్నా నా పడవ తునాతునకలైపోక తప్పదు. అంతేకాదు. ఆ రాళ్ళమీద ఒకదానిమీద నుంచి ఇంకో దానిమీదికి చెంగున ఎగురుతూ, వింతశబ్దాలు చేస్తూ, విచిత్ర జంతువులు కనిపించాయి చూట్టానికి మెత్త మెత్తగా నత్తలవలె ఉన్నాయి గాని పరిమాణంలో చాలా పెద్దవిగా ఉన్నాయి. దాదాపు అరవై, డెబ్భయ్‌దాకా ఉండి కుక్కలు మొరిగినట్లు మొరుగుతున్నాయి. అప్పుడు నాకు తెలియలేదుగాని తరవాత తెలిసింది, వాటిని సముద్రసింహాలంటారని, అవి ఏమీ హాని చెయ్యవని. అప్పుడు మాత్రం వాటినిచూస్తే నాకు భయం పుట్టుకొచ్చింది.

డమాన్‌దిబ్బ దాటాక తీరరేఖ వంకర తిరక్కుండా పొడుగునా సూటిగా సాగిపోతుంది. కొంత దూరంపోయాక సింధుశాఖ, దానిపక్కన ఫ్లింట్ అగ్రం వున్నాయి. ఫ్లింట్ అగ్రంవరకూ పోయి

పక్కన సురక్షితంగా ఉండే సింధుశాఖలోకి పడవని పోనిచ్చి ఒడ్డుకుదిగడం మంచిదని నిశ్చయించుకున్నాను.

ఎలాగైతే నేం నా పడవ ఫ్లింట్ అగ్రాన్ని చేరింది. కాని అక్కడ మరో సమస్య ఎదురైంది.

అగ్రం దాటి తూర్పుగా తీరంకేసి తిరిగేసరికి సింధుశాఖలో నా పడవకంటే ముందే హిస్పానియోలా వచ్చి నుంచుని వుంది. ముందుకుపోయి ఓడలోప కళాసీల చేతుల్లో చావటమా, లేక వెనక్కిపోయి ఎక్కడా ఒడ్డుకు రావటానికి వీల్లేక ఆకలితో, దాహంతో మరణించటమా, ఏది తేలిక అని సమస్య ఉత్పన్నమైంది.

తీరాచూస్తే ఓడలో మనుషులున్న అలికిడిగాని, జాడగాని లేదు. క్రితంరాత్రి లంగరు తాడు కోసి చేయగానే నా పడవలాగే ఓడకూడా తరంగాలు ఎటు తిప్పితే అటు తిరుగుతూ ఫ్లింట్ అగ్రందగ్గర సింధుశాఖలోకి చేరివుంటుంది. లోపలి మనుషులు తాగి మూర్ఛపోయి వున్నారో, లేక సముద్రంలో పడి చచ్చారో, ఒడ్డుకు ఈదుకుంటూ పోయారో ఊహించలేకపోయాను. ఏమైనా ఓడలోకిపోయి పరిస్థితులు చూడాలనుకున్నాను. నా పడవ ఓడను సమీపించగానే చుక్కాని కొయ్యలు, తాళ్లు ఆధారంగా లోపకెగబాకాను.

ఓడ సరంబీమీద నుంచున్నాను. అవతల చివర కళాసీలిద్దరూ ఉన్నారు. వాళ్ళు నన్ను చూడలేదు. ఒకడు రెండు చేతులూ, కాళ్లూ బారజాచుకు

వెల్లకిలా పడుకున్నాడు. వాడికి దగ్గరలో ఇస్రాయెల్ హాండ్స్ సరంబీ పిట్టగోడకు ఆనుకుని తల రొమ్ము మీదకివాల్చి కూర్చున్నాడు.

ఓడ గాలికిగాని, కెరటాలకుగాని అటూ ఇటూ ఊగినప్పుడల్లా నేలమీద పడుకునివున్న కళాసీ ఓడతో పాటు అటూ ఇటూ దొర్లుతున్నాడు. అలా దొర్లుతున్నా వాడు లేవటం లేదేమా అని ఆశ్చర్యం వేసింది. స్ఫృహలో లేడనుకున్నాను ఇస్రాయెల్ కూడా ఓడ ఊగినప్పుడల్లా కొద్ది కొద్దిగా ఒరిగి చివరికి నేలమీద నిలువునా పడుకున్నాడు. దగ్గరికి వెళ్ళిచూశాను. వాళ్ళచుట్టూ పగిలిన సీసాల పెంకులు రక్తపు చారికలు ఉన్నాయి. ఒకళ్లనొకళ్లు హత్య చేసుకుని వుంటారనుకున్నాను.

ఇంతలో ఇస్రాయెల్ మెల్లిగా మోచేతుల మీద లేచి కూర్చోటానికి ప్రయత్నించాడు. బాధతో నీరసంగా మూలుగుతున్నాడు వంటినిండా గాయాలున్నాయి. పాపం వాణ్ణి చూడగానే జాలివేసింది గాని ఆరోజున ఆపిల్ పీపాలోనుంచి విన్నమాటలు జ్ఞాపకం వచ్చి గుండెని కఠినం చేసుకున్నాను.

"లేవోయి మిస్టర్ హాండ్స్" అని పిలిచాను.

ఇస్రాయెల్ అదిరిపడి వెనక్కి చూశాడు. నేను కదలకుండా అక్కడే నుంచున్నాను. అతడు ఆట్టే సేపు తల నిలుపలేక మళ్ళీ పడిపోయి నీరసంగా "రమ్! రమ్!" అని బలహీనంగా అన్నాడు.

రమ్ తెచ్చే ఉద్దేశ్యంతో నేను మెట్లుదిగి ఓడ గదిలోకి వెళ్ళాను. ఆగది ఎంత భీభత్సంగా ఉన్నదో చెప్పలేను. ప్రతి అలమారు, డ్రాయరు, పెట్టె, పగల గొట్టి చూసినట్టున్నారు ద్వీప పటంకోసం. నేలమీద కాగితాలు, రమ్ సీసాలు, ప్లేట్లు చిందర వందరగా పడివున్నాయి. ఆ చెత్తలో వెదకగా నిండ రమ్మున్న సీసాఒకటి దొరికింది. ఒకఅలమారలో కొన్ని బిస్కట్లు, ద్రాక్షపళ్లు, జున్నుముక్క దొరికాయి. అవి జేబులో వేసుకున్నాను. మంచి నీళ్ళతొట్టి దగ్గిరికివెళ్లి ముందు కడుపునిండా మంచినీళ్ళు తాగాను. తర్వాత ఇజ్రా యెల్ దగ్గరకువచ్చి రమ్‌సీసా అందించాను. ఆత్రంగా సీసా అందుకుని రెండుగుక్కల్లో అంతా ఖాళీచేశాడు.

"బాగా దెబ్బలు తగిలాయా?" అని అడిగాను, బిస్కట్లుతింటూ.

ఇజ్రాయెల్ నీరసంగా సమాధానమిచ్చాడు: "ఆడాక్టరుగనక ఉంటే రెండు నిమిషాల్లో లేచి తిరగ గలను. కాని నాకు అదృష్టంలేదు. అదే వచ్చిన బాధ. ఆవెధవ చచ్చిపోయాడు అసలు వాణ్ణి ఎవరు రమ్మ న్నారు ఇక్కడికి. అయితే హాకిన్సగారూ! మీరిక్క డికి ఎల్లా వచ్చారు?"

"ఓడను స్వాధీనం చేసుకు నేందుకు వచ్చాను. నన్ను ఇప్పుడు కెప్టెన్‌గా గౌరవించాలి నువ్వు", అని దబాయించాను.

ఇస్రాయెల్ తీవ్రంగా చూశాడు నావంక. కాని కిమ్మనలేదు. ఇంతవరకూ మంచులా పాలిపోయిన అతని ముఖంలోకి రక్తం తాగడంతో కాస్త కళవచ్చినా ఇంకా బలహీనంగానే వున్నాడు. ఓడ ఊపుకు సరిగ్గా కూర్చోలేక పడిపోతున్నాడు.

"మిస్టర్ హాండ్స్! చూడు, ఆ తెరచాప కొయ్య మీద మీదొంగల జెండా ఎగరేశారు అది అక్కడ వుండటానికి వీల్లేదు. తీసి వేస్తున్నాను," అని కొయ్యకు కట్టివున్న తాడు విప్పి నల్ల జెండా దించివేశాను.

ఇస్రాయెల్ అన్నాడు.

"కెప్టెన్ హాకిన్స్! మీరు ఒడ్డుకు పోవాలను కుంటున్నారు కదూ? నాకూ అక్కడ పోవాలని వుంది. కాని ఓడ నడిపేదెవరూ? మీకా పని ఏమీ చేతకాదు గదా! అందుకని మనం ఒక పని చేద్దాం," అని ఆగి నా కళ్లలోకి చూశాడు, ఏమనుకుంటున్నానో చూద్దామని.

"ఊ, చెప్పు," అన్నాను నా తిండి కానిస్తూ.

"ఏం లేదండి మీరు నాకు కాస్త తింటానికి కేదన్నా తెచ్చిపెట్టండి. కాస్త గుడ్డపేలిక ఒకటివ్వండి. ఈ దెబ్బకి కట్టు కట్టుకుంటాను. నేను లేచి అప్పుడు ఓడ నడుపుతాను."

"సరే. ఒప్పుకున్నాను. కాని మళ్ళీ దెయ్యాల దీవి దగ్గిరికి కాదుసుమా. ఈ ద్వీపానికి ఉత్తరాన

ఉత్తర సింధుశాఖ అని ఉందిచూడు. అక్కడికి పోయి నాఓడను అక్కడ ఆపుతాను. తెలిసిందా?"

"మీయిష్టం, ఎక్కడికి తీసుకెళ్లమంటే అక్కడికి తీసుకెడతానండి. మీరు కెప్టెన్ గదాండి. మీరేం చెబితే అది వింటం నా ధర్మం. మరి దబ్బున ఏదన్నా తెచ్చియ్యండి"

నేను మళ్లీ కిందకిపోయి తినుబండారాలు, శాస్త్రమ్, మంచినీళ్లు, ఒక గుడ్డపేలిక తెచ్చియిచ్చాను. ఇస్రాయెల్ అవన్నీ తిని తాగి శాస్త తీరుకున్నాడు. తొడలో తగిలిన పెద్దగాయానికి గుడ్డముక్క కట్టుకున్నాడు. కొద్దినిమిషాల్లో లేచి నిలబడ్డాడు ఓడను ముందుకు కదిలించడానికి ఏమేం చెయ్యాలో చెప్పాడు తను చుక్కాని పట్టుకున్నాడు.

మరి కొన్ని నిమిషాల్లో హిస్పానియోలా ప్లింట్ అగ్రం దాటి ఉత్తరంగా ప్రయాణం సాగించింది. కొద్దకాలం పాటైనా, ఓడలో ఒకమనిషి ఎవరూ లేకపోయినా, నేను కెప్టెన్గిరి చెలాయిస్తున్నందుకు గర్వపడ్డాను ఇస్రాయెల్ చాలా నమ్రతగా, భయభక్తులతో మెలగుతున్నాడు. కాని అతని కళ్లలో నామీద ద్వేషం, పగ మెరుపులుతూ వుండటం నేను చూడకపోలేదు. అందుచేత సాధ్యమైనంత దూరంగానే తిరుగుతూ, వెయ్యికళ్లతో వాణ్ణి కనిపెడుతూనే వున్నాను.

# 25. ఇజ్రాయెల్ హాండ్స్

గాలిపాటు అనుకూలంగా ఉన్నందువల్ల మా ఓడ ద్వీపం పడమటితీరం వెంబడే ఉత్తరంగా ప్రయాణం చేసింది. ఉత్తర సింధుశాఖను సమీపిస్తున్నాము. సరంగు ఇజ్రాయెల్ ఎప్పటికప్పుడు నాకు ఇచ్చే సలహాలనుబట్టి ఓడను నేనే ఎక్కువభాగం నడుపుతున్నాను.

"కెప్టెన్!" అన్నాడు హాండ్స్, సరంబీ మీదనే ఉన్న రెండో కళాసీ శవాన్ని చూపుతూ. "ఓబ్రియన్ ఎల్లాగూ చావనే చచ్చాడు. వాడి శవంకూడా ఇక్కడెందుకండి దిష్టిబొమ్మలాగ. కాస్త ఎత్తి సముద్రంలో పారేస్తారా?"

"నేనా? అంత బరువు మోయలేను; అదీగాక నాకు శవాల్ని మొయ్యటం అలవాటు లేదు. అక్కడే వుండనీ దాన్ని." అన్నాను.

"ఇంత దరిద్రపు ఓడ నెప్పుడూ చూడలేదండి కెపెన్! మనం బయల్దేరిన వేళా విశేష మేమిటో గాని ఈ హిస్పానియోలా మీద చాలా మంది కళాసీలు పాపం చచ్చి పోయారండి. ఒకమాట అడుగుతాను కెప్టెన్! ఈ ఓబ్రియన్ చచ్చిపోయాడు కదా! నిజంగా అంటే, పూర్తిగా చచ్చి పోయాడంటారా? లేకపోతే దెయ్యమై మళ్ళీ వస్తాడంటారా? మీరు చదువుకున్నారు గదండి, అందుకని అడుగుతున్నా."

"ఇస్రాయెల్! శరీరాన్ని చంపగలవు గాని ఆత్మని చంపలేవు ఆత్మ దేదీప్యమై ఇంకో లోకంలో వుంటుంది ఓబ్రియన్ అక్కణ్ణించి మనల్ని చూస్తూ వుండి వుంటాడు," అన్నాను

"నిజంగానా కెప్టెన్? అయితే మనుష్యుల్ని చంపటం వట్టి దండగే నన్నమాట. అదేదో, మీరు చెప్పిన ఆత్మ—బతికివుంటే ఇహ ఎందర్ని చంపి మాత్రం లాభ మేమిటి?—" ఇస్రాయెల్ హేండ్స్ ఇంతసేపు నావంక చూడకుండా, నా చూపుల్ని తప్పించుకుంటూనే మాట్లాడుతున్నాడు. ఇప్పుడు ఆగి నావంక ఒక్కసారిచూసి మళ్ళీ కళ్లుతిప్పుకున్నాడు. ఆ చూడటంలో వాడిలో వున్న ద్రోహబుద్ధి వ్యక్తమైంది. మళ్లీ అన్నాడు ఇస్రాయెల్: "కెప్టెన్! ఈరమ్ మరీ ఘాటుగా వుందండీ. బుర్ర తిరిగి పోతోంది. కాస్తంత ఆ కిందగదిలోకి వెళ్ళి బ్రాందీ సీసా వుంటే తెచ్చిపెట్టండి. మీకు పుణ్యం వుంటుంది."

ఇస్రాయెల్ మాటల్లో ఒక్కదాన్ని నేను నమ్మలేదు ఎప్పుడూ రమ్ తప్ప మరేమీ తాగనివాడికి అది ఘాటు కావటమేమిటి? ఇదంతా ఏదో మోసపు ఆలోచనే. నన్ను నరంబీనుండి కిందకి పంపించి ఏదో చెయ్యాలనుకుంటున్నాడు. వాడి బెదురుచూపులు, విషంతో కూడిన చిరునవ్వు ఇవన్నీ చూస్తే నా అనుమానం మరింత దృఢపడింది.

"బ్రాందీ కావాలా? అల్లాగే, తెస్తానాగు," అన్నాను.

సరంబీ మెట్లుదిగి ఓడగదికి వెళ్లేనడవలో ఆగాను. ఇబ్రాయెల్ ఏం చేస్తాడో చూడాలనుకున్నాను. నేను ఓడ గదిలోకి వెళ్ళివుంటాను గదా అని ఇబ్రాయెల్ గబగబ కూర్చున్న తావునుండి లేచాడు. లేవడంలో తొడలోని గాయం నెప్పెట్టిందేమో, భీకరంగా మూలి గాడు. లేచి ఓబ్రియన్ శవం దగ్గిరికి వెళ్ళి దాని కింద వున్న బాకు తీశాడు. దానిమీద రక్తం గడ్డ కట్టకుని వున్నది. ఒక్క క్షణం దానికేసిచూసి చొక్కా లోపల దాచుకున్నాడు మళ్లీ ఏమీ ఎరగనట్లు తను మొదట కూర్చున్నచోటికే వెళ్ళి ఇందాక కూర్చున్నమాదిరి గానే కూర్చున్నాడు.

నేను తెలుసుకోదలచింది ఇంతే. ఇబ్రాయెల్ లేచి నడవ గలుగుతున్నాడు; వాడిదగ్గిర ఒక ఆయుధం వుంది. కనుక వాడి చేతిలో నాకు అపాయం తప్పదు జాగ్రత్తగా ఉండవలసిందే. కాని ఒక విష యంలో మాత్రం వాణ్ణి నమ్మాను. ఓడ ఉత్తర సింధు శాఖలోకి సురక్షితంగా చేరడం నాకెంత అవసరమో వాడికీ అంత అవసరమే. వాడి సహాయం లేందే నేను గాని, నా సహాయం లేందే వాడుగాని ఓడను నడిపే స్థితిలో లేము అందుచేత ఓడ రేవును చేరేదాకా వాడు నాకేమీ హాని తలపెట డనుకున్నాను.

ఇలా ఆలోచిస్తూ ఓడ గదిలోని వెళ్ళి బ్రాందీ సీసాను వెదికి తీసుకున్నాను. సరంబీమీదికి వచ్చి కొంతదూరంలో నుంచుని సీసాను హాండ్సు కందించాను సీసా మూతి పగలగొట్టి అతడు కొంత తాగాడు. తరవాత జేబులోంచి పొగాకు తీసి చుట్ట చుట్టుకున్నాడు.

ఇంకా మేము రెండు మైళ్లు పోవలసివుంది. ఇస్త్రాయెల్ చెప్పిన ప్రకారం తెరచాపలు ఎత్తుతూ, దించుతూ, ఓడను పోనిస్తున్నాను. ఉత్తర సింధుశాఖను చేరాము. మలుపుతిరిగి ఆ చీలికలోనికి ప్రవేశించాము. సింధుశాఖ ఇరుకుగా వున్నది. ఆ ఒడ్డున, ఈ ఒడ్డున దట్టంగా అరణ్యాలున్నాయి. తీరాలను దాదాపు తగులుతూనే ఓడ ముందుకు పోతోంది. తీర రేఖలు రెండూ కలుసుకునే చోటు సమీపించాము. అక్కడ శిధిలమై, తునాతునకలై వున్న ఒక పాత ఓడ కనిపించింది.

"ఆ, ఇక్కడ చాలా బావుంది. ఇంత మంచి రేవు నేనెక్కడా చూడలేదు. ఆ తెరచాప దించండి. నెమ్మదిగా, నెమ్మదిగా......" అంటున్నాడు ఇస్త్రాయెల్ నా వెనక కొద్దదూరంలో నిలబడి.

నేను ఓడను తీరాన ఆపుచేసే సంరంభంలో ఇస్త్రాయెల్‌ను, అతని చొక్కాలోని బాకును, అతని మోసాన్ని విస్మరించాను. హఠాత్తుగా గుండె ఝల్లు

మంది. ఎందుకు ఝల్లుమన్నదో నాకప్పటికీ ఇప్పటికి అర్థంకాలేదు. భయంకరమైన ప్రమాదం రాబోతున్నప్పుడు అలాగే జరుగుతుందనుకుంటాను. వెంటనే వెనక్కి తిరిగి చూశాను. ఇస్రాయెల్ సగం దారిలో ఊగుతూ నుంచున్నాడు. చేతిలో బాకును ఎత్తి పట్టుకున్నాడు.

మా చూపులు కలుసుకోగానే ఇద్దరం ఒకసారే అరిచామనుకుంటాను. నా అరుపులో భయం వ్యక్తమవుతున్నది. అతని అరుపులో దార్జన్యంవున్నది. ఇస్రాయెల్ అలా అరిచి నా కేసి దూకాడు. దూకటంలో నా అదృష్టవశాత్తు కాలు బెణికి ముందుకు పడ్డాడు ఈ అదను చూసుకుని నేను దూరంగా పరిగెత్తాను వాడు లేచేలోగా పంట్లాం జేబులోంచి పిస్టలు తీసి వాడి కేసి గురిపెట్టాను. నాపిస్టల్‌ను లెక్క చెయ్యకుండ వాడు మీదికి వస్తున్నాడు. పిస్టల్ పేల్చాను కాని పిస్టల్ మోగలేదు, పేలలేదు. నా ఆశ్చర్యానికి మితిలేదు. బెన్‌గన్ పడవలో ప్రయాణం చేస్తున్నప్పుడు అలలకి నా పంట్లాం తడిసి పోవటం జ్ఞాపకం వచ్చింది. అప్పుడే, నా పిస్టలుకూడా తడిసి పనికిరాకుండ పోయిందనుకున్నాను. పిస్టలును సరిగా పరీక్షించి బాగు చేసుకోనందుకు నన్ను నేను ఎంతో నిందించుకున్నాను.

ఇంతలో నా అదృష్టం కొద్దీ ఓడ తీరానగల

ఇసుక దిబ్బలను కొట్టుకుని ఒక్కసారిగా కంపించింది. ఓడ వెనక భాగంపైకి లేచింది. ఆ అదురుకు నేను, ఇబ్రామెల్ కూడ బోర్లాపడి, వాలుగావున్న సరంబీమీద దొర్లసాగాము. మాతోపాటు ఓబ్రియన్ శవంకూడా దొర్లసాగింది. ముందు లేచి నిలబడింది నేనే. ఇబ్రామెల్ మీదికి శవందొర్లడంచేత వాడు దానితో కొంత సేపు కుస్తీ పట్టిగాని లేవలేక పోయాడు. ఈలోగా నేను దగ్గర్లోవున్న ఒక తెరచాప కొయ్యమీదికి ఎగబాకాను.

కొయ్యకు సగం ఎత్తున కట్టబడివున్న చట్టంవరకూ పాకి అక్కడ కూర్చున్నాను.

ఇబ్రామెల్ ఈలోగా నింబడి మళ్ళీ ఒక అరుపుఅరిచి బాకు విసిరాడు. అది నా కాళ్లకు కింద కొంతదూరంలో కొయ్యకు తగిలి నేలపై పడిపోయింది. ఇబ్రామెల్ విస్తుపోయి, కళ్లు చిట్లించుకుని నా కేసి చూస్తున్నాడు. నేను సురక్షిత స్థలం సంపాదించాను గదా అనే ధీమాతో చట్టంమీద కూర్చుని చొక్కా పైజేబులోంచి పాడిమందు, తూటాలుతీసి పిస్టల్‌లోని తడిమందు తీసి పారవేసి తిరిగినింపాను. జేబులోనుండి ఇంకో పిస్టల్‌తీసి దాన్నికూడా పాడి మందుతో నింపాను రెండు పిస్టళ్లూ రెండు చేతులతో పట్టుకున్నాను. ఇంతసేపు ఇబ్రామెల్ నేను చేస్తున్న పని శ్రద్ధగా చూస్తున్నాడు.

"ఇజ్రాయెల్! నువ్వు అడుగు ముందుకు వేశావంటే రెండుతూటాలు లొక్కసారిగా నీ తలలోంచి దూసుకుపోతాయి, జాగ్రత్త!"

ఈ బెదిరింపు వాడిమీద బాగా పనిచేసింది. ముందుకు రాబోతున్నవాడు అక్కడే ఆగిపోయాడు అదిచూసి నేను ధీమాగా నవ్వాను. ఇజ్రాయెల్ రెండు గుటకలు కష్టంమీద మింగి,

"కెప్టెన్! కాస్తలో తప్పిపోయింది గాని లేకపోతే ఈ బాకు నీవీపును రెండుచెక్కలు చేసేది. ఊహు. నాకు అదృష్టంలేదు. ఇప్పటికైనా నిన్ను వదిలిపెడతా ననుకోకు," అంటూ నేను కూర్చున్న కొయ్యను సమీపించాడు. నేను వాడిమాటలు చిరునవ్వు నవ్వుకుంటూ వింటున్నాను. హఠాత్తుగా వాడు చెయ్యెత్తి కత్తి విసిరాడు. కత్తి నాభుజంపైన చర్మాన్ని చీల్చుకుంటూ కొయ్యకు గుచ్చుకుంది. అదే సమయంలో నేను పిస్టల్ పేల్చాను అప్రయత్నంగా. ఇజ్రాయెల్ హాహాకారం చేస్తూ క్రింద గుభీమని కూలిపోయాడు.

## 26. పెసో, పెసో, పెసో.

ఓడ ఏట వాలుగా వుండటం చేత ఇజ్రాయెల్ హాండ్స్ దెబ్బ తింటంతోనే నీళ్ళలో పడ్డాడు. ఒకటి రెండుసార్లు నీళ్ళపైకి తేలాడుగాని, [illegible]ళ్లు సన్న

కోవటంతో శాశ్వతంగా అడుగుకుపోయి అదృశ్యు డయ్యాడు.

శత్రువు తొలగిపోగానే నా దుస్థితి స్ఫురణకు వచ్చింది ఇస్రాయెల్ విసిరిన బాకు నా భుజం చీల్చుకొని కొయ్యకు గుచ్చుకుందని చెప్పాను. వీపు మీద, రొమ్ము మీద నెత్తురు కారుతున్నది. బాకు తెరచాప కొయ్యలో గట్టిగా ఇరుక్కుపోవటం మూలాన ఒక్క చేత్తో లాగి వెయ్యటానికి సాధ్యం కాలేదు. రెండు చేతుల్తో ఊడబెరికితే ఆ ఊపుకు నేను ముందుకు ఒరిగి నీళ్ళలో పడకతప్పదు. ఏం చేయటమా అనే భయంతో ఒక్కసారిగా ఆ పాద మస్తకం కంపించాను. అప్రయత్నంగా కలిగిన ఆ కంపనకు బాకు ఊడిపోయి కిందపడింది. నెత్తురు ఇంకా ధారలుగా కారింది ఎలాగైతే నేం కొయ్యనుండి కిందికి పాకివచ్చి నరంబీమీదకు చేరాను.

ఓడ గదిలోకి వెళ్ళి కొంతదూది, గుడ్డపీలికలు సంపాదించి గాయానికి కట్టుకున్నాను. గాయం లోతుగా తగల్లేదు. భుజంపై అంచుమాత్రమే తెగింది. ఆ చెయ్యి ఉపయోగించటానికి వీల్లేనంతగా కూడా నెప్పి పెట్టటంలేదు. అందుచేత గాయాన్ని గూర్చి కలత పడవలసిన అవసరం లేకపోయింది.

చుట్టూ చూశాను ఈ ఓడ యావత్తూ నాదే కదా అని సంబరపడ్డాను. ఒకమూల నరంబీ పిట్టగోడ

కానుకుని ఓ బ్రియన్ శవం ఇంకా అలాగేవుంది. ఈపాటికి అది చాల వికృతంగా తయారై చూట్టానికి భయంకలిగిస్తోంది. నడుం దగ్గర పట్టుకుని దాన్ని పిట్టగోడనుండి అవతలకు దొర్లించాను.

అప్పటికి సూర్యుడు బాగా పడమటికి వాలిపోయాడు. నేను ఒంటరిగా ఆ నిర్జన ప్రదేశంలో బిక్కుబిక్కు మంటూ నిలబడ్డాను. బాగా చీకటి పడకముందే మట్టికోటను చేరుకోవాలని అనిపించింది. నా సాహస కార్యాలను ఎప్పుడు నా స్నేహితులకు విని పిద్దామా అని ఆత్రుత ఎక్కువైంది. ఎవరితోనూ చెప్పకుండా సాహసించి పోయినందుకు మొదట చివాట్లు పెట్టినా, హిస్పానియోలాను శత్రువుల నుండి తిరిగి స్వాధీనం చేసుకున్నందుకు, ఒకశత్రువునైనా కడ తేర్చినందుకు కెప్టెన్ నన్ను అభినందించక పోడని భావించాను.

లంగరు తాళ్ల ఆధారంతో నీళ్లలోకి దిగాను. మోకాళ్ల వరకు మాత్రమే వచ్చాయ్ నీళ్లు. ఒడ్డుకు చేరి దక్షిణంగా నడక ప్రారంభించాను. సూర్యాస్తమయ మైంది. చంద్రుడు తూర్పున ఉదయించాడు. చంద్ర కాంతిలో, చిరు చలిగాలిలో, ఉషారుగా కూని రాగాలు తీస్తూ నడుస్తున్నాను. కొంతదూరం పరి గెత్తాను, కొంతదూరం నడిచాను. కాని మట్టికోటను సమీపిస్తున్న కొద్దీ వేగం తగ్గించాను నన్ను గుర్తించ

లేక నామిత్రులే తుపాకి పేల్చి చంపెయ్యవచ్చునని భయపడ్డాను. అందుకని సాధ్యమైనంత వరకూ చెట్ల నీడల్లోనే మెల్లిగా నడిచాను.

మట్టికోట ఆవరణను చేరగానే ఆశ్చర్యం పట్ట లేక పోయాను. ఎందుకంటే మట్టికోట వెనక భాగాన పెద్ద దుంగలతో చలిమంట వెయ్యబడివుంది. మంటలు రేగకపోయినా దుంగలు కణకణ తగలబడుతూనే వున్నాయి. ఇంత పెద్దమంట తయారు చేయటానికి నామిత్రులకు అంత కలప ఎక్కణ్ణించి లభ్యమైందో అర్థంకాలేదు. ఒకవేళ కలపఉన్నా దానివద్ద మనుషు లెవ్వరూ లేకపోవటం మరింత ఆశ్చర్యాన్ని కలిగించింది ఆశ్చర్యంతోపాటు కాస్తభయంకూడ కలిగింది.

కాని ముందుకే పోయాను. ఆవరణ చుట్టూవున్న కంచెను దాటి చేతులతో, కాళ్ళతో పాకుకుంటూ మట్టికోట ద్వారం సమీపించాను. నా మిత్రులంతా గాఢనిద్రలో వుండి గురకలు పెడుతున్నారు. అంత నిర్భయంగా కాపలాకూడ లేకుండ వాళ్లు నిద్ర పోతున్నందుకు ఆశ్చర్యపడుతూ, ఇప్పుడు నా బదులు సింగర్ అనుచరులే వచ్చి అందరి తలలు నిద్రలోనే నరికివేస్తే ఏమవుతుంది? అని ఊహించుకుని వణికి పోయాను.

లోపల అంతా చీకటిగావుంది చడీ చప్పుడూ లేకుండ నా స్థానంలోకిపోయి పడుకోవాలనీ, తెల్ల

వారాక నన్ను చూసి వాళ్లు దిగ్భ్రాంతు లవుతుంటే చూసి వెక్కిరించాలనీ అనిపించింది. ఊపిరికూడ బిగ పట్టి పాకుతున్నాడు. ఇంతలో నా చేతుల కేదో తగిలింది. ముట్టుకుని చూస్తే అది ఎవరిదో కాలు. ఆ కాలు తాలూకు మనిషి ఇటునుంచి అటు దొర్లి పడుకున్నాడు. ఇంతలో హృదయ భేదకమైన కఠోర శబ్దం వినిపించింది.

"పెసో, పెసో, పెసో,..." ఈ ధ్వని ఎక్కడా, ఎంతసేపటికీ ఆగటం లేదు.

కెప్టెన్ ఫ్లింట్! సిల్వర్ చిలుక! ఏమిటిది! నే నెక్కడున్నాను? నా మిత్రుల మధ్య కాదా?

చిలక అరుపుకు అంతా సందడిగా లేచారు. "ఎవరక్కడ" అని సిల్వర్ గర్జించాడు. నేను లేచి ద్వారంకేసి పరిగుత్తాను. పరిగెత్తడంలో సూటిగా ఒక మనిషికి గుద్దుకున్నాను పక్కకు తిరిగి పరిగెత్తబోయి ఇంకో మనిషికి ఢీకొట్టాను. అంతా కంగారు అయిపోయింది.

"కాగడా ముట్టించండిరా", అని సిల్వర్ ఆజ్ఞాపించాడు. ఒకడు కాగడా పుచ్చుకుని చలి మంట వద్దకుపోయి అంటించుకుని వచ్చాడు.

## 27. శత్రు శిబిరంలో

కాగడా వెలుతురులో పరిస్థితి అంతా క్షణంలో అవగతమైంది. మట్టికోట అందులోని మాసామ

గ్రితో సహా శత్రువుల ఆక్రమణలో వున్నది. అన్నిటి కంటే నా భయం ఇనుమడింప జేసిన దేమంటే ఒక్క వైదీ కూడా కనబడలేదు. నా మిత్రులందర్నీ వధించి వుంటారని భావించాను. వారితోపాటు మరణించేం దుకు అవకాశం లేకుండా చేసుకున్నందుకు నన్ను నేను ఎంతో నిందించుకున్నాను.

సిల్వర్ భుజంమీద చిలక కూర్చుని రెక్కలను ముక్కుతో పొడుచుకుంటోంది. సిల్వర్ ఒక కొయ్య పెట్టెమీద కూర్చున్నాడు. మిగతా కళాసీలు చుట్టూ నుంచుని నాకేసి ఏమీ అర్థం కానట్టు వింతగా చూస్తు న్నారు. సిల్వర్ ఆ నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ అన్నాడు:

"ఒహో! జిమ్‌హాకిన్స్ వచ్చాడా? తస్సదియ్య, ఏం చేస్తున్నామో చూద్దామని వచ్చావా? డిక్! కాస్త, ఆ కాగడా ఇటు అందివ్వు. పైప్ ముట్టించు కుంటాను ఆ, చాల్లే ఒరే, అబ్బాయిలూ! మీరు జిమ్ హాకిన్స్‌కేమీ భయపడ నక్కర్లేదు. అతడు చాలా మంచివాడు. మీరు ఏం తప్పులు చేసినప్పటికీ అన్నిటినీ క్షమిస్తాడు తస్సదియ్య, జిమ్! వచ్చావన్న మాట పాపం సిల్వర్ ముసలాడు, ఏం చేస్తున్నాడో చూసి పరామర్శించాలని వచ్చావా? నువ్వు చురుకైన వాడివని తెలుసనుకో. కాని ఇంత నిర్భయంగా ఇక్క డికి రాగలవని అనుకో లేదుసుమా, తస్సదియ్య"

సిల్వర్ మాటకు నేనేమీ సమాధాన మివ్వ లేదు. పైకిమాత్రం ధైర్యంగానే ఉన్నానుగాని లోపల గుండెలు పీచుపీచు మంటూనే ఉన్నాయి. సిల్వర్ మళ్లీ ప్రారంభించాడు :

"జిమ్! నే నిదివర కెన్నో సార్లు చెప్పాను. నువ్వంటే నా కెంతో యిష్టమని నీ ధైర్యం, చురుకు తనం ఎంతో మెచ్చుకుంటున్నాను నిన్ను చూస్తే చిన్నప్పటి నా చేష్టలు జ్ఞాపకం వస్తున్నాయి. నువ్వు కూడ మాలో కలిస్తే ఎంత బావుండేది? నీకూడా కాస్త ధనం ముట్టజెప్పే వాళ్ళం కదా! నిజం చెప్ప మంటావా జిమ్? నిమీద మా వాళ్ళందరికీ కోపం వచ్చింది. ముఖ్యంగా డాక్టరుగారు నువ్వు మాలో కలి శావని అనుమానించి నిన్ను చంపేద్దా మన్నంత కోపంగా ఉన్నారు. కనక నువ్వు వాళ్ల దగ్గరి కెల్లనూ పోలేవు. ఇక నువ్వు మూడో పార్టీ స్థాపించాలను కున్నా నీకు అనుచరు లెవ్వరూ లేకపోవటం మూలాన అది లాభం లేదు కనక మా పార్టీలో చేరటం తప్ప నీకు గత్యంతరం లేదు."

సిల్వర్ ఉపన్యాసం వల్ల ఒక విషయం స్పష్ట పడింది. నా మిత్రు లెవ్వరూ చనిపోలేదు అందుచేత వాళ్లకు నాపై కోపం వచ్చిందన్నమాట ఎలా వున్నా నా మనస్సు కొంత శాంతించింది.

"అబ్బాయ్ జిమ్! నువ్వు మా చేతుల్లో చిక్కా

వని నిన్ను బాధిస్తామేమోనని భయపడకు. నీ కిష్టం అయితే మాలో చేరు. ఇష్టం లేకపోతే మరి నీ ఉద్దేశ్య మేమిటో చెప్పు", అన్నాడు సిల్వర్.

వణుకుతున్న కంఠంతో నేనన్నాను: "జవాబు చెప్పమంటావా?"

"చెప్పమనే అడిగేది. తొందర లేదు. బాగా ఆలోచించుకుని సావకాశంగా చెప్పు".

"అయితే ఇదుగో, నేను తెలుసుకోవలసిన సంగతులు కొన్ని వున్నాయి. అసలేమి జరిగింది? మీ రిక్కడికి ఎల్లా వచ్చారు? నా స్నేహితు లెక్క డున్నారు?"

"ఏమ్, జాగ్రత్తగా మాట్లాడు అవన్నీ నీకు చెప్పటానికి వీల్లేదు", అన్నా డొక కళాసీ.

"ఒరేయ్, నువ్వు నోర్మూయ్యరా. నే నిక్కడ మాట్లాడుతుండగా నీ కెందుకు మధ్యలో," అని గదమాయించాడు సిల్వర్ ఆ కళాసీని. మళ్ళీ నా కేసి తిరిగి చెప్పాడు: "నిన్న మధ్యాహ్నంగావును, డాక్టరు లివ్ సే సంధి జెండా పుచ్చుకుని మాదగ్గరికి వచ్చారు. వచ్చి "కెప్టెన్ సిల్వర్! మన పని ఆఖరు హిస్పానియోలా మాయమయింది," అన్నారు మేము అబద్ధ మనుకున్నాం. తీరాచూస్తే రేవులో ఓడ లేదు గీడ లేదు డాక్టరు గారన్నారు: "కెప్టెన్ సిల్వర్! ఇక మనం. ఎవరిదారి వాళ్ళు చూసుకోవలసిందే. యుద్ధం మానే

ద్దాం. ఈ మట్టికోటను, అందులోని సామాను మీరు తీసుకోండి. మాదారిన మమ్మల్ని పోనివ్వండి," అని బతిమాలారు. సరే అని మేము ఒప్పుకున్నాం. వాళ్లు ఎక్కడున్నారో మాకు తెలియదు."

"ఇంతేనా" అని అడిగాను.

"ఆ. నువ్వు వినదగింది ఇంతే." అన్నాడు సిల్వర్

"నేనేం చెయ్యదలచు కున్నానో చెప్పమంటావా?" అన్నాను.

"చెప్పు"

"విను. జాగ్రత్తగా వినండి అంతా. నేను కుర్రాణ్ణిగదా అని డబాయిద్దామనుకుంటున్నారేమో. అదేం లాభంలేదు మీరు నన్ను మోసగించలేరు. మీకు ఓడ దక్కలేదు, ఫ్లింట్ డబ్బు దక్కలేదు, మనుషులు దక్కలేదు. మీరు ఓడిపోయారు. దీనికి కారణం ఎవరో తెలుసా? నేను. ఆరోజు రాత్రి ఆపిల్ పీపాలో దాక్కుని, మీకుట్రనూవత్తూ విని మా వాళ్ళకు చెప్పింది నేను. హిస్పానియోలా లంగరుతాళ్లు తెంపి, దానిమీదవున్న కాపలా వాళ్ళిద్దర్ని నము ద్రానికి బలియిచ్చింది నేను ఓడను మీ కెవ్వరికీ తెలియనిచోట దాచింది నేను. కనక మీరు నన్నేదో డబాయించాలని చూస్తే పప్పులుడకవు. నేనూ మిమ్మల్ని డబాయించాల్సింది. మీరంటే నాకేం

భయంలేదు. చంపాలనుకుంటే చంపండి. నన్ను చంపి నందువల్ల మీకేమీ లాభంలేదు. నన్ను వదిలేస్తే మీ ప్రాణాలు రక్షించటానికి ప్రయత్నిస్తాను."

నేను ఊపిరి తిప్పుకోటానికి ఆగాను. ఇంతసేపు ఖలాసీలు నిశ్చేతనులై నాకేసి నోళ్ళు తెరుచుకుని చూస్తున్నారు. చివరికిలా అన్నాను:

"సిల్వర్! ఇక్కడున్నవాళ్ళలో నువ్వే మంచి వాడివి. నన్ను చంపేస్తే చంపెయ్. కాని ఒక్క కోరిక చెల్లించు. డాక్టరుగారితో నేను వాళ్ళకు ద్రోహం చెయ్యలేకనీ, అంతా మంచి బుద్ధితోనే చేశానని చెప్పు. ఇంతే నే కోరేది."

"జిమ్! అల్లాగే. జ్ఞాపక ముంచుకుంటాను నువు చెప్పింది," అన్నాడు సిల్వర్. అతని ధోరణి చూస్తే హేళనగా అన్నాడో, లేక నాధైర్యానికి మెచ్చు కోలుగా అన్నాడో అర్థంకాలేదు.

"ఈ కుర్రాడింకోటికూడా చేశాడు అప్పుడు నల్లకుక్కను కనిపెట్టింది కూడా ఇతనే" అన్నాడు మోర్గన్. మోర్గన్ అంటే ఆరోజున బెలిస్కోప్ హోటల్లో సిల్వర్‌తో మాట్లాడిన మనిషే.

"తస్సదియ్య. జిమ్ హాకిన్స్ బలేవాడులే. బిల్లీ బోన్సు దగ్గిరనుంచి కాంచనద్వీపపటం కొట్టేసింది కూడా ఇతనే. మొదటినుంచీ మనకి అడ్డంగానే వున్నాడు," అన్నాడు సిల్వర్.

"అయితే సరే ఈ దెబ్బతో", అంటూ మోర్గన్ బాకుతీసి నా వేపు నడిచాడు.

"ఆగు," అని అరిచాడు సిల్వర్. "ఎవర్రా నువ్వు? టామ్ మోర్గన్‌వి కాదూ? నాయకుడు నువ్వా నేనా? తప్పదియ్యా, ఒక్కడుగు ముందుకు వేశావంటే గుద్దుకు చంపేస్తాను జాగ్రత్త. ముప్ఫయ్యేళ్లనుంచీ నామాటకి ఎదురుచెప్పి బతికినవాడు లేడు ఈ రోజుకు నువ్వు బయాల్దేరావేం? తప్పదియ్యా అందర్నీ ఊచకోతగా నరికేస్తాను ఏమనుకుంటున్నారో?" అని అడ్డం వచ్చాడు సిల్వర్.

మోర్గన్ ఆగాడు. కాని మిగతా వాళ్ళలో గుసగుసలు అధికమయ్యాయి.

"మోర్గన్ ఏం తప్పు చేశాడు?" అడిగాడొకడు.

"చాలా రోజుల్నించి చూస్తున్నాను, నీ ధోరణి. అంతా నీ ఇష్టమే తప్ప మా ఇష్టం లేదా" అన్నాడింకొకడు

నోట్లోంచి పైప్ తీసి సిల్వర్ తన అనుచరులందర్నీ ఒకసారి కలయచూశాడు.

"అయితే మీరంతా నాతో దెబ్బలాటకి సిద్ధంగా వున్నారా? మాట్లాడరేమర్రా ఒక్కళ్లూ? మీకు నోళ్లులేవ్రా? ఇన్నేళ్లు బతికి మీలాంటి వెధవ సన్నాసులకి జడుస్తాన్రట్రా! రండి. కత్తి తీసుకుని

ముందుకు రండి ఎవరు వస్తారో? ఈపైప్ ఆరిపోయే లోగా వాణ్ణి నరకానికి పంపిస్తాను, తప్పదియ్యా"

ఎవ్వరూ కదల్లేదు. ఎవ్వరూ నోరెత్తలేదు. సిల్వర్ మళ్లీ పైప్ నోట్లో పెట్టుకుని "ఏం? ఒక్కడికీ దమ్ములు లేవా. ఛీ! మీ మొహాలు చూస్తే రోతొస్తోంది. ఒక్కడికీ మొగతనం లేదు నేను ఘూకు కెప్టెన్ని నన్ను మీరే ఎన్నుకున్నారు మీ అందరిలోకీ నేనే మొగాణ్ణి కనక నన్నే ఎన్నుకున్నారు. మీకు నేనిష్టం లేకపోతే ఎవరైనాసరే ముందుకువచ్చి యుద్ధం చెయ్యండి అది మీకు చేతకాకపోతే నేను చెప్పినట్టు వినండి. ఆ కుర్రాడు మీకంటే నయం. అతనికున్న ధైర్యంలో పదోవంతు లేదు మీకు అతనిమీద చెయ్యి వెయ్యదలుచుకున్న వాడెవడో ముందుకు రండి."

తరవాత కొంతసేపు అందరూ నిశ్శబ్దంగా వున్నారు సిల్వర్ నాతరఫున వాదించటంతో నాకు కొంచెం ఆశారేఖ తోచసాగింది. కళాసీలు ఒకమూల చేరి కొంతసేపు గుసగుసలాడారు. సిల్వర్ పెట్టె మీద కూర్చుని పైప్ తీసి ధ్యానంలో పడ్డాడు. అయినా ఒక కంటితో అనుచరుల్ని కనిపెట్టడం మానలేదు. చివరికి తుపుక్కున ఉమ్మేసి ఇలా అన్నాడు:

"మీరేదో చాలా చెప్పాలనుకుంటున్నారల్లే వుందే? చెప్పండి త్వరగా"

"సిల్వర్! నువ్వు నీ ఇష్టం వచ్చినట్లు చేస్తున్నావు. మాకు చాలా అసంతృప్తిగా వుంది. ప్రతి

ఓడసిబ్బందికీ కొన్ని హక్కులుంటాయి కొన్ని నియమాలుంటాయి. మా హక్కుల్ని నియమాల్ని నువ్వు పాటించడంలేదు. అందుచేత మేము కొంతసేపు ఆలోచించుకోవాలనుకుంటున్నాం," అని దురుసుగా అన్నాడొకడు.

"మీ యిష్టం వచ్చినంత సేపు ఆలోచించుకోండి," అన్నాడు సిల్వర్.

ఇందాకటి కళాసీ సిల్వర్‌కు సెల్యూట్ చేసి అవతలికి పోయాడు. ఇంకొకడు సిల్వర్‌కు చాలా వినయంగా సెల్యూట్ చేసి తడబడుతోన్న అడుగులతో బయటికి వెళ్లాడు. ఇల్లా ఒకళ్ల తర్వాత ఒకళ్లు సెల్యూట్ చేసుకుంటూ పోయారు. నేను, సిల్వర్ మాత్రమే మట్టికోటలో మిగిలాము. సిల్వర్ నోట్లోంచి పైప్ తీసివేసి మొదలెట్టాడు:

"జిమ్! వెంట్రుకవాసిలో నీకు చావు తప్పింది, నన్ను వాళ్ళు తొలగిద్దామనుకుంటున్నారు. కాని నీకేమీ అపాయం రానివ్వను అసలు నువ్వు ఇందాక మాట్లాడిందాకా నిన్ను రక్షించాలనుకోలేదు. కాని నీ ధైర్యంచూసి, ఆశ్చర్యపోయాను. నిన్ను రక్షిస్తే నన్నుకూడా నువ్వు రక్షించగలవనుకున్నాను."

"నేను చెయ్యగలిగింది చేస్తాను," అన్నాను.

"ఏం లేదు. అవసరమొచ్చినప్పుడు నాకు సహాయం చేస్తానని మాటివ్వు. తక్కింది నేను చూసు

కుంటాను. ఈవెధవలలో ఒక్కడికీ బుర్రలో మెదడు లేదు. నాకు మెదడున్నది అందుచేత నే నిప్పుడు జమీందారుగారి పక్షం చేరిపోయాను. ఆఓడ నెక్కడ దాచావోగాని, భద్రంగా వుందని నాకు తెలుసు. హాంక్సని, ఓబ్రియన్ని ఆఖరు చేశావనీకూడా తెలుసు. కనక చూడు. నువ్వూ నేనూ కలిసి వీళ్ళ కళ్ళలో దుమ్ముకొట్టి తప్పించుకోవాలి."

సిల్వర్ పైనుంచి లేచాడు. పెట్టె తెరిచి బ్రాందీ సీసా తీశాడు.

కాస్త దాహం పుచ్చుకుంటావా జిమ్?"

"అక్కర్లేదు"

"సరే, నేను పుచ్చుకుంటాను. ఇప్పుడు ఈ వెధవలతో కాస్త చెయ్యా చెయ్యా కలపాల్సి వస్తుందేమో? అన్నట్లు జిమ్! మీ డాక్టరుగారు ఆ పటం నాకు ఎందుకిచ్చేశాడంటావ్ ?"

నేను తెల్లబోతూ చూశాను నాకా విషయం ఏమీ తెలియదని గ్రహించాడు గావును సిల్వరు మరి దానిసంగతి ఎత్తలేదు.

"ఇచ్చాడులే, నీకు తెలియదేమో? కాని అందులో ఏదో మోసం వున్నట్లు నాకు అనుమానం." అంటూ సిల్వర్ గడగడ బ్రాందీ తాగాడు.

# 28. మళ్లీ నల్లచుక్క.

మట్టికోట ఆవరణలో సముద్రపు దొంగలు సమావేశమై రహస్యచర్చలు చేస్తున్నారు. కొంత సేపటికి వాళ్లలో ఒకడు లోపలికి వచ్చి కాగడా కావాలన్నాడు తీసుకుపొమ్మన్నాడు సిల్వర్. మే మిద్దరం చీకట్లో మిగిలాము.

దొంగలు ఏం చేస్తున్నారో చూడా లనిపించింది. గోడవద్దకు వెళ్ళి కన్నంగుండా తొంగిచూశాను. కంచె దగ్గరగా అందరూ గుమిగూడి వున్నారు. మధ్యలో ఒకడు కూర్చుని చేతిలో ఒక పుస్తకం పట్టుకున్నాడు. వాడిపక్కన మరొకడు కాగడా పట్టుకుని వెలుగు చూపిస్తున్నాడు. మిగతా వాళ్ళు వంగుని చూస్తున్నారు రెండు నిమిషాల తరవాత లేచి అంతా మట్టికోటకేసి రాసాగారు. నేను ఏమీ ఎరగనట్లు గది మధ్యలోవున్న కర్రల బల్లపక్కన కూర్చున్నాను.

బిలబిలమంటూ కళాసీలు లోపలికి వచ్చారు. సిల్వర్‌ను చూస్తూ నుంచున్నారు.

"ఏం సందేహిస్తారేం ?. ఏ మాలోచించుకున్నారు? చెప్పేదేదో వెంటనే కక్కండి." అన్నాడు సిల్వర్ నిర్లక్ష్యంగా

కళాసీలు తమలో ఒకణ్ణి ముందుకు నెట్టారు. వాడు సిల్వర్‌కు గజందూరంలోనే జంకుతూ ఆగాడు.

"మింగెయ్యనులే; ఏమిటీ సంగతి?"

కళాసీ సిల్వర్‌ను ఇంకా సమీపించి, తన కుడి చేతి గుప్పిలిని సిల్వర్ ఎడమచేతి గుప్పిలిలో ఉంచి, వెనక్కి వచ్చేశాడు. సిల్వర్ తన గుప్పిలి తెరిచిచూసి, లేచాడు.

"తస్సదియ్య, నల్ల చుక్క! అవును, నేనూ అదే అనుకున్నాను. మీకీ కాగితం ఎక్కడ దొరికింది? అరె! బైబిల్‌లోనుంచి ఈ కాగితం చింపారా? ఓరి వెధవాయల్లారా, పవిత్ర గ్రంథాన్ని చింపవచ్చునట్రా?"

"నేను వద్దంటున్నా డిక్ చింపాడు," అని మోర్గన్ గొణిగాడు.

"డిక్! క్షమించమని ప్రార్థన చేసుకో..."

"సిల్వర్! మేమంతా కలిసి చర్చించి నీకు నల్ల చుక్క ఇచ్చాము. అది తిప్పిచూడు. ఏమి రాసివుందో; తరవాత మాట్లాడుదువు గాని," అన్నాడు పిల్లికళ్ళ కళాసీ ఒకడు.

"బాగా చెప్పావు జార్జ్! నువ్వు వ్యవహారాలు నడపడంలో దిట్టమైనవాడివి. తస్సదియ్య నల్లచుక్కను చూడమని నాకు ఆజ్ఞాపిస్తున్నావు కదూ?" చూస్తాను. 'నిన్ను తొలగించాము'—అంతేనా? సరే. ఎవడిదో గారి ముత్యాలలాగా వుంది దస్తూరి. నీదేనా జార్జ్? సరే ఇంకేం. తస్సదియ్య గొప్పవాడివైపోతున్నావే?

ఫరవాలేదు నువ్వే కెప్టెన్ వౌతావు నా తరవాత. కాస్త ఆ కాగడా అందించరా, పైన ఆరిపోయింది."

"సిల్వర్!" అన్నాడు పిల్లికళ్ళ జార్జి. "నువ్వు మమ్మల్ని బుట్టలో వేసుకుందామనుకుంటున్నావేమో యింకా? నువ్వు తమాషామనిషివే గాని, ఇప్పుడు నీ పప్పులేం ఉడకవు. రా, వోటింగు ప్రారంభిద్దాం

"వోటింగా? తొందరలేకాలే దానికి. ఇంకా నేను మీ కెప్టెన్ నే. మీకు కళాసీల నియమాలు, హక్కులు తెలుసని ఇందాక అన్నారు. తెలియవని ఇప్పుడు బుజువవుతోంది. ఎందుకంటే ముందు నన్ను ఎందుకు తొలగిస్తున్నారో చెప్పనిదే నేను తొలగి పోను అందాకా ఈ నల్లచుక్క గడ్డిముక్కతో సమానం," అని సిల్వర్ చెప్పాడు.

"ఓ. నీకు కారణాలు కావాలా సిల్వర్? అయితే విను," అన్నాడు జార్జి. "మన సిబ్బందిలో ఇంతమంది చచ్చిపోయారంటే, మన కృటలంతా నాశనమైందంటే దానికి నువ్వే కారణం. రెండు: శత్రువులు ఈ నుట్టికోటనుండి దాటి పోతుంటే వాళ్ళ నెదిరించలేకపోయావు. మూడు: పోనీ తరవాతనైనా వాళ్ళని ముట్టడించుదామనుకుంటే అదీ వద్దన్నావు నువ్వు. నాలుగు: ఈ కుర్రాడు జిమ్ మన చేతిలో చిక్కాడు. వాణ్ణి కూడా చంపనివ్వలేదు నువ్వు ఈ నాలుగు కారణాలకీ ఏం జవాబు చెబుతావో చెప్పుకో"

"ఇంతేనా. ఇంకేమైనా వున్నాయా?"

"ఇప్పటికి వీటికి సంజాయిషీ ఇద్దాం. తర్వాత కావలిస్తే చెప్తా నింకా."

"జార్జ్! వరసన అన్నిటికీ సమాధాన మిస్తాను విను. ఒకటి: ఇంతమందీ చచ్చారంటే నావల్ల నే నన్నావు మొదట్లో నేచెప్పింది మీకుజ్ఞాపకముందా? నే చెప్పినట్లు చేస్తే ఇవ్వాళ రాత్రికల్లా బంగారమంతా తవ్వి తీసివుంచేవాళ్ళం. ఒక్క మనిషి కూడా భీరు పోకుండా అందరం హిస్పానియోలాలో తెరచాపలెత్తి బయలుదేరి వుండేవాళ్ళం, అయితే నేను చెప్పిన మాటకు వ్యతిరేకించిం దెవరు? జాబ్ ఆండర్సన్, ఇస్రాయెల్ హాండ్స్, జార్జ్. వీళ్లే నన్ను కాదని తోసివేసింది. నేనేం చెయ్యగలను, ఇప్పుడు తప్పంతా నా మీదికి తోసివేస్తే."

సిల్వర్ ఆగి స్నేహితులవంక పరకాయించి చూశాడు. అతను చెప్పినదాంట్లో అసంబద్ధ మేమీ లేదని వాళ్లు ఒప్పుకున్నట్లే కనిపించారు.

"మొదటిపిర్యాదు అయింది. నాలుగోపిర్యాదు ఏమిటి? ఈ కుర్రాణ్ణి ఎందుకు చంపలేదని. ఈ కుర్రాణ్ణి చంపుకుంటే మనకు వచ్చే లాభమేమిటి? ఇతను మనదగ్గర ఉన్నాడని తెలిస్తే, మనం ఏ మాట చెబితే ఆ మాట వచ్చినట్టు వింటారు వాళ్ళు. ఈ కుర్రాడివల్ల మన కెంత లాభం కలగబోతుందో

మీరే చూస్తారు. ఇక మూడో ఫిర్యాదు. వాళ్ల మీద ఎందుకు ముట్టడి చెయ్యలేదని. ఆగుగంటలకింద మీరే స్థితిలో వున్నారో మర్చిపోయినట్లున్నారు. జార్జ్! నీ మొహం పచ్చబడింది; తన్నదియ్యా, కాళ్ళు చేతులు గిజగిజ బల్లిలాగ కొట్టుకున్నావు నీ గుడ్లు తేలిపో తున్నాయి. మీలో ప్రతిఒక్కడూ అదే మాదిరిగా ఉన్నాడు. డక్టర్ లివ్ సేవచ్చి మీకు రోజూ వైద్యం చేస్తానని ఒప్పుకున్నాడు. ఆయన నిన్న వైద్యం చెయ్యకపోతే అంతా ఈ పాటికే కుటుక్కుమని ఉండేవాళ్ళు. ఆయన ఇంకాస్సేపటిలో వచ్చి మళ్లీ వైద్యం చేస్తాడు. అంత మంచి డాక్టరును చంపుకునే టంత తెలివితక్కువ వాళ్లన్నమాట మీరు. మూడు ఫిర్యాదుంకు జవాబిచ్చాను. రెండో ఫిర్యాదు: మట్టికోటలో నుండి వాళ్లనెందుకు దాటి పోనిచ్చామని దానికికూడా సమాధానం కావాలా జార్జ్?"

"చెప్పు," అన్నాడు జార్జ్ వంచిన తల ఎత్తకుండా.

"ఇదిగో ఇందుకు—" అని అరిచాడు సిల్వర్ అతికోపంగా జేబులో నుండి ఒక పచ్చకాగితం తీసి నేలకు విసిరి కొట్టాడు. అది కాంచనద్వీపపటమని వెంటనే గుర్తుపట్టాను.

జార్జి ఆ కాగితం తీసుకుని మడతవిప్పి ముందు కెళ్లబోయాడు. పక్కవాడి కందించాడు. వాడి ఆనం

దం వర్ణించ తరంకాదు. వాడి చేతిలోనుంచి ఇంకోడు, వాడి చేతిలోంచి ఇంకోడు లాక్కుని ఆత్రంగా ఆ కాగితాన్ని చూపుల్తో మింగేస్తున్నట్లు చూశారు "టంరోయ్ పటం" అని ఒకడు గంతులు వేశాడు. సిల్వర్ చేతిలోకి పటం ఎలావచ్చిందో నాకర్థంకాలేదు. కాని ఆ కళాసీల ముఖాలు చూడవలసినవి. వాళ్ళు తమ కళ్ళను తామే నమ్మలేకపోయారు. ఎర్ర గుర్తులతో సహా అసలైన కాంచనద్వీపపటమే అది.

జార్జికి సిల్వర్ మీద ఇంకా విధేయత, విశ్వాసం కుదరలేక ఇలా అన్నాడు: "పటం దొరికిందని చంకలు కొట్టుకోనక్కర్లేదు. ఓడ ఏమైందో తెలియదు. ఇక్కడ నుంచి బయటపడటం మెల్లా?"

సిల్వర్ మొహం కోపంతో జేవురించింది. పిడికిలి బిగించి ఊపుతూ అరిచాడు: "జార్జ్! నా కనవసరంగా కోపం తెప్పించకు. నీతో ద్వంద్వయుద్ధం చెయ్యగలను. ఎల్లా బయటపడటమని నన్నడుగుతావేం? నాకేం తెలుసు? నా పథకానికి అడ్డొవచ్చిన నీకూ నీ స్నేహితులకే తెలియాలి. ఊహలు మీవి వట్టిబుర్రలు. మీకు తెలియదు. దానికీ నేనే ఉపాయం కనిపెట్టాలి."

ఎవ్వడూ నోరెత్తలేదు. సిల్వర్ ముఖంలోకి చూడలేక అందరూ తికమక పడుతూ మొహాలు వేలాడేసి నుంచున్నారు. సిల్వర్ ప్రారంభించాడు:

“తస్సదియ్యా, ఒక్కడికీ నోరెత్తే దమ్ముల్లేవు ఎల్లా వుంటాయ్? మీరు ఓటును పోగొట్టుకున్నారు. నేను బంగారం సంపాదించి పెట్టాను. ఇక మీ రేమన్నా అనుకోండి. నేను రాజీనామా ఇచ్చేస్తున్నాను. నాదోవన నే పోతాను మీ రింకోణ్ణి ఎన్నుకోండి.”

“సిల్వర్! సిల్వర్! నువ్వే కెప్టెన్ వి. నువ్వే వుండాలి శాశ్వతంగా నువ్వే మాకు కెప్టెన్ వి,” అని అందరూ అరిచారు.

“సరే మీరు కోరితే నేను కాదనను. జార్జ్ నువ్వు ఇంకా కొంత కాలం ఆగాలి కెప్టెన్ కావడానికి. అంతే కాదు, నేను పగ తీర్చుకునే రకం మనిషిని కాను గనుక అదృష్టవంతుడివి; బతికిపోయావు అయితే ఈ నల్ల చుక్క. పారెయ్యవచ్చునా? డిక్! అనవసరంగా నీ బైబిల్ పాడు చేసుకున్నావు.”

సిల్వర్ నల్ల చుక్కను నాకిచ్చాడు.

“జిమ్! ఇదిగో నల్ల చుక్క. తీసుకో.” అన్నాడు. నల్ల చుక్కను తీసుకుని చూశాను. గుండ్రంగా వున్నది. ఒక వైపున బొగ్గు మసి పూయబడింది. అయినా బైబిల్ లోని అన్ని అక్షరాలు కనిపిస్తూనే వున్నాయి. రెండో పక్కన సిల్వర్ ను కెప్టెన్ పదవి నుంచి తొలగిస్తున్నట్లు రాయబడి వుంది (ఈ కాగితం ముక్క నాదగ్గిర ఇప్పటికీ వుంది. కాని చేత్తో రాసిన అక్షరాలు చెరిగిపోయినాయి.)

ఆ రాత్రికి ఆ వ్యవహారం అయిపోయింది. తరవాత తలొక గ్లాసూ రమ్ము దాహంపుచ్చుకున్నారు. తరవాత ఎవళ్ళ చోటులో వాళ్లు చేరి నిద్రపోయారు. సిల్వర్ కు జార్జిమీద ఇంకా కోపంగానే ఉన్నట్లుంది. వాడికి శిక్షగా ఆ రాత్రంతా కాపలా కాయవలసిందని ఆజ్ఞాపించాడు. ఈమాటు తన నెదిరిస్తే పొడిచి పారేస్తానని బెదిరించాడు.

నన్ను ప్రాణాపాయం నుండి రక్షించినందుకు సిల్వర్ కు లోలోపలే ధన్యవాదాలర్పిస్తూ పడుకున్నాను. కాని ఎంతసేపటికీ నిద్ర పట్టలేదు. సిల్వర్ ఎంత చాకచక్యంగా తన అనుచరుల తిరుగుబాటును అణిచివేశాడో తలుచుకుంటే ఇప్పటికీ నా కాశ్చర్యం కలుగుతుంది. ఆ రాత్రి మాత్రం నాకు ఎంతసేపటికీ నమ్మకం కలగలేదు, నేను పూర్తిగా సురక్షితుణ్ణి. అపాయాన్ని ఏ నిమిషంలో ఎలాపోయి ఎటువస్తుందోనని ఆందోళన చెందుతూ ఎప్పుడో నిద్రలోకి జారాను.

## 29. డాక్టర్ లివ్సే

తెల్లవారవస్తుండగా నన్నెవరో లేపారు. నన్నే కాదు ద్వారంవద్ద కాపలావున్న జార్జితో సహా అందర్నీ లేపారు. కంచెకవతల నుంచున్న డాక్టర్ లివ్సేగారి కేకలే మమ్మల్ని లేపాయనుకుంటాను.

డాక్టర్ గారి కంఠం వినగానే నాకు ప్రాణం లేచి వచ్చింది. కాని కొంత భయంకూడా కలుగక పోలేదు. నేను మిత్రులతో చెప్పకుండా పారిపోయినందుకు మనస్సు ఇంకా కలత పడుతూనే వుంది. అందులో శత్రువుల ముఠాలో చేరినట్లు ప్రత్యక్షంగా కనిపిస్తూ ఆయనకి ఏ ముఖం పెట్టుకుని చూడగలను?

"డాక్టర్! మీరా? రండి, రండిసార్!" అంటూ సిల్వర్ విశ్వాసము వేది కంఠంలో కూడా ఎరగనంత ఆప్యాయంగా ఆహ్వానించాడు. "చాలా చీకటితో లేచివచ్చారే! జార్జ్! లేచి ముందుకి డాక్టర్ గారికి సెల్యూట్ చెయ్యి. మీ రోగులందరూ కులాసాగానే వున్నారండి సార్! అంతే గాదు. మీకో తమాషా చూపిస్తాను రండి త్వరగా."

డాక్టరుగారు కంచెదాటి ఆవరణంలోకి వచ్చారు. సిల్వరు చూపిస్తానన్న తమాషా ఏమిటో నాకు తెలుసు. డాక్టరుగారు లోనికి రాగానే సిల్వర్ నన్ను రెక్క పట్టుకుని ముందుకు తీసుకొచ్చాడు.

"జిమ్ హాకిన్స్! ఇక్కడ?" అని ఆశ్చర్య పోయారు డాక్టరుగారు.

"అవును జిమ్ హాకిన్సే. మీ జిమ్ హాకిన్సే," అన్నాడు సిల్వర్.

"సరే, ఆసంగతి తరవాత చూద్దాం. ముందు రోగులను పరీక్ష చెయ్యనియ్," అన్నారు డాక్టరుగారు.

ఆయన శత్రుమధ్యంలో వున్న సంగతి మరచిపోయి నట్లే, తన ప్రాణం వీరి చేతుల్లో వున్న సంగతి ఎరగనట్లే ప్రవర్తిస్తున్నారు.

తలకు కట్లు కట్టుకున్న ఒక కళాసీని పరీక్షించి "నువ్వు బాగా నేవున్నావు. గాయం నయమయిపోయింది. జార్జ్! నీ కెల్లా వుంది? అరె, నీ లివర్ తల్లకిందులైనట్టుందే? ఆ మందు పుచ్చుకున్నావా? జార్జి నేనిచ్చిన మందు తాగాడ?" అన్నారు లివ్ సే.

"తాగాడండి సార్!" అన్నాడు మోర్గన్.

"సరి, మంచిది. నేను సముద్రపు దొంగల డాక్టర్ని. ఉహు, కాదు; ఖైదీల డాక్టర్ని. ఎందుకంటే వీళ్లెంత ఎక్కువమందిని కోర్టులో హాజరుపరచి ఉరి కొయ్య ఎక్కించాలని నా ఆశయం. అందుచేత మీలో ఒకడుకూడా చావకుండా నేను జాగ్రత్త పడాలి" అన్నారు డాక్టరు కొంటెగా నవ్వుతూ.

కళాసీలు వెర్రి మొహాలేసి డాక్టరుగారి ఛలోక్తిని చేదుమాత్ర మింగినట్టు మింగారు.

"డిక్ కి జబ్బు ఎక్కువైందండి," అన్నాడొకడు.

"అల్లాగా? డిక్! ఏదీ ఇట్రా. రోగం తెలు. నాలిక జాచు. అబ్బ నీనాలికచూస్తే ఫ్రెంచివాళ్లు కూడా హడలిపోతారు. వణుకుతున్నావేం? చలి వుందా?"

"వద్దురా అంటుంటే బైబిల్ కాగితం చింపాము.

మరి జ్వరం రాక ఏం చేస్తుంది?" అని గొణుక్కున్నాడు మోర్గన్.

"బైబిల్ చింపినందుకు కాదు నేస్తం! గాడిదల్లాగా ప్రవర్తించినందుకు; నమ్మినవాళ్లపై కత్తికట్టినందుకు. ఈ మలేరియా వదలటానికి మీరు ముందు మృత్యువుతో బేరాలాడాలి. సరే డిక్! ఇదిగో యీ మందు తాగు," అని డాక్టరుగారు ఒక్కొక్కరికీ మందులు తీసియిచ్చి తాగించాడు. వీళ్లేనా హత్యలు, లూటీలుచేసే సముద్రపు దొంగలు, అనిపించింది. డాక్టరుగారి ముందు స్కూలు కుర్రాళ్ళ లాగ అయిపోయారు హంతకులు. అంతా అయిపోయిన తర్వాత లివ్సేగారు నావంక చూసి "సిల్వర్! జిమ్‌ని కాస్త బయటికి పంపించు. అతనితో మాట్లాడాలి," అన్నారు నిర్లక్ష్యంగా.

జార్జి ద్వారంవద్ద నుంచుని మందు చేదుగా వుంది కాబోలు ఖాండ్రించి ఉమ్మేస్తున్నాడు డాక్టరుగారి మాట వినగానే, "వీల్లేదు," అని అరిచాడు.

"నోర్ముయ్!" అని గర్జించాడు సిల్వర్. తరవాత డాక్టరుగారితో "సార్ అలాగేనండి. జిమ్‌ని అవతలికి తీసుకువెళ్లి మాట్లాడండి. మీరు మామీద చూపించిన దయకి కృతజ్ఞుణ్ణి. మీరు మంచివారని తెలుసు కాబట్టే మీరు విషమేయిస్తున్నారో, మందేయిస్తున్నారో కూడా ఆలోచించకుండా యీ సన్యాసి

గాళ్లంతా తాగారు. హాకిన్స్! నువ్వు ఒట్టేసుకో, డాక్టరుగారితో మాట్లాడి వెనక్కి వస్తానని, పారిపోనని."

నేను తిరిగి వస్తానని ఒట్టేసుకున్నాను.

"అయితే సార్, మీరు కంచె అవతలనుంచోండి. జిమ్‌ని నేను తీసుకొస్తాను. అతడు కంచె ఇవతలనుండి మీతో మాట్లాడుతాడు. జమీందారుగారికీ, కెప్టెన్ స్మాలెట్ గారికీ మా నమస్కారాలు చెప్పండి."

డాక్టరుగారు అవతలకు వెళ్ళారు. వెంటనే సిల్వర్ అనుచరులు అతన్ని నిందించనారంభించారు. జమీందారుగారి పక్షాన చేరాలని చూస్తున్నాడని, తమ్మల్ని మోసగించాలని ఎత్తు వేస్తున్నాడని దూషించారు. సిల్వర్ అరణ్యమంతా మారుమోగేట్లు హుంకరిస్తూ, "మీరంతా చవటలు. వెధవలు, మూర్ఖులు," అని తిట్టాడు. ఆ తిట్లవరదకు అనుచరులంతా భయపడి కిమ్మనకుండా నోరుమూసుకున్నారు. సిల్వర్ విజయ గర్వంతో నా బుజంమీద చెయ్యివేసి బయటికి వచ్చాడు.

డాక్టరుగారు మందులపెట్టె పట్టుకుని కంచె ఆవల నాకోసం నిరీక్షిస్తున్నారు. ఆయన్ని సమీపించగానే సిల్వర్ మెల్లిగా అన్నాడు:

"డాక్టరుగారూ! జిమ్ హాకిన్స్ చెబుతాడు మీకు నాసంగతి. నా అనుచరుల నందరినీ ఎదిరించి అతని ప్రాణాలు ఎలా రక్షించానో చెబుతాడు. మీరు

నన్నో కంటితో కనికరించి చూడాలి. నేనేమన్నా అప
రాధం చేస్తే క్షమించాలి," అన్నాడు సిల్వర్.

"ఏం భయపడుతున్నావా కెప్టెన్ సిల్వర్?"

"భయం కాదండి సార్. ఈ పిరికిపందలు నన్నేం చెయ్యలేరు. అది కాదు; నాకు జైళ్లు, విచారణలు, ఉరికొయ్యలు ఇవన్నీ అంటే అసహ్యమండి. అంచేత నన్ను దయచూడాలని కోరుతున్నాను సరే నేను దూరంగా అక్కడ కూర్చుంటానండి. మీరు జిమ్ మాట్లాడవలసింది మాట్లాడండి," అంటూ సిల్వర్ మామాటలు వినబడనంత దూరానికిపోయి ఒకకొయ్య దుంగపై కూర్చుని పైప్ కాలుస్తున్నాడు. అప్పుడప్పుడు మా కేసి, ఒక్కొక్కసారి మట్టికోటలో గుసగుస లాడుతున్న తన అనుచరుల కేసి దృష్టి సారిస్తున్నాను.

"జిమ్! చివరి కిదా నువ్వు చేసింది? వచ్చి వచ్చి శత్రువుల చేతిలో చిక్కావా? పైగా కెప్టెన్ స్మాలెట్ గాయం తిని బాధపడుతుండగా ఇల్లా పారిపోవటానికి నీకు మనసెల్లా వొప్పింది?" అని డాక్టరుగారు ప్రారంభించారు.

నేను ఏడవటం మొదలెట్టాను. "డాక్టరుగారూ! నేను చేసింది ముమ్మాటికీ తప్పే. క్షమించండి. నన్నెల్లాగూ వాళ్లు చంపేస్తారు. ఈపాటికే చంపేసే వాళ్ళు, సిల్వర్ అడ్డం రాకపోతే. నేను చావుకు భయ

పడటం లేదు. సముద్రపు దొంగల సంగతి మీకు తెలుసుగా చేతిలో చిక్కిన ఖైదీని చిత్రహింస పెట్టి గాని చంపరు. అదే నాకూ జరుగుతుందేమోనని భయపడుతున్నాను."

"జిమ్! అలా ఎన్నటికీ జరగనివ్వను. చెయ్యి ఇటు అందియ్యి. ఒక్క క్షణంలో వీళ్ల కళ్ళలో కారం కొట్టి పారిపోదాం."

"డాక్టరుగారూ! నేను సిల్వర్‌కి వాగ్దానం చేశానండి."

"నాకు తెలుసు. కాని నీ ప్రాణం రక్షించుకోడానికి పారిపోవటం కూడా తప్పేనా? ఒకవేళ తప్పైతే ఆపాపం, అవమానం నేను భరిస్తానులే. రా, పారిపోదాం. నిన్నిక్కడ వదలిపెట్టి పోలేను," అని డాక్టర్ లివ్‌సే నన్ను బలవంతం చేయసాగారు.

"వద్దండి డాక్టరుగారూ! మీమాట కాదంటున్నందుకు క్షమించండి. మీరే అయితే ఇలా వాగ్దానం భంగంచేసి పారిపోయేవారా? మీరే కాదు; జమీందారుగారు, కెప్టెన్ స్మాలెట్ కూడా అలా చేసేవారు కాదు. నేనుకూడా అంతే. సిల్వర్ నా వాగ్దానం నమ్మి ఇక్కడ వదిలిపెట్టాడు. ఇప్పుడు నేను నమ్మకద్రోహం చెయ్యలేను. వాళ్ళు నన్ను అంతగా హింసపెట్టేటట్లయితే హిస్పానియోలా ఎక్కడున్నదో చెబు

తానేమో. అంతకంటే మరొక్క మాటకూడా చెప్పను."

"హిస్పానియోలా ఎక్కడుంది?" అని డాక్టరు గారు చకితులై అడిగారు.

"ఉత్తర సిందుశాఖలో ఉంది. నేనే దాన్ని దెయ్యాలదీవిదగ్గర రేవునుండి తప్పించి, కాపాలా కళాసులను చంపి సింధుశాఖలో చేర్చాను. అక్కడది సురక్షితంగా ఉంది" అంటూ నేను చేసిన సాహస కృత్యాలన్నీ క్లుప్తంగా వర్ణించాను.

"ఇందులో ఏదో విచిత్రమైన భగవత్సంకల్పం ఉన్నట్లు తోస్తోంది. ప్రయాణం మొదలైన దగ్గర్నుంచి అడుగడుగునా నీ వల్లనే మేము రక్షింపబడు తున్నాము. కుట్రను నువ్వే కనిపెట్టావు బెన్‌గన్‌ని నువ్వే కనుక్కున్నావు; బెన్‌గన్ గనక నీకు ఆ రోజున కనిపించివుండకపోతే మన మిన్ని వేల మైళ్ళు రావటం శుష్కప్రయాస అయ్యేది. అన్నట్లు సిల్వర్! సిల్వర్! అని డాక్టరుగారు సిల్వర్‌ను పిలిచారు.

సిల్వర్ మా దగ్గిరికి వచ్చాడు.

"సిల్వర్! నువ్వు ఆపటం పుచ్చుకుని వెర్రివాడి లాగ పాతరకోసం వెదకబోకు. అనవసరంగా కష్టపడ తావని చెబుతున్నా," అన్నారు డాక్టరుగారు.

"కాదండి సార్. పాతరకోసం వెదక్కుండా కూర్చుంటే నాకూ, జిమ్ హాకిన్స్‌కూ కూడా అపా

యం. డబ్బుకోసం ప్రయత్నిస్తున్నట్టు కనీసం నటించ నైనా నటించాలి."

"ఎదికితే ఎనుకుదువుగాని ఆశ్చర్యపడటానికి సిద్ధంగావుండు" అన్నారు డాక్టరుగారు.

"సార్ మీరు చెప్పేది నాకేమీ బోధపడటం లేదండి. మీరు మట్టికోట నెందుకు వదిలిపెట్టారో, పటం ఎందుకిచ్చేశారో, నాకు తెలియదు. మీరేదో రహస్యం దాస్తున్నారు. ఏమిటది?"

• "ఇంతకంటే ఎక్కువ చెప్పటానికి వీల్లేదు. సిల్వర్! అది నా రహస్యం కాదు. మా అందరిదీని. అందుచేత నీకు తరవాత తరవాతగాని చెప్పటానికి వీల్లేదు. కాని ఒకటిమాత్రం నిశ్చయంగా చెప్పగలను. నువ్వు, జిమ్ హాకిన్స్‌ని రక్షించి మా పక్షాన కలుస్తే నీకు ఇంగ్లండులో ఉరిశిక్ష వగైరాలేమీ లేకుండా చేస్తాను."

సిల్వర్ మొహం చేటంతయింది. "సార్. మీరు చెప్పింది బావుంది. నాకు నచ్చింది. మీరు చెప్పినట్లు చేస్తాను."

"అచ్ఛా! గుడ్ బై. ఇక పోతాను. జిమ్, జాగ్రత్తగా వుండు," అంటూ డాక్టరుగారు చకచక నడిచి కనుమరుగైపోయారు.

# 30. గుప్తధనం కోసం

డాక్టరుగారు వెళ్లగానే నేను, సిల్వర్ మట్టికోట లోకి వెళ్లాము. కళాసీలు వంట పూర్తిచేశారు. మాకోసం ఎదురు చూస్తున్నారు. మేము రాగానే భోజనపదార్థాలన్నీ వడ్డించారు. అందరం కూర్చు న్నాం. చిలక సిల్వర్ బుజంమీద కూర్చుంది. సిల్వర్ అందరిపై ఛలోక్తులాడుతూ నవ్విస్తున్నాడు.

"అరేయ్ అబ్బాయిలూ! లాంగ్ జాన్ సిల్వర్ ఇంకా మీతోనే వున్నాడు గనక బతికిపోయారు. మనకాకావలసిన దాన్ని సంపాదించాను. ఆ ఓడ మాత్రం వాళ్ళదగ్గరే వుంది. ఎక్కడ దాచారో నాకు తెలియదు. పాతరతవ్వి బంగారమంతా సంచుల్లో పోసుకుని సిద్ధమయ్యాక అప్పుడు వెదుకుదాం ఓడ కోసం. ఓడ మనచేతికి వచ్చిందీ అంటే తప్పదియ్యి వాళ్ళపని ఆఖరే."

నోట్లో మాంసం ముక్కలు కుక్కుకుంటూ సిల్వర్ ఈరీతిగా అనుచరులను ఉషారు చేస్తున్నాడు. మనుషులను మాటలతో బుట్టలో వేసుకోడం సిల్వర్‌కు ఉగ్గుతోపెట్టిన విద్య అనిపించింది.

"ఇక జిమ్ హాకిన్స్ సంగతి. మనం ద్వీపంలోకి బయలుదేరే టప్పుడు తాడుతోకట్టి మనతో తీసుకు పోదాం. ఈకుర్రాణ్ణి మనదగ్గర తాకట్టు పెట్టారు

వాళ్లు బంగారం, ఓడ రెండూ సంపాయించాక హాకిన్సుని మీాకప్పగించేస్తాను. అతన్ని మీా యిష్టం వచ్చినట్లు చేసుకోండి."

ఈమాటలతో కళాసీలకు సిల్వర్ మీాద మరింత నమ్మకం కుదిరింది. సిల్వర్ ఏది చేసినా తమ మంచి కోసమేననే భావం కలిగినట్లుంది. నాకు మాత్రం మళ్ళీ భయాలు, సందేహాలు చెలరేగాయి. సిల్వర్ ముఖం చూసి నిజంగా అంటున్నాడో, ప్రారికే అంటున్నాడో కనుక్కోవడం కష్టం. ఒకవేళ అతనికి బంగారపు పాతర, ఓడకూడా అనుకున్నట్లే లభ్యమైతే డాక్టరు గారికిచ్చిన వాగ్దానాలన్నీ భంగంచేసి నన్ను ఒక దెబ్బతో హాత మారుస్తాడనేది నిస్సందేహం

అలాగాక అతడు నిజంగానే మా పక్షాన చేర దలుచుకున్నట్లయితే అతని కుతంత్రం మిగతావారికి తెలియకుండా ఎక్కువకాలం దాచలేడు. అప్పుడు నేను సిల్వర్ కలిసి బలాఢ్యులు, సాయుధులు అయిన ఈ కళాసీలతో పోరాడాలి. మేమిద్దరం అందరి నెదు ర్కొని బతకటం కలలోమాట.

ఇవన్నీ ఇలావుంచి నామిత్రుల ప్రవర్తన నా కింకా అయోమయ సమస్యగానే వుంది. వాళ్లు మట్టి కోట నెందుకు విడిచిపెట్టినట్టు? కాంచనద్వీప పటం సిల్వర్ కెందుకు ఇచ్చేసినట్టు? "ఆశ్చర్యపడటానికి సిద్ధంగా వుండు" అని డాక్టరుగారు సిల్వర్‌తో

ఎందుకన్నారు? ఈ ప్రశ్నలతో నామనస్సు అల్లకల్లోలమై భోజనం సయించనే లేదు.

భోజనాల తరవాత తిరుగుబాటుదారులంతా గుప్త ధనంకోసం బయలుదేరారు నేను తప్ప మిగతా అందరూ సమృద్ధిగా ఆయుధాలు ధరించారు. సిల్వర్ బుజానికి రెండు తుపాకీలు తగిలించుకున్నాడు. బెల్టుకొక కత్తి తగిలించాడు. జేబుకొక పిస్టల్ చొప్పున దాచుకున్నాడు. ఈ అవతారానికి తోడు కెప్టెన్ ఫ్లింట్ ను బుజాన ఎక్కించుకున్నాడు. ఒకమోకు నా నడుముకు కట్టి పట్టుకున్నాడు పెంపుడు ఎలుగుబంటి లాగా అతనివెనక నేను నడిచాను.

మిగతా కళాసులు రకరకాల పనిముట్లు ధరించారు. గడ్డపలుగులు, పారలు, గొడ్డళ్లు, గోనెసంచులు, తినుబండారాల సంచులు మొదలైనవన్నీ చేత పట్టుకున్నారు.

కళాసీలు సరాసరి ద్వీపంలోకి దారి తీయలేదు. వారి రెండు పడవలూ రేవులో ఉన్నాయి. వాటిని నా మిత్రులనుండి కాపాడుకోవలసిన అవసరం వున్నది. అందుచేత ముందు రేవుకు దారి తీశారు. పడవలెక్కి బయల్దేరాము. రేవుకు పశ్చిమంగా ఒక చిన్ననది సముద్రంలో పడుతున్నది. ఆనదీ ముఖద్వారం చేరి అక్కడ దిగాము.

తరవాత ఉత్తరంగా కనిపించే చిన్న కొండకేసి నడవసాగాము. దారిలో కళాసీలు ఒకళ్ళ తరవాత

ఒకళ్లు ద్వీపపటం పుచ్చుకుని పరిశీలించారు. మా ఎదురుగా రెండు మూడు వందల అడుగుల ఎత్తుగల ఒక పీఠభూమి వున్నది. దాని ఉత్తరపు వేపు వాలు టెలిస్కోపు కొండ దక్షిణపు వాలుతో కలుస్తోంది. పీఠభూమిపైన దేవదారు వృక్షాలు మబ్బుల నంటేట్లు ఎత్తుగా, ఒత్తుగా పెరిగివున్నాయి. చెట్లమధ్య అల్లి బిల్లిగా పెరిగిన అడవిలతలు మార్గాన్ని దుర్గమం చేస్తున్నాయి.

మేము సరాసరి పీఠభూమి ఎక్కడం ప్రారంభించాము. అడవి తీగెలను ఛేదించి మార్గం చేసుకుంటూ ముందుకు పోతున్నాము. ద్వీపంలో ఇప్పటి వరకూ నేనుచూసిన అన్ని ప్రదేశాల్లోకీ ఈప్రదేశమే మనోహరంగా వుంది. అడవి పువ్వులు విరియబూసి ఆహ్లాదకరమైన వాసనలు వెదజల్లుతున్నాయి. పొదలు ఒకదానితో ఒకటి పెనవేసుకుని చక్కని పొదరిళ్లుగా తయారయ్యాయి. ఏవి ఏమిటో పక్షులు చెట్లలో కనిపించకుండా దాక్కుని సంగీత ధ్వనులు చేస్తున్నాయి. సూర్యుడు తీక్ష్ణంగావున్నా చెట్ల నీడల్లోంచి నడుస్తుంటే చల్లని సముద్ర వాయువులు వీచి అలసట తీరుస్తున్నాయి.

కళాసీలు ఆత్రం పట్టలేక మాకంటే ముందుకు పరిగెత్తుతూ కేకలువేస్తూ పోతున్నారు. సిల్వర్, నేను

వెనకబడి పోయాము కుంటికాలుతో ఎత్తు ఎక్కడం సిల్వర్‌కు ఆయాసకరంగా వుంది. అనేకసార్లు నేను చేయూత ఇవ్వకపోతే కాలుజారి కింద, పడిపోయేవాడే.

ఈవిధంగా ఒక అరమైలు దూరం పోయాము. పీఠభూమి శిఖరాన్ని ఇంకా సమీపించలేదు. ఇంతలో అందరికంటే ముందుకు దూకుడుగా పోయిన ఒకకళాసీ, "అయ్యో బాబోయ్, అమ్మ బాబోయ్," అని కేకలు వేయసాగాడు. వాడికి కొంత దూరంలో వెనకవున్న కళాసీలు అ కేకలువిని ఉన్న చోటనే స్తంభించిపోయారు. నేను, సిల్వర్ వాళ్ళని సమీపించాము. సిల్వర్ దారితీశాడు. అతని వెనకాల అడుగుల్లో అడుగులు వేసుకుంటూ మిగతావాళ్లు అనుసరించారు.

కేకలు వేస్తున్న కళాసికి ముచ్చెమటలు పోసి ప్రాణం కడబట్టింది. భయంతో ముఖం పాలిపోయింది. తిరాచూస్తే వాడి భయానికి కారణమైన పదార్థం అయిదారు గజాల దూరంలో వుంది. ఒక దేవదారు వృక్షంకింద మనిషి అస్థిపంజరం ఒకటి ఉంది. దాని పక్కన శిథిలావస్థలో వున్న చొక్కా, లాగు వున్నాయి. అది చూడగానే ఒక్కసారిగా మా అందరి కాళ్లు చేతులు చల్లబడినై.

అందరిలోకీ ధైర్యస్థుడు జార్జి అస్థిపంజరాన్ని సమీపించి, గుడ్డ పేలికలను పరీక్షించాడు.

"పాపం ఎవడో కళాసీయే. ఈగుడ్డలు చూస్తే తెలుస్తోంది, అన్నాడు జార్జి."

"కళాసీ కాకపోతే మహారాజు వస్తాడను కున్నావా ఈ లంకకి? కాదుగాని ఈ అస్థి పంజరాన్ని ఎవరో మనుషులే ఇక్కడ పెట్టినట్టుగా తోస్తోంది. దానంతట అయితే ఇల్లా ఎప్పటికీ వుండదు," అన్నాడు సిల్వర్.

సిల్వర్ చెప్పింది నిజం కావచ్చు ననిపించింది. ఎందుకంటే అస్థిపంజరం ఎక్కడా వంకర లేకుండా సమానంగా వుంది. కాళ్లు ఒకదిక్కును, చేతులు తల పైకి ఎత్తబడి మరొక దిక్కును సూచిస్తున్నట్లుగా వున్నాయి.

"నాకేమని తోస్తోందంటే, ఈ అస్థి పంజరం, దిక్కులేవో చూపించటానికి ప్రయత్నిస్తోంది. చేతు లున్న వేపు సూటిగా చూడండి. దెయ్యాలదీవి కని పిస్తోందా లేదా? మరి ఈ కాళ్లు ఏం చూపిస్తున్నాయి? బహుశా డబ్బు పాతరవున్న దిక్కును చూపిస్తూ వుండవచ్చు. తస్సదియ్య, ఇది ఫ్లింట్ గాడిదెబ్బే. వాడు అఖండుడులే. గుర్తుకోసం ఈ ఎముక లిక్కడ ఉంచి ఉంటాడు. నాకు జ్ఞాపకముంది ఇప్పటికీ. డబ్బు ఇక్కడ పాతి పెట్టటానికి వచ్చినప్పుడు ఆరుగుర్ని వెంట పెట్టు కుని వచ్చాడు. ఆరుగుర్నీ తనే టపటప చంపేశాడు. అందులో ఒకణ్ణి ఇక్కడ కీడ్చుకొచ్చి ఈమాదిరిగా పడుకో బెట్టినట్లున్నాడు. కాని-కాని-ఈపొడుగాటి

ఎముకలు, పొడుగాటి కాళ్లు, చేతులు చూస్తుంటే ఎవరో జ్ఞాపకం వస్తున్నాడు ఆ—ఎలర్ డైస్. టామ్ మోర్గన్! నీకు జ్ఞాపకం వున్నాడా ఎలర్ డైస్?" అని అడిగాడు సిల్వర్

"జ్ఞాపకం లేకేం? వాడు నాకు డబ్బు బాకీ వున్నాడుకూడాను. ఎలర్ డైస్ సంగతేమో కాని ఫ్లింట్ ఇక్కడే దెయ్యమై తిరుగుతూ వుంటాడని నా భయం," అన్నాడు మోర్గన్.

"ఫ్లింట్ చచ్చిపోవటం కూడా దారుణంగా చచ్చాడు. ఎప్పుడూ ఒక చేత్తో కత్తి, ఇంకో చేత్తో రమ్‌సీసా పట్టుకుని "యో—హో—హో—బలె గుమ్మెనరమ్," అంటూ పాడేవాడు. ఆ పాట విని చెవులు గింగుర్లెత్తాయనుకో నాకు అసలప్పటి నుంచీ ఆ పాట వింటే నాకు వళ్లు జలదరిస్తుంది," అని జార్జి అన్నాడు.

"ఏమైనా చచ్చిపోయిన వాడు చచ్చిపోయిన వాళ్ళలోనే లెక్క. మళ్ళీ మన్ని వేపుకు తింటానికి వస్తాడంటే నేను నమ్మను. అందులో పగటిపూట ఇంత వెల్తురు వుండగా అసలు రాడు. ఇక లేవండిపోదాము," అని సిల్వర్ మళ్ళీ ముందుకు దారి తీశాడు.

ఈసారి కళాసీలు సిల్వర్‌ను విడిచి దూరం పోలేదు. ఒకప్పుడు తమతో తిరిగిన ఎలర్ డైస్‌కు పట్టిన గతి చూసి వారి గుండెల్లో అర్థంకాని భయం ప్రవే

శించింది. గట్టిగా మాట్లాడటానికి, ఊపిరి తీయటానికి కూడా వెరుస్తూ సిల్వర్ నంటిపెట్టుకునే నడవసాగారు.

## 31. గాలిలో పాట

ప్రేతభూమి శిఖరం చేరగానే మార్గాయాసం తీర్చుకోడానికి అందరం కూర్చున్నాము. శిఖరం మీద నుండి ద్వీపంలో చాల దూరంవరకూ కనిపిస్తోంది. ఒకపక్కన ఫ్లింట్ అగ్రం కనిపిస్తోంది. ప్రకృతి బహు నిశ్శబ్దంగా, నిశ్చలంగా వుంది. దూరనుండి సముద్ర తరంగాల ఘోష అస్పష్టంగా వినవస్తోంది. ఈ ఏకాంతం మా మనస్సుల్లోని బరువును ఇంకా వృద్ధిచేసింది.

సిల్వర్ జేబులోంచి దిక్సూచి తీసి పటంలో చెప్పబడిన దిక్కులు నిర్ణయించుకున్నాడు.

"ఇక లేద్దామా? లేక భోజనాలు కానిచ్చి పోదామా?" అన్నాడు సిల్వర్.

"నాకేమిటో భయంగా వుంది. ఫ్లింటును తలుచుకున్నకొద్దీ కాళ్ళు గజగజ లాడుతున్నాయి," అన్నాడు మోర్గన్.

"బతికి వున్నప్పుడే పిశాచంలాగ వుండేవాడు ఫ్లింట్. చచ్చిపోయే రోజుల్లో మొహం నీలంగా మారి పోయింది," అన్నా డింకొకడు.

"అవును, నీలంగా వుండేది. రమ్ తెగతాగితే అల్లాగే అవుతుంది," అన్నాడు జార్జి.

అస్థిపంజారాన్ని చూసిన దగ్గర్నుంచి కళాసీలు గట్టిగా మాట్లాట్లానికి జంకుతున్నారు. ఫ్లింట్ను గురించి మాట్లాడేటప్పుడు ఫ్లింటు దెయ్యం వింటుందేమో నన్నట్లు గుసగుసగానే మాట్లాడుతున్నారు. అందుచేత నిశ్శబ్దానికేమీ భంగం కలగటం లేదు.

ఇంతలో మా ఎదురుగా కొండవాలుపై వున్న చెట్ల నడుమనుంచి కీచు గొంతుకలో పాడుతున్న పాట వినిపించింది:

"కిమ్మనకుండా గమ్మనలాగయ్
యో—హో—హో—బలె కుమ్మైన రమ్"

ఈపాట వినగానే కళాసీలకు మూర్ఛ వచ్చినట్లయింది. ఒక్కసారిగా భయంతో బిగుసుకుపోయారు. తర్వాత అదేపనిగా వణికిపోయారు. ఆపాట ఇంకా వినిపిస్తూనే వుంది. మంత్రానికి కట్టుబడిన పాముల్లాగా నిశ్చేష్టు లయ్యారు.

పాట ఎంత హఠాత్తుగా ప్రారంభమైందో అంత హఠాత్తుగా ఆగిపోయింది. వెంటనే కళాసీలు సిల్వర్ చుట్టూ ఒకళ్ళనొకళ్ళు కావిలించుకుని ముడుచుకుని కూర్చున్నారు. మోర్గన్ నేలమీదపడి ముఖం కప్పుకున్నాడు.

"బాబోయ్, బాబోయ్, అది ఫ్లింట్ గొంతుకే," అని గొణిగాడు.

సిల్వర్ మొదట అదిరిపడినా వెంటనే తేరు

కున్నాడు. కళ్ళు చిట్లించి పాట వినవచ్చే దిశగా తేరి పారచూశాడు.

"పిరికి సన్నాసుల్లారా! భయపడతా రేమిట్రా పూరికేను. దెయ్యమైతే, ఏం మీదపడి మింగుతుందా? అసలు దెయ్యంకాదు, గియ్యంకాదు. ఎవడో మనిషే మన్ని భయపెట్టటానికి పాడుతున్నాడు," అన్నాడు సిల్వర్.

సిల్వర్ మాటలతో కళాసీలకు కాస్త ధైర్యం వచ్చింది. ఒక్కొక్కడే లేచి నుంచుంటున్నాడు. మళ్లీ హఠాత్తుగా ఆ కీచుగొంతిక వినిపించింది. ఈసారి పాట కాదు.

"డార్బీ! రమ్ తీసుకురారా, డార్బీ! రమ్ తీసుకురా," అని వినిపించింది, మళ్ళీ ఆగిపోయింది.

"అదే. అదే. ఫ్లింట్ దెయ్యమే. ఫ్లింట్ చచ్చిపోతూ సరిగ్గా అలాగే అరచేవాడు. సందేహంలేదు, ఫ్లింట్ మళ్ళీ వచ్చాడు," అన్నాడు మోర్గన్.

డిక్ తన బైబిల్ తీసి బిగ్గరిగా ప్రార్థనలు చదవ సాగాడు. అందరూ వాడిదగ్గర చేరి ప్రార్థనలో పాల్గొన్నారు. కాని సిల్వర్ మాత్రం ఇంకా లొంగలేదు. లోపల ఎంత భయపడుతున్నా పైకిమాత్రం ధైర్యం చూపిస్తున్నాడు.

"తమాషాగా వుందే. ఈ లంకలో వున్న వాళ్లెవరూ డార్బీ పేరు విని వుండరు. మనకి తప్ప డార్బీ

పేరు తెలియదు. ఏమైనా సరే, అది భూతంగానీ, దెయ్యంగానీ—తస్సదియ్య, నేను డబ్బు మాత్రం విడిచిపెట్ట దలచుకోలేదు. ఫ్లింట్ బతికి వున్నప్పుడే వాణ్ని నేను లెక్క చెయ్యలేదు. చచ్చిపోయిం తరవాత భయపడతానా. ఇక్కడికి ఫర్లాంగు రెండు ఫర్లాంగుల దూరంలో ఏడులక్షల పౌనుల నాణాలుండగా, దెయ్యాలకి జడిసి పారిపోతానా? తస్సదియ్య."

కాని కళాసీ లెవరూ కదల్లేదు. సిల్వర్ దెయ్యాలను అవమానిస్తున్నందుకు ఇంకా భయపడి పోయారు వాళ్ళు.

"సిల్వర్! దెయ్యాలకు కోపం రావచ్చు, అల్లా మాట్లాడబోకు. వాటితో దెబ్బలాట పెట్టుకోవటం ఎందుకు?" అన్నాడు జార్జి.

"దెయ్యాలా? ఆ గొంతిక దెయ్యమని అనుకోను. చూశావా ప్రతిధ్వనికూడా వినిపించింది? దెయ్యాలు ఎండలో నుంచుంటే నీడ పడడం ఎప్పుడన్నా చూశావా? నీడ ఉంటే దెయ్యం కాదన్నమాట. అల్లాగే దెయ్యాల మాటలకి ప్రతిధ్వని వినిపించదు. కనక అది ఎవరో మనిషేగాని, దెయ్యం కాదు."

సిల్వర్ వాదన కళాసీలమీద కొంతవరకూ పనిచేసింది, కొద్దిగా ధైర్యం కోలుకున్నారు. జార్జి ఇలాగన్నాడు: "నువ్వు చెప్పింది నిజమే సిల్వర్. అది ఫ్లింట్ గొంతికమాదిరిగా వున్నదిగాని పూర్తిగా

ఫ్లింట్ అనిపించటం లేదు. ఫ్లింట్ కాదు...అది... ఎక్కడో విన్నగొంతికే..."

"తన్నదియ్యా బెన్ గన్ రా," అని అరిచాడు సిల్వర్.

"అవునవును. బెన్ గన్నే. అనుమానం లేదు," అని అంతా ఒక్కసారిగా అన్నారు.

డిక్ వీళ్ళలో కొత్తగా చేరినవాడు గనుక బెన్ గన్ ఎవడో అతనికి తెలియదు;

"బెన్ గన్ దెయ్యమైతే నేం, ఫ్లింట్ దెయ్యమైతే నేం మన్ని పీక్కుతింటానికి?" అన్నాడు డిక్.

మిగతావాళ్లు డిక్ మాటలు విని హేళనగా నవ్వారు: "నీకు తెలియదులే డిక్! బెన్ గన్ బతికి వున్నా, చచ్చిపోయినా పసిపిల్లడుకూడా వాడికి భయపడడు. వట్టి అమాయకుడు, చాదస్తుడు."

కాని డిక్ కింకా నమ్మకం కలగలేదు. బైబిల్ గట్టిగా గుండెకానించుకుని తూలుతూ నడుస్తున్నాడు. ఎండదెబ్బ, అలసట, భయం, డాక్టర్ లివ్ సే చెప్పిన మలేరియా రోగం ఇవన్నీ కలిసి అతన్ని మరింత కుంగదీశాయి.

సిల్వర్ తాడు పుచ్చుకుని ముందు నడుస్తున్నాడు. మా వెనక కళాసీలు ఇందాకటి ఉత్సాహంతో ఎగురుతూ, దూకుతూ నడుస్తున్నారు. ఇప్పుడు వాలు దిగుతున్నాము. కొంత దూరంలో మూడు పెద్ద దేవ

దారు వృక్షాలున్నాయి. ఈ మూడూ ఆ చుట్టుపక్కల వృక్షాలకంటె ఎత్తుగా వున్నాయి. ఈ మూడు చెట్లలోను ఏది పెద్దదైతే దానికింద నే గుప్తధనం కోసం వెదకాలి. మూడు వృక్షాలను చూడగానే కళాసీల ఆనందం వర్ణించ తరంకాదు. సిల్వర్ కూడా చెట్లను సమీపిస్తున్నకొద్దీ తొందరపడుతున్నాడు. ఏడు లక్షల పౌనుల ధనం అంత సమీపంలో ఉందనే సరికి అతడు డాక్టరుగారికి, నాకు ఇదివరకు చేసిన వాగ్దానాలు, జమీందారుగారిపక్షాన చేరాలనే ఉద్దేశ్యమూ అన్నీ మరిచిపోయాడు. నన్ను శత్రువుగా చూడసాగాడు. నాకేసి విషపు చూపులు చూశాడు.

కళాసీలు సిల్వర్‌ను దాటి ముందుకు పరుగుత్తుకు పోయారు. సిల్వర్ వాళ్ళతోపాటు పరిగెత్తలేక కుంటుటూ గెంతుతూ నడుస్తున్నాడు.

ముందుకు పరుగెత్తుకు పోయిన కళాసీలు ఒక్కొక్క చెట్టుదగ్గిరా పరీక్షించి ఆఖరి చెట్టుదగ్గిర ఆగారు. ఒక్కసారిగా అంతా వెర్రికేక పెట్టారు.

"ఎవరో తవ్వేశారోయ్!" సిల్వర్ నిర్ఘాంతపోయాడు. క్షణంసేపు నిలబడి పరిస్థితి అంతా ఆకళించుకున్నాడు. "డాక్టర్ చెప్పిన మాటల అర్థం ఇదన్నమాట," అని నాతో మెల్లిగా అన్నాడు. మేము కళాసీలను సమీపించేసరికి కనిపించిన దృశ్యం ఇది: చెట్టుకింద పెద్ద గొయ్యి వున్నది. గొయ్యి చాలా కాలం

కిందట తవ్వబడినట్లున్నది. ఎందుకంటే గోతిలో కూడా పచ్చిక మొలిచింది. విరిగిన ఒక పారకూడా అక్కడ కనిపించింది. పారమీద "వాలస్" అనే అక్షరాలు కనిపించాయి. ఇదంతా చూసి కళాసీలకు మొహాన కత్తివాటుకైనా నెత్తురు లేకుండా పోయింది.

ఏడులక్షల పౌనులూ ఎగిరిపోయాయ్!

# 32

శూన్యంగా వున్న గొయ్యి చూడగానే కళాసీలందరూ పిడుగు పడినట్లు నిశ్చేష్టులయ్యారు. ఒక్క సిల్వర్ మాత్రమే ఈ పిడుగు పాటునుండి వెంటనే తెప్పరిల్లగలిగాడు. తన కర్తవ్యమేమిటో ఒక్కక్షణంలో నిర్ణయించుకున్నాడు.

నన్ను వెనక్కి పిలిచి "జిమ్! దూరంగానుండు. ఇదిగో యీ పిస్టల్ తీసుకో. అవసరం రావచ్చు," అన్నాడు. అంటూనే కళాసీలకు, గోతికి దూరదూరంగా జరిగాడు. అతని చూపుల్లో ఇప్పుడు నాపై ద్వేషం, క్రోధం మచ్చుకైనా లేవు. ప్రపంచంలో నాకంటే ఆప్తుడు లేడన్నంత ప్రేమగా చూస్తున్నాడు. క్షణక్షణానికి మారిపోయే అతని చిత్తప్రవృత్తి చూసి నాకు పరమాసహ్యం కలిగింది. "మళ్ళీ పార్టీ మారే, శావన్నమాట," అన్నాను.

నా మాటకు సిల్వర్ సమాధానమిచ్చే వ్యవధి లేదు. కళాసీలు నిర్ఘాంత స్థితినుండి తేరుకొని ఒకరొక్కరే గోతిలోకి దూకి మట్టి కెలుకుతూ వెదకసాగారు. మోర్గన్‌కు ఒకటే బంగారు నాణెం దొరికింది. ఆనాణెం ఎత్తి పట్టుకుని సిల్వర్‌కు చూపిస్తూ బూతులు తిట్టసాగాడు. మోర్గన్ చేతులోంచి దాన్ని ఒకొక్కరే తీసుకుని అతి శ్రద్ధగా పరీక్షించారు. అది రెండుగినీల నాణెం. జార్జి అరిచాడు :

"చూశార్రా. రెండు గినీల నాణెం. దేశంవదిలి ఇన్నివేల మైళ్లు ఇన్ని కష్టాలు పడి మనం వచ్చిందెందుకో తెలుసా? ఇదిగో ఈరెండుగినీల నాణెంకోసం. ఇదే కదూ సిల్వర్ నువ్వు వాగ్దానంచేసిన ఏడు లక్షల పౌనుల బంగారం? అవును. నువ్వెప్పుడూ ఏపనీ పాడు చెయ్యలేదు. నువ్వు మహా సమర్థుడివి. నీకు చేతకానిదేమీ లేదు, మేమే చవటలం, దద్దమ్మలం. కదూ?"

సిల్వర్ నిశ్చలంగా నవ్వుతూ, "తవ్వండి, తవ్వండి. ఇంకా గులక రాళ్ళేమన్నా దొరుకుతాయేమో?" అన్నాడు.

"గులకరాళ్లా? అరేయ్ చూశార్రా ఏమంటున్నాడో సిల్వర్? వాడికి మొదటినుంచి తెలుసు ఈసంగతి. వాళ్లతో కలిసి కుట్రచేసి ఇంత కాలమూ మన్ని మోసగించాడు. వాడి మొహం చూడండి, ఎంత కుచ్ఛితం కనిపిస్తుందో?" అన్నాడు జార్జి.

"జార్జి! మళ్ళీ కెప్టెన్ కావాలని చూస్తు న్నావా?" అన్నాడు సిల్వర్. కాని ఈసారి కళాసీ లంతా జార్జి పక్షానే వున్నారు. సిల్వర్ మోసం చేశాడని అంతా గ్రహించారు. ఒక్కొక్కరే గోయ్యి బయటికి వచ్చారు. వాళ్లు మాకు కొన్ని గజాల దూరంలో మాత్రమే వున్నారు. వాళ్లు మాకేసీ మేము వాళ్లకేసీ కొన్ని క్షణాలసేపు అల్లాగే చూసు కున్నాము. సిల్వర్ ఊతకర్ర నానుకుని నిటారుగా నుంచున్నాడు. అతని గాంభీర్యంచూసి నాకు ఆశ్చర్యం కలిగింది. సందేహంలేదు, సిల్వర్ ధైర్యం నిరుపమానం.

చివరికి జార్జి ఇలాగన్నాడు: స్నేహితులారా! సిల్వర్ ఈనిమిషం నుంచీ మనకు శత్రువు. అరుగో ఇద్దరు శత్రువులూ అక్కడ నుంచున్నారు. ఆ కుర్రా డున్నాడే వాడినెత్తురు తాగుతాను ఇవ్వాళ—" అని ఇంకా ఏదో అనబోతున్నాడు. ఇంతలో ఢాం! ఢాం! ఢాం! మూడు తుపాకి గుళ్లు వరసనవచ్చి కళాసీలకు తగిలాయి. జార్జి వెనక్కి విరుచుకుని గోతులో పడ్డాడు. మరొక ఇద్దరు నిలుచున్నచోటనే కుప్పగా కూలి పోయారు.

మిగతా ముగ్గురూ ఒక్క దూకుదూకి పిక్క బలం చూపించారు. గోతులోపడిన జార్జి ఇంకా లేవ బోతున్నాడు. సిల్వర్ పిస్టల్ పేల్చి వాణ్ణి చంపేశాడు.

"జార్జి! ఇక్కడితో నీ బాధ వదిలిపోయింది నాకు," అన్నాడు.

ఇంతలో డాక్టరుగారు, అబ్రహాం గ్రే, బెన్ గన్ చెట్ల చాటునుంచి మా దగ్గిరికి వచ్చారు,

"పరిగెత్తండి. ఆ ముగ్గురూ పారిపోయారు. వాళ్లు పడవలున్న వేపుకు పోతున్నారు. ఆ పడవలు వాళ్లకి చిక్కకుండా చూడాలి," అన్నారు డాక్టరు గారు.

వెంటనే అందరం పరిగెత్తసాగాము. సిల్వర్ కూడా మాతోపాటు పరిగెత్తాడు. తీగెలు, డొంకలు అడ్డం వచ్చినప్పుడు మాత్రం వెనక బడిపోయాడు. పీఠభూమి దిగాము. కొంతదూరంలో కళాసీలు ముగ్గురూ పరుగెత్తుతూ కనిపించారు. వాళ్లు పడవలున్న దిక్కుకు పరిగెత్తటం లేదు. ఆ భయంలో, కంగారులో వాళ్లు ఎటు పోతున్నారో కూడా తెలియకుండా పరుగెత్తుతున్నారు. సరే ఇక భయం లేదనుకొని ఆగాము. ఆయాసం తీర్చుకునేందుకు కూర్చున్నాము. కొంత సేపటికి సిల్వర్ కొయ్యకాలు ఈడ్చుకుంటూ వచ్చాడు.

"నమస్కారాలు డాక్టరుగారూ! మీరు సరిగ్గా సమయానికి వచ్చి నన్నూ జిమ్‌ని రక్షించారు. ఒహో నువ్వా, బెన్ గన్! కులాసాగా వున్నావా?"

"అవును, నేను బెన్ గని. నేనే బెన్ గని. నేనే," అన్నాడు మూడేళ్ళపాటు కాంచన ద్వీపంలో

ఏకాంత జీవితం గడిపిన కళాసీ బెన్‌గన్. "సిల్వర్! నువ్వు కులాసాగా వున్నావా?" అని కూడా అడిగాడు బెన్‌గన్ వంటి అమాయకుడు తప్ప ఇంకెవరూ సిల్వర్‌ని క్షమించ లేరు.

తరవాత లేచి అందరం పడవలున్న దెసగా నడిచాము. దోవలో డాక్టరుగారు మా సమస్య లన్నిటినీ పరిష్కరించారు. ఆయన చెప్పిన కథ ఇది: బెన్‌గన్ ఏకాకిగా ద్వీపమంతా సంచరిస్తూ అస్థి పంజరాన్ని చూశాడు. దాన్నిబట్టి గుప్తధనం ఉన్న పాతర కనిపెట్టాడు. తన దగ్గిరఉన్న పారతో తవ్వి బంగారం చేజిక్కించు కున్నాడు. అంతకు ముందే అతడు ద్వీపంలో ఈశాన్య మూలగావున్న ఒక కొండ గుహాను తన నివాసంగా ఏర్పరుచు కున్నాడు. పాతర నుండి గుహాకు బంగారాన్ని, నాణాలని చేర వేయటానికి చాలకాలం పట్టింది. హిస్పానియోలా ఇంకా రెండు నెలలకు వస్తుందనగా అతడు తన పని పూర్తి చేశాడు.

డాక్టరుగారు బెన్‌గన్‌ని కలుసుకున్న రోజునే ఈ రహాస్యం అతనినుండి లాగారు. మర్నాడు రేపులో చూస్తే హిస్పానియోలా లేదు. అందుచేత కాంచన ద్వీపపటం ఇక అనవసరమని తలచి దాన్ని సిల్వర్‌కిచ్చేశారు. బెన్‌గన్ గుహాలోకి మకాం మార్చేసి

మట్టికోటనుకూడా సిల్వర్ పార్టీకి ఇచ్చేశారు. బెన్ గన్ గుహాలో సమృద్ధిగా గొర్రె మాంసం వున్నది. బోలెడు జల సదుపాయం వుంది. అదీగాక అక్కడ వుండి ధనం రక్షించుకోవలసి కూడా వుంది. అందుచేత మట్టికోటను సిల్వర్ కిచ్చి వెయ్యడం జరిగింది.

ఇక సముద్రానికి గుప్తధన నిక్షేపం దగ్గిరికెలా వచ్చారంటే—ఆరోజు ఉదయం సిల్వర్ తన అనుచరులతో అక్కడికి వెడుతున్నాడని ఆయనకు తెలుసుగా. అక్కడ ధనం కనబడక పోయేసరికి వాళ్లు నాకేమి హానిచేస్తారోనని భయపడి గ్రే, బెన్ గన్‌లను వెంటపెట్టుకుని సముద్రానికి అక్కడికొచ్చారు. గుహారక్షణకు జమీందారుగార్ని ఉంచారు. బెన్ గన్ పరిగెత్తడంలో అనుభవమున్న వాడుగనుక డాక్టరుగార్ని, గ్రేను వెనకవదలి ముందుకుపోయాడు. ఒక చెట్టుమీద ఎక్కి ఆకుల గుబురుల్లో దాక్కుని సిల్వర్‌ను, అతని మిత్రులను భయపెట్టడానికి "యో—హో—హో-" పాటపాడాడు. అతడలా చేయటంవల్ల తిరుగుబాటు దార్లుధననిక్షేపం చేరడం కొంత ఆలస్యం అయింది. ఈలోగా డక్టరుగారు, గ్రే మమ్మల్ని సమీపించడానికి వీలయింది.

ఇదంతావిని సిల్వర్ నిట్టూర్పువిడిచి అన్నాడు: డాక్టరుగారూ! జిమ్ హాకిన్స్ నాతో ఉన్నాడు గనుక బతికిపోయాను, లేకపోతే నాగతి మీరాలోచించి

ఉండేవాళ్లా? వాళ్ళంతా కలిసి నన్ను ముక్కలుకింద తొక్కేసి ఉండేవాళ్లు."

"అవును జిమ్ ఉన్నాడు గనకనే. లేకపోతే నిన్ను రక్షించే ప్రమాస నాకేముంది?" అన్నారు డాక్టర్ లివ్ సే.

అప్పటికి పడవలున్న స్థలాన్ని చేరుకున్నాము. డాక్టరుగారు ఒక పడవను గొడ్డలితో పాడుచేశారు. రెండోపడవ ఎక్కి ఉత్తరసింధుశాఖకు బయల్దేరాము. సింధుశాఖ ఎనిమిది తొమ్మిది మైళ్ళదూరముంది. సిల్వర్ చాలా అలిసిపోయివున్నా, అతన్నికూడా తెడ్డువెయ్య వలిసిందని డాక్టరుగారు ఆజ్ఞాపించారు.

ద్వీపం తూర్పుకోస్తా మీదుగా ఉత్తరానికి పడవ నడిపాము. బెన్ గన్ గుహ తీరానికి దగ్గరగానే వుంది. పడవలోనుంచి చూస్తే గుహద్వారం కనిపిస్తుంది. ద్వారంవద్ద జమీందారుగారు తుపాకి పట్టుకుని నుంచున్నారు. మేము ఆయనకేసి చేతిగుడ్డలు వూపాము. సిల్వర్ కూడా హుషారుగా "నమస్కారమండోయ్" అని కేకవేశాడు.

గుహదాటి మూడుమైళ్ళు పైకి పోయాము. ఉత్తర సింధుశాఖలో హిస్పానియోలా వున్నది. కాని అది నేను వదిలిపెట్టివచ్చినచోట లేదు. సముద్రం ఎత్తుగా వచ్చినందువల్ల తరంగాలకి ఓడ కదిలి ముందుకు వస్తున్నది. ఓడఎక్కి మరొక లంగరు

సిద్ధంచేసి సింధుశాఖ నుండి బయటికి తీసుకువచ్చాము. బెన్‌గన్ గుహాకు సమీపంలో ఒక చిన్న రేవు ఉన్నది. ఆ రేవులో హిస్పానియోలాను నిలిపాము. అందరం ఒడ్డుకు వచ్చేశాము. ఓడకు కాపలాగా అబ్రహాం గ్రేను ఉంచాము.

బెన్‌గన్ గుహావద్ద జమీందారుగారు మమ్మల్ని ఎదుర్కొన్నారు. నన్ను కరస్పర్శ చేశారుగాని నేను చెప్పకుండా పారిపోయిన సంగతికు ఒక్క మాటైనా అన లేదు. సిల్వర్ అతి వినయంగా సెల్యూట్ చేశాడు. జమీందారుగారి ముఖం ఎర్ర పడింది.

"లాంగ్‌జాన్ సిల్వర్! నువ్వు అతి ఘోర దుర్మార్గుడివి. ద్రోహివి. వట్టి ద్రోహివి కాదు. మహా ద్రోహివి. నిన్ను శిక్షించవద్దని డక్టర్ లివ్‌సే బతి మాలాడు గనక ఊరుకుంటున్నాను కాని నీమూలంగా చనిపోయిన వాళ్ళ ఆత్మలు మాత్రం నిన్ను వదిలి పెట్టవు..." అని ఆకోపంలో ఇంక మాట్లాడలేక పోయూ రాయన.

"మీదయాబుణం తీర్చుకోలే నండి," అని సిల్వర్ భక్తితో మళ్ళీ సెల్యూట్ చేశాడు.

అందరం గుహాలో ప్రవేశించాము. చాలా విశాలంగా వుంది. గాలి, వెల్తురూ ధారాళంగా వస్తు న్నాయి. లోపలనే నీటిబుగ్గ ఒకటి వున్నది. పరిశుభ్ర

జలం అందులోనుండి ఫూరి చిన్న కాల్వగా బయటికి పోతున్నది. నేలంతా చక్కటి ఇసుక

ఒకచోట పెద్దచలి మంట వేయబడివున్నది. దానిముందు కెప్టెన్ స్మాలెట్ పడుకుని వున్నాడు. ఇంకొకమూల బంగారు నాణాలు, బంగారు కడ్డీలు రాసులుగా పోసివున్నాయి. ఏ బంగారం కోసం ఇంత దూరం వచ్చామో, ఏ బంగారం కోసం పదిహేడు గురుమనుషులు ప్రాణాలు కోల్పోయారో అదే అది. ఈధనం సేకరించటానికి ఇంకెంత మంది చనిపోయారో ఎన్ని రక్త ప్రవాహాలు, కన్నీటి కాల్వలు ప్రవించాయో? ఎంత క్రౌర్యం దౌర్జన్యం జరిగిందో, ఎవరికి తెలుసు? తెలిస్తే సిల్వర్‌కూ, మోర్గన్‌కు, బెన్‌గన్‌కు తెలియాలి. వీరిలో ప్రతివాడు ఆరోజుల్లో కెప్టెన్‌కు ఫ్లింట్ చేసిన దుష్కార్యాల్లో పాల్గొన్నవాడే. చివరికి ఆఫ్లింట్ మాత్రం ఏమయ్యాడు? ఒక్కపెన్నీ అనుభవించకుండా అంత ధనమూ పరులకు వదిలేసి దిక్కులేనిచావు చావలేదా ?

ధనరాసుల ఎదుట నుంచి చూస్తుంటే ఈ ఆలోచనలన్నీ నన్ను ముసురుకున్నాయి. కెప్టెన్ స్మాలెట్ పిలుపుతో తెప్పరిల్లాను.

"జిమ్! నిన్ను పొగడాలో తిట్టాలో తెలియటం లేదు. నీమూలాన మాకు ఎన్ని ఉపకారాలు జరిగాయో చెప్పలేను. నువ్వూ, నేను సముద్ర ప్రయా

గాలికి పనికి రామోయ్. ఇక ముందెప్పుడూ నువ్వు నన్ను విడిచిపెట్టకుండా ఏర్పాటు చేస్తాను. అక్కడెవరూ నుంచుంది? సిల్వర్ కాదూ? ఇక్కడికెందుకొచ్చావ్?"

"మళ్ళీ డ్యూటీకి వచ్చానండీ, అన్నాడు సిల్వర్ సెల్యూట్ చేస్తూ.

"ఓహో," అన్నాడు కెప్టెన్. ఇంకేమనలేదు.

ఆ రాత్రి భోజనాలు బలే సర్దాగా గడిచాయి. కులాసాగా నవ్వుతూ, పేలుతూ తిన్నాము ఉప్పులో ఊరవేసి బెన్‌గన్ తయారుచేసిన గొర్రె మాంసం మహారుచిగా ఉంది. హిస్పానియోలా లోంచీ తెచ్చిన ద్రాక్షరసం తలొకగ్లాసు తాగి త్రేన్పడంతో భోజనాలు పూర్తిఅయినాయి. సిల్వర్ ఏకారణం చేతనో వెలుగులోకి రాకుండా నీడలోనే కూర్చున్నాడు. మాథలోకల్లో అంత స్వేచ్ఛగా పాల్గొనక పోయినా తిండిమాత్రం తక్కువ తినలేదు.

# 33. సుఖాంతం

మర్నాటి ఉదయం గుహ నుండి ధనరాసులను హిస్పానియోలా లోనికి చేరవేయడంతో సరిపోయింది. క్రితంరోజు పారిపోయిన ముగ్గురు కళాసీల జాడలేదు గనక మేము నేరేపని పెట్టుకోకుండా ఈ పనిలోనే నిమగ్నమయ్యాము. బెన్‌గన్, గ్రే పడవలో

ధనరాసులు తీసుకుపోయి ఓడలోకి చేర్చడం, మిగతా వాళ్లు గుహానుండి ఒడ్డుకి సంచులు మోసుకుపోవటం. నేను సంచులు మొయ్యలేనందున గుహాలోవుండి నాణాలని సంల్లోకి ఎత్తటం పని పెట్టుకున్నాను. ముఖ్యంగా బంగారపు కడ్డీలు బాగా బరువుగా ఉన్నాయి. ఒక్కొక్కసారికి రెండుకంటే ఎక్కువ మొయ్యలేక పోయారు. అయినా ఆమోసేది అచ్చమైన బంగారం కనుక అదొక అదృష్టంగానే భావించారు కాని ఎవరూ విసుక్కోలేదు.

నాణాలు రకరకాలుగా ఉన్నాయి. భూలోకంలో వున్న ప్రతి దేశపు నాణాలు అందులో ఉన్నాయనుకుంటాను. ఇంగ్లీషు, ఫ్రెంచి, స్పానిష్, పోర్చుగీసు, ఇల్లా ఒక్కొక్క దేశంవే ఎంచుతూ సంచీల్లో నింపాను. గుండ్రటివి, చదరంవి, త్రిభుజాలు, షడ్భుజాలు, అష్టభుజాలు, చిన్నవి, పెద్దవి, నూరేళ్ళ కిందటివి, పదేళ్ళ కిందటివి, అబ్బ, ఎన్నిరకాలో, ఎన్నో చెప్పలేను.

ప్రతిరోజు ఉదయమునుండి సాయంకాలంవరకూ ఇదేపనిలో నిమగ్నమయ్యే వాళ్ళం. కాని ఎవ్వరికీ విసు గనిపించలేదు.

మూడవ రోజు రాత్రిగావును, నేను డాక్టరు గారూ కొండపైన షికారుగా నడుస్తుండగా దూరం నుండి పాటలు వినవచ్చాయి.

"హు. వాళ్ళే. ఆ పారిపోయిన ముగ్గురూ అక్కడెక్కడో ఉన్నారు," అన్నారు డాక్టరుగారు

లాంగ్ జాన్ సిల్వర్ మాతో స్వేచ్ఛగా ఉంటూ, మాతోనిలోపాల్గొంటున్నాడు. రోజూ కెప్టెన్ స్మాలెట్ జమీందారుగారో అతన్ని అవమానించేందుకు ఏవో సూటిపోటు మాటలంటున్నా, అతడు దులుపుకుని పూరుకు చేవాడు. ఎవ్వరేమన్నా నోరు మూసుకుని వుండేవాడు. అతన్ని స్వేచ్ఛగా తిరగనిచ్చినా కుక్క మాదిరిగా చూసేవాళ్లు. బెన్ గన్ మాత్రం సిల్వర్ అంటే పైకి కాకపోయినా, లోపలైనా భయపడేవాడు, పూర్వపురోజులు తలుచుకుని. నేనుకూడా సిల్వర్ నేమీ అనే వాణ్ణికాదు. అతడు నా ప్రాణం రక్షించి నందుకు కృతజ్ఞతతో నా మనస్సు నిండిపోయి, అతని దుర్గుణాలను ఎంచలేక పోయాను.

పారిపోయిన ముగ్గురు కళాసీలను ఏమి చెయ్యటమా అని ఆలోచించాము. చివరికి వాళ్లను ద్వీపంలో విడిచి పెట్టటానికే నిశ్చయించాము. ఈ నిర్ణయానికి బెన్ గన్ ఎంతైనా సంతోషించాడు. అబ్రహాంగ్రే దాన్ని సమర్థించాడు. గుహలో మందుగుండు సామగ్రి, కొన్ని తుపాకులు, కత్తులు, కొంత గొర్రెమాంసం, కొన్ని పరికరాలు, బట్టలు, ఒక తెరచాప గుడ్డ, ఒక పొడుగాటి తాడు, కొంతపొగాకు, మందులు వాళ్లకోసం ఉంచాము.

దనరాసులు ఓడలోకి చేర్చడం పూర్తయింది. కొన్ని రోజులకు సరిపడే గొర్రె మాంసం, మంచి నీళ్ళు కూడా ఓడలోకి చేరవేశాము. ఒక ప్రశాంత ప్రభాతాన లంగరెత్తి, తెరచాప లెత్తి ప్రయాణం సాగించాము. కెప్టెన్ స్మాలెట్ ఆజ్ఞప్రకారం మట్టి కోటపై అదివరకు ఎగరేసిన బ్రిటిష్ జెండానే ఓడపై కూడా ఎగరవేశాము.

హిస్పానియోలా బరద్దేరింది. పారిపోయిన కళాసీలు ఇంతకాలం మా చర్య లన్నిటినీ ఎక్కడో పొంచివుండి చూస్తూనే వున్నారనుకుంటాను. ఎందు కంటే మా ఓడ బయల్దేరే సమయానికి ఎక్కడినుండి వచ్చారో ఏమో, సముద్రతీరానికి వచ్చారు. అక్కడ మోకాళ్లమీద పడి చేతులు పైకెత్తి "మమ్మల్ని కూడా తీసుకుపోండి బాబో! రక్షించండి బాబో!" అని కేకలు వేయసాగారు. మా హృదయాలు ఒక క్షణంపాటు ద్రవించాయి వారిని ఆ దుస్థితికి వదిలి పోవటం చాల బాధకరంగా తోచింది. కాని ఏం చేస్తాం? వాళ్లని నమ్మటానికి వీలులేదు. ఓడలో కెక్కించుకుంటే ఇంకోసారి తిరుగుబాటు చెయ్యరని నమ్మక మేముంది? అందుచేత గుండెరాయి చేసుకుని డాక్టరుగారు ఇలా కేకేశారు :

"మిమ్మల్ని తీసుకు పోవటానికి వీల్లేదు. ఒక వేళ తీసుకుపోయినా, మిమ్మల్ని కోర్టులో హాజరు

పరచటం, ఇన్ని హత్యలు చేసినందుకు మీకు ఉరి శిక్ష పడటం తప్పదు. అందుచేత మీరిక్కడే ఉండండి. అదుగో అక్కడ గుహ కనిపిస్తోందే, అందులో మీకు కావలసిన సామాను, తిండి ఉంచిపోతున్నాం."

ఈ మాటలు విన్నాక కూడా వాళ్ళు ఇంకా ప్రాధేయపడ సాగారు. మాలో ఒక్కొక్కళ్ళనీ పేరు పేరునా పిలిచి బతిమాలారు. కాని మాఓడ నిర్దయగా సముద్రంలోకే కదిలి పోసాగింది.

ఇంతలో వాళ్లలో ఒకడు ముందుకు, అంటే, నీటి అంచువరకూ పరుగెత్తుకు వచ్చి తుపాకి ఎత్తి పేల్చాడు. తుటా సిల్వర్ చెవిపక్కగా దూసుకుని తెరచాపలోనుండి పోయింది. వాళ్ళు ద్రోహబుద్ధిని గూర్చి మేము అనుమాన పడింది నిజమే అయింది. ఆ తరవాత కొంత దూరంవరకూ మేము నరంబిమీద బాహాటంగా నుంచోలేదు. మళ్లీ చూసేసరికి వాళ్ల క్కడ లేరు. ద్వీపంలోకి వెళ్లిపోయారు. ఇంకా కొంత దూరం పోయేసరికి, ద్వీపభూమి, చెట్లు, క్రమంగా టెలిస్కోపు కొండ శిఖరాలు అన్నీ దృక్పథం నుండి అదృశ్య మైనాయి. అమ్మయ్య అనుకుని నిట్టూర్పు విడిచాను.

ఓడ నడపటానికి సిబ్బంది కొరత మూలంగా ఇబ్బంది ఎక్కువైంది. అందరం రెండు చేతులా పని చేస్తున్నా కష్టమైంది. కెప్టెన్ స్మాలెట్ ఇంకా బల

హీన స్థితిలోనే వున్నందున ఆయన పనల్లా ఆజ్ఞాపించటమే. ఎలాగో ఓలాగు తంటాలుపడి స్పానిష్ అమెరికా (దక్షిణ అమెరికా) వరకూ వచ్చాము. అక్కడనుండి ఇంగ్లండు చేరటం, తగినంత సిబ్బంది లేకుండా అసంభవం. ఒక రేవు పట్టణం వద్ద మా ఓడ లంగరు దించాము. బోలెడుమంది నీగ్రోలు, మెక్సికన్లు పళ్లు, కాయగూరలు అమ్మకు నేవారు మమ్మల్ని చుట్టుముట్టారు. అంతమంది అమాయక జనులను, ముఖ్యంగా పట్టణంలో తోరణాలవలె ప్రకాశిస్తున్న దీపాలను, సందడిని, సమ్మర్దాన్ని చూడగానే మేము వదిలివచ్చిన కాంచన ద్వీపపు చీకటి, ఏకాంతం భయంకరంగా, ఏదో పీడకలగా తోచాయి.

జమీందారుగారు, డక్టరుగారు నన్ను వెంటపెట్టుకుని ఊళ్లోకి బయల్దేరారు. వీధులన్నీ తిరిగాము ఆ రాత్రి పూట. ఒకహోటల్లో ఒక ఇంగ్లీషు ఓడ యజమాని కనిపించాడు. జమీందారుగారు అతనితో కబుర్లుపెట్టు కూర్చున్నారు. ఆతరవాత అతని ఓడలోకికూడా వెళ్లి, కడుపారా భోజనం చేశాము. ఏ తెల్లవారు కట్లనో హిస్పానియోలాలోనికి తిరిగి వచ్చాము.

మేము వచ్చేసరికి బెన్‌గన్ ఒక్కడే సరంబీ మీద ఉన్నాడు. మమ్మల్ని చూసీ చూడగానే వెర్రి అభినయాలు చేస్తూ తను చేసిన తప్పు క్షమించమని కాళ్లా వేళ్లా పడ్డాడు. సిల్వర్ పారిపోయాడు. పారిపోవటంలో బెన్‌గన్ కూడ తోడుపడ్డాడు. మా మంచి కోసమే వాణ్ణి పారిపోనిచ్చాననీ, వాడు గనుక ఓడలో వుంటే ఏక్షణాన ఏ దుర్బుద్ధిపుట్టి అందర్నీ సరికి వేస్తాడోనని భయపడ్డాననీ చెప్పాడు బెన్‌గన్. సిల్వర్ వట్టి చేతులతో పోలేదట. ఒక సంచీకోసి సుమారు నాలుగువందల గినీలు దొంగిలించి మరీ పోయాడట. నాలుగువందల గినీలు పోయినందుకు మేమెవ్వరం విచారించలేదు. అంత చవకలో సిల్వర్‌ను వదిలించుకో గలిగినందుకు అందరం సంతోషించాము.

ఆ ఉదయం మాకు అవసరమైనంత మంది కళాసీలను బేరమాడి తీసుకువచ్చాము. ప్రయాణం క్షేమంగా ముగిసింది. బ్రిస్టల్‌లో మా ఓడ ఆగే రోజుకి రేవులో మిస్టర్ బ్లాండ్లీ సిద్ధంచేసిన కొత్తఓడ కనిపించింది. మేము పెట్టిన గడువు దాటిపోయినందున, మాకే ప్రమాదం వాటిల్లిందోనని బ్లాండ్లీ కంగారు పడ్డాడట. మమ్మల్ని వెదికేందుకని ఓడను, సిబ్బందినీ సిద్ధంచేసి రేపో, మాపో బయల్దేర బోతున్నాడట.

తిరిగి వచ్చినవాళ్ళం అయిదుగురం, బెన్ గన్‌తో కలిపి.

ఆతరవాత మేము వాటాలు విభజించి పంచుకున్నాం. కెప్టెన్ స్మాలెట్ తనవృత్తి మానుకుని తన ధనంతో కులాసాగా విశ్రాంతి తీసు కుంటున్నాడు. అబ్రహాం గ్రే తన వాటాధనం భద్రంగా బ్యాంకుల్లో దాచాడు. నావిక విద్యను అభ్యసించాడు. ఇప్పుడతను ఒక చక్కని ఓడకు భాగస్వామి. బెన్‌గన్ తన వాటాకు వచ్చిన వెయ్యిపౌనులూ మూడువారాలు తిరక్కుండానే ఖర్చు చేశాడో పోగొట్టుకున్నాడోగాని, మొత్తానికి ఇరవయ్యో రోజుకే వట్టి చేతుల్తో మాదగ్గిరికివచ్చాడు. జమీందారుగారు అతనికి ఒక హోటలు కొనిపెట్టారు. అత డిప్పుడు హోటలు నడుపుతూ సుఖంగా కాలక్షేపంచేస్తున్నాడు.

సిల్వర్‌నుగూర్చి మాకు అప్పటికీ, యిప్పటికీ ఏ కబురూలేదు. బహుశా తన పెళ్ళాన్ని కలుసుకొని, తన చిలక కెప్టెన్ ఫ్లింట్‌తో ఏదూర దేశంలోనో హాయిగా జీవిస్తూఉండి ఉంటాడను కుంటాను. ఏమైనా బిల్లీబోన్స్ చెప్పిన "ఒంటికాలు పెద్దమనిషి" మాత్రం నా జీలోకి మళ్ళీ రాకుండా వింత మాయ మయ్యాడు.

కాంచన ద్వీపంలో ఇంకా కొన్ని ధనరాసులున్నాయి. అవి అలాగే శాశ్వతంగా ఉంటాయి కూడాను. ఏమంటే మళ్ళీ ఆ ఏకాంత భయంకర రక్తసిక్త కాంచనద్వీపంలో నేను కాలుపెట్టడం కలలో కూడా కల్ల. నిరంతర సుఖస్వప్నం లాగా వెళ్ళిపోయే నాజీవితంలో అప్రశుతులుగా తోచే ఘడియలల్లా. "యో—హో—హో—బలె గుమ్మైన రమ్" అని ఏ నావికుడైనా పాడుతుంటేనూ, లేక సిల్వర్ చిలక "పెసో, పెసో, పెసో..." అని కలలో అరిచి నా నిద్ర భంగం చేసి నవ్వడూనూ—అంతే. ఇంతే నా కథ; ఇక సెలవు!

సంపూర్ణం

